శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



జగదాచార్య సింహాసనాధిపతి

శ్రీ ఉ. వే. ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్య స్వామివారు అనుగ్రహించిన

# శ్రీభాష్యసారామృతమ్



వరదరాజ పెరుమాళ్, కాంచీపురం



ఆంధ్రానువాదం

'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్లగ శింగరాచార్యులు

సమర్పణ: ఉ. వే. శ్రీమాన్ మొలుగు వేంకటాచార్యులు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# నివేదనమ్

గడచిన శతాబ్దిలో కాంచీపురంలో నివసించినవారు, మహా మహిమోపాధ్యాయ, పద్మ విభూషణ, జగదాచార్య సింహాసనాధిపతి, కాంచి ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్య స్వామి వారు 92 సంవత్సరాల పాటు ఈ విభూతిలో వేంచేసి ఉండి, అనితర సాధారణమైన, అసామాన్యమైన, ఎదురులేని తమ ప్రతిభా పాటవాలతో పాండిత్య ప్రకర్షతో వైదిక సంప్రదాయాన్ని, విశేషించి భగవద్రామానుజ సిద్ధాంత సంప్రదాయాలను ఆసేతుహిమాచలం ప్రచారం చేశారు. తమ గ్రంథాలతో, ఉపన్యాసాలతో, మాసపత్రికలతో, వాద పతివాదాలతో వారు విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయాలకు చేసిన సేవ సర్వజనవిదితం. శ్రీస్వామివారి రూపం కానీ, వాక్కు కానీ అసదృశం, అసామాన్యం, అనితరసాధారణం, వాచామగోచరం —అని ఈ విధంగా వర్ణించవలసినదే తప్ప, పూర్తిగా తెలియగలిగినవారు ఎవరూ లేరు అనేది అత్యంత వాస్తవమైన విషయం. వీరు రచించిన గ్రంథాలు సహస్రాధికాలు. సంస్కృత భాషలో, ద్రావిడ భాషలో, ఆంధ్ర భాషలో, హిందీలో, ఇంగ్లీషులో వీరి గ్రంథాలు, పత్రికలు ఎన్నో ప్రచురింపబడ్డాయి. వాటిలో ప్రస్తుతం అనువదింపబడిన ఈ శ్రీభాష్య సారామృతం అనే గ్రంథం ఒకటి.

ఈ గ్రంథాన్ని శ్రీ స్వామివారు తమకు 84 సంవత్సరాలు నిండిన తరువాత రచించినట్లు ఈ గ్రంథంలో వారు తెలియజేసినదానినిబట్టి మనకు తెలుస్తున్నది. ఈ గ్రంథ రచనా కాలంలో వారికి అనుకోకుండా ఆరోగ్య లోపం ఏర్పడినందున, కొంత గ్రంథ రచన అయిన తరువాత, అంటే, ప్రథమాధ్యాయం వరకు రచించిన తరువాత, మిగిలిన భాగాన్ని తమ ఆరోగ్య స్థితిని బట్టి చాలా సంగ్రహంగా రచించి పూర్తి చేస్తున్నట్లు వారు తెలియజేశారు. నిజంగా ఆరోగ్యంగా వారికి సహకరించి ఉంటే, ఈ గ్రంథం ఇంకా ఎంత మధురంగా ఉండేదో, ఇంకా ఎన్ని అమూల్యమైన విషయాలు ఇందులో మనకు అందేవో, తెలియదు. ఆ అదృష్టం మనకు లభించలేదు. అయినప్పటికీ ఈ గ్రంథంలో వారు

తెలియజేసిన విశేషాలు ఆంధ్రదేశంలో ఉండే ఆస్తిక పాఠకులకు అందరికీ నివేదించాలనే ఆశతో, ఉత్సాహంతో ఈ అనువాద ప్రయత్నం చేయబడింది.

ఈ గ్రంథాన్ని తెలుగులో అనువదించడానికి అనుమతి ఇచ్చిన శ్రీ స్వామి వారి మనుమలైన ప్రతివాది భయంకర రాజహంస స్వామి వారికి అనేక కృతజ్ఞతలు.

అనువాదంలో దొరిలిన దోషాలను సహృదయులైన పాఠక మిత్రులు క్షమిస్తారని నమ్ముతున్నాను. స్వస్తి.

భాగవత విధేయుడు,

ఈ. ఏ. సింగరాచార్యులు.

# శ్రీభాష్యసారామృతమ్

**శ్రీమద్వాదిభయంకరార్యమహితశ్రీవంశలబ్ధోదయం**

**సర్వజ్ఞం జగతాం గురుం గుణనిధిం విద్యానిషద్యాత్మకమ్,**

**వాత్స్య శ్రీమదనంత దేశికవరం నత్వా చ నుత్వా ముహుః**

**కుర్వే ద్రావిడ భాషయా సులలితం శ్రీభాష్యసారామృతమ్.**

**లోకోపకారకకృతీః భూయసీః లిఖత స్తథా,**

**అణ్ణంగరార్యదాసస్య కృతిరేషా విజృంభతామ్.**

**శ్రీభాష్యార్థః కీదృశోఽస్తీతి కేచిత్**

**జిజ్ఞాస్యంతే భాష్యసింధోః దవిష్ఠాః,**

**భాష్యార్థానాం తీవ్రదృశీ వైఖరీతి**

**జ్ఞానం దాతుం రచ్యతేఽయం నిబంధః.**

*ఎంబెరుమానార్ ఎమక్క ళిత్త పాడియత్తిన్*

*శెంబొరుళై చ్చీర్మై మిక త్తేర్ న్దిడవే – నంబుకిన్ఱ*

*ఆరియర్ క్కు ప్పాడియత్తి న్భుంపొరుళ్ ఈదెన్ఱు కాట్టు*

*ప్పోరుకిన్ఱ దిన్నూల్ పొలిందు.*

(భగవద్రామానుజులు మనకు అనుగ్రహించిన శ్రీభాష్యంలోని అందమైన అర్థాల గొప్పతనం స్పష్టం చేయడం కోసం, ఆ సిద్ధాంతాన్ని నమ్మే ఆచార్యులకు శ్రీభాష్యంలోని గంభీరమైన అర్థాలు ఇవి –అని చూపేటట్లుగా ఈ గ్రంథం గొప్పగా అమరి ఉన్నది. )

**శ్రీభాష్యమంగళశ్లోకంలోని అర్థవివరణం**

*అఖిలభువన జన్మ స్థేమభంగాదిలీలే*
*వినత వివిధభూతవ్రాత రక్షైకదీక్షే,*
*శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే*
*భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.*

ఈ శ్లోకం ద్వారా శ్రియః పతి అయిన భగవంతుని సన్నిధిలో భక్తి ప్రతిరూపాపన్న జ్ఞానం కలగాలని శ్రీరామానుజులు కోరుతున్నట్లుగా పైన తోచే అర్థం. ఇందులో ఉండే ఐదు విశేషణాలతో నమ్మాళ్వారుల గొప్పతనాన్ని వివరించి, వారి విషయంలో భక్తి కలగాలని ప్రార్థిస్తున్నట్లుగా లోపలి అర్థం.

భగవంతుడు సకల లోకాలను సృష్టించి, రక్షించి, లయం చేయడం లీలగా కలవాడు. తనను నమస్కరించిన వేరు వేరు వర్గాలకు చెందిన ప్రాణి సమూహానికి ముక్తిని అనుగ్రహించడం అనే రక్షణను చేయడమే అద్వితీయవ్రతంగా కలవాడు. "వేదాంత విழுప్పొరుళిన్ మేలిరుంద విళక్కు" అని పెరియాళ్వార్లు పలికినట్లుగా వేదాంతాలలో

గొప్పగా ప్రకాశించే స్వరూపంతోనూ, కళ్యాణ గుణాలతోనూ చాలా గొప్పవాడు, లక్ష్మీపతి. ఇటువంటి గొప్పతనం కలిగిన పరమ పురుషుని విషయంలో భక్తి రూపాపన్నమైన జ్ఞానం కలగాలని భగవంతుని విషయంగా ఉండే అర్థం. ఇందువల్ల ఇక్కడ శాస్త్రార్థ సూచనం ఈ శ్లోకంలో చేయబడినట్లు అయినది.

**ఇక, నమ్మాళ్వార్ల పరమైన అర్ధాన్ని వినండి**

(అఖిలభువన జన్మస్థేమభంగాదిలీలే ) ఈ విశేషణం అళ్వార్లకు అన్వయించినప్పుడు రెండు విధాలుగా యోజనను చేయవచ్చును. అఖిల భువనాల జన్మస్థేమ భంగాలకు ఆది, అంటే, కారణభూతుడైన, భగవంతునితో లీలారసాన్ని అనుభవించేవారు, ఆళ్వారులు. "అఖిలభువన జన్మస్థేమభంగానామ్ ఆదిః, సర్వేశ్వరః, తేన సహ లీలా యస్య తస్మిన్" అని ఇక్కడ విగ్రహ వాక్యాన్ని గ్రహించాలి. తిరువాయ్ మొ*ழி* దివ్య ప్రబంధంలో "ఎన్నుడైయ పందుమ్ క*ழ*లుమ్ తందు పోగు నంబీ" అని, " విళైయాడప్పోదుమిన్ ఎన్నైప్పోందోమై" అని ఈ విధంగా పలు పాశురాలలో భగవంతునకు, ఆళ్వారులకు మధ్య సంభవించిన లీలలు వాచామ గోచరాలు. ఇది ఒక యోజన.

ఇంకొక యోజన ఏమంటే, " అఖిలం, భువన జన్మ స్థేమభంగాది లీలః యస్య" అని గ్రహించి, భగవంతునే అన్ని విధాలైన వస్తువులుగా కలవారు, అళ్వార్లు. అంటే, "ఉణ్ణుమ్ శోఱు పరుగు నీర్ తిణ్ణుమ్ వెట్రిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్ ఎంబెరుమాన్" అనే విధంగా ఉన్నవారు నమ్మాళ్వారులు అని చెప్పినట్లు అయినది. ఈ విధంగా భగవంతుడైన శ్రీమన్నారాయణ సర్వస్వం అని భావించి ఉన్నవారు ఆళ్వారులు ఒక్కరే కనుక, ఈ యోజన కూడా చాలా పొసగుతుంది. ఇదే ముఖ్యమైన యోజన.

(వినత వివిధభూతవ్రాత రక్షైకదీక్షే, ) "వినత వివిధ భూతవ్రాత రక్షకత్వమ్" అనేది భగవంతుని కు చెప్పినప్పటికీ, " అనతిక్రమణీయం హి చరణ గ్రహణమ్" ( పాదాలను పట్టుకోవడం అనేది విడిపించుకోవడానికి సాధ్యం కానిది కదా) అనే

న్యాయంతో, మంత్రరత్న ప్రక్రియ వల్ల ఆ రక్షణ భారం భగవంతుని శ్రీచరణాలే వహిస్తాయికదా. ఆ చరణాలకు శ్రీ శఠకోపులని, శీశఠారి అని నమ్మాళ్వారుల తిరునామం. అందుచేత ఈ విశేషణం నమ్మరుల విషయంలో చాలా స్పష్టంగా అన్వేస్తుంది అనడంలో ఏ లోటు లేదు. పాదుకా సహస్రంలో ప్రభావ పద్ధతిలో "జగతామ్ అభిరక్షణే త్రయాణామ్ అధికారం మణిపాదుకే వహంత్యాః" అనే శ్లోకం ఇక్కడ తగినదిగా అనుసంధించదగినది. ఈ విశేషణంలో అళ్వారుల విషయమైన యోజనలో వివరించవలసిన విశేషాలు చాలా ఉన్నాయి. విస్తరభీతి చేత వివరింపబడడం లేదు.

(శ్రుతి శిరసి విదీప్తే) శ్రుతిసిరస్సు అంటే ఉపనిషత్తు. ఇందులో విశేషణ దీప్తులు, ఆళ్వారులు. ఏ విధంగా అంటే, తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే "ఇత్యాదులైన ఉపనిషత్ వాక్యాలు అళ్వార్లను కదా స్తుతిస్తున్నాయి. "విప్రాసః" అంటే "విప్రాః" అని అర్థం. "న శూద్రా భగవద్భక్తాః విప్రాః భాగవతాః స్మృతాః" అనే విధంగా ఆళ్వారులు విప్రత్వసిద్ధిని పొందినవారు.

( విపన్యవః) "పణ– స్తుతౌ" అనే ధాతువు నుండి పుట్టిన పదం కనుక ఈ పదం" విశేషించి స్తుతించేవారు" అనే అర్థాన్ని ఇస్తుంది. భగవంతుని వైభవాన్ని తగిన విధంగా స్తుతించగలిగినవారు, ఆళ్వార్లు.

(జాగృవాంసః) " కణ్ణార క్కండు కழివదోర్ కాదలుற்றாర్కు ఉండో కణ్ గళ్ తుంజుదలే?" ( కన్నులారా భగవంతుని దర్శించి, కాలాన్ని గడపాలనే అద్వితీయమైన ప్రేమను కలిగినవారికి నిద్ర అనేది ఉంటుందా?) అనే విధంగా పల్కి, ఈ లోకంలో నిద్ర అనేది లేకుండా ఉన్నవారు నమ్మాళ్వారులే. " సమింధతే"అనే చోట ఉండే "సం" అనే ఉపసర్గను దృష్టిలో పెట్టుకుని ఇక్కడ "విదీప్తే "అని ఉపసర్గతో కూడిన ప్రయోగాన్ని శ్రీరామానుజులు చేశారు.

ఈ పదానికి ఇంకొక యోజన కూడా ఉన్నది. "శ్రుత్యాం దీప్తః, శ్రుతి శిరసి దీప్తః" అనే క్రమాన్ని ఇక్కడ గ్రహించాలి.

ఇక్కడ శ్రుతి అంటే తిరువాయ్ మొழி ప్రబంధమే. అందులో దీప్తులు నమ్మాళ్వార్లు. ఏ విధంగా అంటే, ప్రతి దశకంలో చివరి పాశురంలో " కురుకూర్ శడకోపన్" అని వారి నామం ప్రకాశిస్తున్నది. ఇక, శ్రుతి శిరస్సు అంటే కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధం. అది తిరువాయ్ మొழி చివరలో నియమంగా అనుసంధింపబడే ప్రబంధం కనుక శ్రుతి శిరస్సు అయినది. అందులో విశేషంగా ప్రకాశించేవారు, ఆళ్వార్లు. ఆ ప్రబంధం మొత్తం ఆళ్వార్ల విషయంగానే ఉన్నందున, అందులో విదీప్తులు అని చెప్పినట్లు అయినది.

( బ్రహ్మణి) " సర్వత్ర బృహత్వ గుణయోగేన హి బ్రహ్మ శబ్దః" అనే శీభాష్య గ్రంథ సూక్తి ప్రకారం బ్రహ్మం అంటే చాలా పెద్ద వస్తువు —అని అర్థం. అళ్వార్లు పెరియతిరువందాది అనే ప్రబంధంలో " పువియుమ్ ఇరు విశుంబుమ్ నిన్నకత్త నీ యెన్ శెవియిన్ వழி పుకుందు ఎన్నుళ్ళాయ్, ఆవి విన్డు యాన్ పెరియన్ నీ పెరియై ఎన్బదనై యారఱివార్?" అనే పాశురంలో చాలా పెద్దవాడైన భగవంతుడు కూడా తమలో ఒక మూల అణగి ఉన్నాడనే గొప్పతనం తమకే ఉన్నదని సోపపత్తికంగా నిరూపించి పలికినందున, అళ్వార్లు బ్రహ్మ మని అనడం లోటు లేదు. తమ బ్రహ్మత్వాన్ని తామే స్వయంగా ఉపపాదిస్తూ పలకడం విశేషం. ఆ పాశురప్రకారం భగవంతుడు బ్రహ్మ గాను, పరబ్రహ్మగాను వ్యక్తమవుతున్నందున, " పరస్మిన్ బ్రహ్మణి" అనే ప్రయోగం ఆళ్వారుల విషయంలో చక్కగా అన్వర్థమవుతుంది.

(శ్రీనివాసః) "స తు నాగవరః శ్రీమాన్", " అంతరిక్ష గతః శ్రీమాన్", " లక్ష్మణో లక్ష్మి సంపన్నః" అని మొదలైన ప్రయోగాలలో భగవత్కైంకర్య రుచి, భగవద్భక్తి కలిగి ఉండడాన్ని సంపద కలిగి ఉన్నట్లుగా చెప్పబడడం చేత, ఆ భగవద్భక్తి, కైంకర్యం అనే సంపద ఆళ్వార్ల విషయంలో ఏ లోటు లేకుండా ఉండడంచేత, శ్రీమత్త్వం అళ్వార్ల విషయంలో లోటు లేదు లేకుండా ఉన్న ది కనుక, శ్రీనివాస శబ్దం నమ్మాళ్వార్ల విషయంలో చక్కగా అన్వయిస్తుంది.

## అవతారిక

వేదం కర్మకాండం అని, బ్రహ్మకాండం అని రెండు విధాలుగా విభాగింపబడినది. పూర్వభాగం కర్మకాండం అని, ఉత్తరభాగం బ్రహ్మకాండమని వ్యవహరింపబడతాయి. భగవంతునికి ఆరాధనా రూపాలైన యజ్ఞాలు మొదలైన కర్మ విశేషాలను విరివిగా తెలిపే వేద భాగం కర్మకాండం అని, ఆ కర్మల చేత ఆరాధింపబడే భగవంతుని స్వరూపరూప గుణ విభూతులు మొదలైనవానిని విస్తృతంగా ప్రతిపాదించే వేద భాగం బ్రహ్మ కాండం అని చెప్పబడుతున్నది. కర్మకాండలో తోచే సందేహాలను తీర్చడం కోసం జైమిని అనే మహర్షి 16 అధ్యాయాలను ఒక శాస్త్రాన్ని రచించారు. దానికి పూర్వ మీమాంసా శాస్త్రం అని పేరు. ఇందులో ఉండే పన్నెండు అధ్యాయాలు జైమిని మహర్షిచేత రచింపబడినవి అని, మిగిలిన నాలుగు అధ్యాయాలు కాశకృత్స్నులనే పేరు కలిగిన మహనీయులచేత రచింపబడినవి అని ఒక వాదం ఉన్నది. దీనని గూర్చిన విచారం ఇక్కడ అప్రస్తుతం. "జైమినీయం షోడశలక్షణమ్" అని బోధాయన మహర్షి సూక్తి వారి వృత్తి గ్రంథంలో ఉన్నది. దీనిని బట్టి 16 అధ్యాయాలు జైమినిప్రోక్తమని చెప్పబడుతున్నది. లక్షణం అంటే అధ్యాయమని అర్థం.

బ్రహ్మకాండమనే ఉపనిషద్భాగంలో కలిగే సందేహాలను తీర్చడం కోసం వ్యాసమహర్షి నాలుగు అధ్యాయాలను కల ఒక శాస్త్రాన్ని రచించారు. దానికి శారీరక మీమాంస అనే పేరు. ఉత్తర మీమాంస అని కూడా దీనిని వ్యవహరిస్తారు. బ్రహ్మసూత్రాలు అనేది ఈ గ్రంథాన్నే. ఇందులో ఒక్కొక్క అధ్యాయంలోనూ నాలుగు పాదాలు ఉన్నాయి ఈ విధంగా శారీరక మీమాంసలో ఉండే నాలుగు అధ్యాయాలలోనూ 16 పాదాలు ఉన్నాయి. అందుచేత 16 పాదాలను కలిగిన శాస్త్రం శారీరక మీమాంసా శాస్త్రం అని చెప్పినట్లు అయినది.

ఈ శాస్త్రంలో ఒక్కొక్క విషయాన్ని గూర్చి చర్చించి నిర్ణయించే భాగానికి అధికరణం అని పేరు పెట్టబడింది. అటువంటి అధికరణాలు ఈ మీమాంసలో 156 ఉన్నాయి. కొన్ని అధికరణాలలో ఒక్కొక్క సూత్రం ఉంటుంది, పలు అధికరణాలలో అనేక సూత్రాలు ఉంటాయి. మొత్తం సూత్రాల సంఖ్య 545. ఈ విధంగా నాలుగు అధ్యాయాలను, 16 పాదాలను, 156 అధికరణాలను, 545 సూత్రాలను కలిగినది —బ్రహ్మమీమాంసాశాస్త్రం, లేక, శారీరక మీమాంసా శాస్త్రం అని ఏర్పడుతున్నది.

తత్త్వ హిత పురుషార్థాలను మనం తెలుసుకొని ఉజ్జీవించడం కోసం మనకు ఉపనిషత్తులే సాధనం అవుతున్నాయి. ఈ ఉపనిషత్తుల అర్థాలను సంశయ విపర్యయ రహితంగా నిష్కరించి, వివరించగలిగినది ఈ బ్రహ్మసూత్ర గ్రంథమే కనుక, వేదాంతులకు ఇదే ఆశ్రయమైనది. బ్రహ్మ సూత్రం అనే శారీరక మీమాంసలో ఉండే అర్థాన్ని నిష్కర్షంగాను, నిష్కృష్టంగాను తెలిసికొన్నవారే వేదాంతులని, బ్రహ్మజ్ఞానులని చెప్పడానికి తగిన యోగ్యతను కలిగి ఉన్నారు.

మహర్షి ప్రణీతాలైన సూత్రాలలోని అర్థాన్ని మనవంటివారు కొంచెం కూడా తెలుసుకోవడానికి సాధ్యం కాదు కనుక, మన వంటి అల్ప జ్ఞానుల విషయంలో ఎంతో కృపను కలిగిన పెద్దలు ఆ సూత్రాలలోని అర్థాన్ని వివరిస్తూ భాష్యాలను అనుగ్రహించారు. ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం అని మూడు మతాలు లోకంలో ప్రచారంలో ఉన్నాయి. ఈ మూడు మతాలలోనూ బ్రహ్మసూత్ర భాష్యాలు అవతరించాయి. అద్వైత మతం కోసం శంకరాచార్యులవారు భాష్యాన్ని రచించారు. ద్వైతమతం కోసం ఆనంద తీర్థులవారు అంటే, మధ్వాచార్యుల వారు, భాష్యాన్ని రచించారు. మన విశిష్టాద్వైత మతం కోసం భగవద్రామానుజులు అనే స్వామి ఎబెరుమానార్ శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు. ఉత్తరదేశంలో అధికమైన ప్రసిద్ధిని పొందిన వల్లభ మతం, నింబాబర్కమతం మొదలైన మతాలకు అనుగుణంగా కూడా భాష్యాలు రచింపబడ్డాయి. శైవ మతం కోసం నీలకంఠ భాష్యం అవతరించింది. ఈ విధంగా ఇంకా

పలు భాష్యాలు ఉన్నప్పటికీ, మతత్రయ భాష్యాలు అని మూడు భాష్యాలే మన దేశంలో ఎక్కువగా ప్రసిద్ధిని పొందాయి.

విశిష్టాద్వైతులు అని, శ్రీ వైష్ణవులు అని, శ్రీరామానుజమతస్థులని వ్యవహరింపబడే మనకు జీవాతువు భగవద్రామానుజ భాష్యమే అనే విషయం చెప్పకుండానే ప్రకాశిస్తుంది. ఉపనిషత్తులలో ఉండే యథార్థమైన అర్థాన్ని వివరించేది, సూత్రాల అర్థాన్ని సూత్రకారుల అభిప్రాయానికి అనుగుణంగా, నిష్పక్షపాతంగా నిరూపించేది శ్రీరామానుజ భాష్యమే అని విదేశీయ పండితులు కూడా మెచ్చుకున్నారు. ఆ శ్రీ భాష్యంలోని యథార్థమైన తాత్పర్యాన్ని శ్రుతప్రకాశిక మొదలైన వ్యాఖ్యాన గ్రంథాల సహాయంతో గ్రహించాలి. దానికి సామాన్య శాస్త్రాల సహాయం చాలా ఆవశ్యకం. అటువంటి శాస్త్రజ్ఞులు చిరకాలం గురుకుల వాసం చేసి, శ్రీ భాష్యాన్ని అధ్యయనం చేసి, శ్రీభాష్యాధికారులనే పేరు పొంది, గొప్ప వేదాంతులై, తత్త్వహిత పురుషార్థాలను స్పష్టంగా తెలుసుకొన్నవారై, నిరతిశయానందశాలులుగా అవుతున్నారు. అటువంటి, అంతటి అధికారం పొందలేనివారిని కూడా విడువలేని, మిక్కిలి కరుణను కలిగిన మన పూర్వాచార్యులు దివ్య ప్రబంధవ్యాఖ్యానాలను, రహస్య గ్రంథ, తద్వ్యాఖ్యానాలను, ఇంకా పలు దివ్య గ్రంథాలను అనుగ్రహించి ఉన్నారు. కనుక, శ్రీ భాష్యంలో నేరుగా అవగాహన లేనివారు కూడా అవకాశం కోల్పోకుండా, శ్రీభాష్యాది గ్రంథాలలో వివరింపబడిన తత్త్వహిత పురుషార్థాలను తెలుసుకోగలుగుతున్నారు. అటువంటివారి జ్ఞానంలో కూడా ఏ కొరత లేదు. కొరత లేకపోవడం మాత్రమే కాకుండా, శ్రీభాష్యాదికారుల కంటే మిక్కిలి విశదమైన జ్ఞానవైశద్యాన్ని పొందినవారుగా కూడా ప్రకాశిస్తున్నారు. అయినా, బ్రహ్మసూత్రాలలో ఏమి విషయం ఎంత విశదంగా చెప్పబడింది అని తెలుసుకునేవారికి అభిలాష ఉంటుంది. విస్తరంగా తెలిసికోకపోయినా, సార సంగ్రహంగా అయినా తెలుసుకోవాలి అనే అభిలాష కలవారికోసం సారంగా ముఖ్యమైన అధికరణాలను ప్రస్తావించి, ఈ గ్రంథం రచింపబడింది. స్వామి రామానుజులు శ్రీ భాష్యం, వేదాంత దీపం, వేదాంతసారం అనే మూడు దివ్య గ్రంథాలతో

బ్రహ్మసూత్రార్థాలను విరివిగాను, సంగ్రహంగాను వ్యక్తం చేశారు. వాటిని స్పృశిస్తూ ఈ గ్రంథం రచింపబడింది, ఇందులోని గుణాలను, గ్రహించి దోషాలను పెద్దలు విడిచి వేస్తారు.

## 1) మొదటి సూత్రం – మొదటి అధికరణం

**"అథాతో బ్రహ్మజిజ్ఞాసా"**

అథ—కర్మ విచారణ చేసి పూర్తి చేసిన తరువాత, అతః— కర్మ విచారం పూర్తి అయినందువల్లనే, బ్రహ్మ జిజ్ఞాసా— ఇచ్ఛకు లక్ష్యమైన బ్రహ్మవిచారం చేయబడుతున్నది —అని సూత్రంలోని పైపైన తోచే సాధారణమైన అర్థం.

కర్మ విచారాన్ని చేసి పూర్తిచేసినవారు ఆ కర్మల అల్పం, అస్థిరమైన ఫలాలలో కోరికను వదిలిపెట్టినవారై, మోక్ష పురుషార్థాన్ని కోరివారు అవుతారు కనుక, అటువంటివారికి బ్రహ్మ విచారం చేయదగినది అని చెప్పినట్లయినది. దీనిని ఇంకా కొంచెం వివరిస్తాను. చక్కగా వేదాన్ని అధ్యయనం చేసినవారు జైమిని మహర్షి రచించిన కర్మమీమాంసలో చెప్పబడిన న్యాయాలతో జ్యోతిష్టోమం మొదలైన యజ్ఞకర్మల స్వభావం ఇటువంటిది, వాటిని చేయవలసిన విధానం ఇటువంటిది—అని ఈ విషయాలను నిశ్చయించుకొని, తరువాత స్వర్గం మొదలైన అల్పఫలాలను నశ్వరాలు అని తెలుసుకున్నందున, వాటిని పొందాలి అనే ఆశను విడిచినవారు అవుతారు. బ్రహ్మ ప్రాప్తి అనే మోక్షపురుషార్థంలో పైపైన ఒక జ్ఞానం ఉన్నందున, దీనిని పొందాలి అనే ఆశ వారికి కలుగుతుంది. ఈ విధంగా బ్రహ్మ ప్రాప్తిలో ఆశ కలగగానే, ఆ బ్రహ్మస్వరూపం ఇటువంటిది, దానిని పొందడానికి ఉపాయం ఇది, పొంది అనుభవించే ఫలం ఇటువంటిది— అని ఇటువంటి విషయాలను నిర్ణయించుకోవాలి కనుక, ఈ నిర్ణయం బ్రహ్మ మీమాంసలో చెప్పబడిన న్యాయాలతోనే కలుగుతుంది అని ఇక్కడ తాత్పర్యం.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే ఈ సూత్రానికి ఇంత మాత్రమే విషయమై ఉండగా, ఇక్కడ శ్రీ భాష్యం చాలా చాలా పెరిగివున్నదే! , పెద్దదిగా ఉన్నదే! , ఇంతటి విస్తృతికి విషయమేమి? అని పలువురు తెలుసుకోవాలని కోరవచ్చు. వినండి.

ఈ సూత్రంలో మూడే పదాలు ఉన్నాయి. (అథ) అనే మొదటి పదానికి "దానికి తరువాత" అని అర్థం. దేనికి తరువాత? అనే ప్రశ్న ఇక్కడ వెంటనే కలుగుతుంది. కర్మ విచారం చేసి పూర్తి అయిన తరువాత—అని ఇక్కడ మనం అర్థం గ్రహిస్తున్నాము. ఇతర మతాలవారు ఈ విధంగా అర్థాన్ని గ్రహించకుండా, వేరు విధంగా అర్థాన్ని గ్రహిస్తున్నారు. సాధన చతుష్టయ సంపత్తికి ఆనంతర్యమే ఇక్కడ ఆథ శబ్దార్థమని శంకరభాష్యంలో చెప్పబడింది. ఈ అర్థాన్ని చెప్పడం పొసగదు అని నిరాకరించవలసిన ఆవశ్యకత ఇక్కడ ఏర్పడింది. బ్రహ్మం యొక్క స్వరూపాన్నిగూర్చి ఇతరులు పలికే అభిప్రాయం తప్పక నిరాకరించవలసి వచ్చింది. ఈ రెండు విషయాల ప్రసక్తానుప్రసక్తంగా పలు పలు విషయాలు పెరిగినందున, ఇక్కడ శ్రీ భాష్యం చాలా పెద్దది అయినది. అంతటి విస్తృతి ఇక్కడ అక్కర లేదు అని విడువబడుతున్నది. సూత్రాల పైన ఇక్కడ స్ఫురించే పూర్వపక్షాన్ని, సిద్ధాంతాన్ని సారంగా తెలుపుతాను. వినండి.

ఈ అధికరణంలో పూర్వపక్షం ఈ విధంగా ఉన్నది. కర్మమీమాంసలోని అర్థవాదాధికరణంలో "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనంతర్యమ్ అతదార్థానాం తస్మాత్ దనిత్యముచ్యతే" అనే ఒక సూత్రంతో ఒక పూర్వపక్షం ఇక్కడ ప్రసక్తమవుతున్నది. అది ఏమంటే, వేదసామాన్యం ఏదైనా ఒక కర్మను చేయవలసినదిగా తెలిపి తీరవలసిన నిర్బంధాన్ని కలిగినది. "దానిని చెయ్యి, దీని చేయి" అని కర్తవ్యతార్థాలను నియమంగా బోధించడమే వేదకృత్యం. అర్థవాదరూపాలైన వేదవాక్యాలు కర్తవ్యతార్థాన్ని దేనినీ బోధించవు గనుక, అటువంటి వాక్యాలకు ప్రామాణ్యం సంభవించదు— అనేది ఇక్కడ పూర్వపక్షం. దీనిని కొంచెం వివరిస్తాను.

" వాయువ్యం శ్వేతమాలభేత భూతికామః అనేది ఒక వేద వాక్యం. ఇందులో ఒక కర్మ కర్తవ్యంగా విధింపబడింది. దీనికి తరువాత వాక్యం "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" అనేది. ముందు చెప్పిన కర్మలో ఆరాధ్యుడుగా చెప్పబడిన వాయువనే దేవత యొక్క ఒక గొప్పతనాన్ని తెలుపుతున్నది, ఈ వాక్యం. వాయువు చాలా శీఘ్రంగా ప్రయాణం

చేసే సామర్థ్యాన్ని కల దేవత –అనేది ఈ వాక్యంలోని అర్థం. ఇటువంటి వాక్యాలకు అఅర్థవాద వాక్యాలని పేరు. వీటిలో కర్మ విధి ఏమి లేనందు వల్ల, ఇవి విధి వాక్యాలు కావు. విధి వాక్యమై ఉంటూ ప్రామాణ్యం పొందడమనేది క్రమమై ఉండగా, యత్కించిత్ కర్తవ్యార్థ బోధకత్వరాహిత్యంచేత ఇది విధివాక్యం కాని. అర్థవాద వాక్యాలు ప్రామాణ్యాన్ని పొందవు– అనే పూర్వపక్షం ఆమ్నాయస్య అని పూర్వం ప్రస్తావించబడ్డ సూత్రం ద్వారా చేయబడింది.

తరువాత, "విధినా తు ఏక వాక్యార్థత్వాత్ స్తుత్యర్థత్వేన విధీనాం స్యుః" అనే సూత్రంతో దీనికి పరిహారం చెప్పబడింది. ఏ విధంగా అంటే, అర్థవాదవాక్యాలు ఏ కార్యాన్ని చెయ్యమని చెప్పకపోయినప్పటికీ కూడా, తమకు సమీపంలో ఉండే విధి వాక్యంలో విధింపబడ్డ ఒక క్రియలో అన్వయించే మహిమను కలిగి ఉన్నందున, ఆ విధివాక్యంతో కూడా ఏకవాక్యత్వాన్ని పొందుతున్నందున ప్రామాణ్యాన్ని పొందడంలో ఏ అడ్డు లేదు అని సిద్ధాంతం చేయబడింది, జైమిని మహర్షి చేత. ఈ విధంగా విధివాక్యాలకో, వాటికి శేషభూతాలుగా ఉండే వాక్యాలకో ప్రామాణ్యం ఉంటాయి తప్ప వేరు విధమైన వాక్యాలకు ప్రామాణ్యం లేదు. లోకంలో కూడా, మొట్టమొదటగా కుర్రవానికి వృత్తవ్యవహారాదులశచేతనే శక్తి గ్రహణం కలుగుతున్నది. శక్తి గ్రహణం అంటే–ఈ పదానికి ఇది అర్థం– అనే జ్ఞానం. వ్యుత్పన్నుడైనవాడు ఒకడు వేరొక వ్యుత్పన్నుని చూచి "గామ్ ఆనయ" అని అంటున్నాడు. దానిని వినిన రెండవవాడు ఒక గోవును తీసుకొని వస్తాడు. మళ్ళీ, మొదటివాడు "గామ్ నయ, అశ్వమ్ ఆనయ" అంటాడు. దానిని విన్న ఆ రెండవవాడు గోవును తీసుకొని పోయి, గుర్రాన్ని తీసుకొని వస్తాడు. ఈ సందర్భాలను అన్నిటిని గమనిస్తున్న ఒక బాలకుడు "గామ్ "అనే పదానికి ఇది అర్థం, " ఆనయ" అనే పదానికి ఇది అర్థం, " నయ" అనే పదానికి ఇది అర్థం, " అశ్వం" అనే పదానికి ఇది అర్థం అని అక్కడ జరిగిన కార్యాల వల్ల తెలుసుకుంటున్నాడు. గోపదం తీసుకొని రావడం, తీసుకుని పోవడం అనే రెండు క్రియలలో అన్వయించే వస్తువును

బోధించడం చేత గోవును తెలుపుతున్నది. "ఆనయ" అనే పదం తీసుకుని రావడం అనే క్రియను తెలుపుతున్నది –అని ఈ విధంగా ఆయా పదాలకు శక్తిని గ్రహిస్తున్నాడు. ఎక్కడైనా ఇటువంటి వ్యవహారాల వల్లనే ఆయా పదాలకు ఆయా అర్థాలలో శక్తి గ్రహణం ఏర్పడుతున్నది. అందుచేత ఇటువంటి వ్యవహారాలు ఏవైనా కార్యార్థ పరాలుగానే కనబడుతన్నందున, లోకంలో అన్ని పదాలు యత్కించిత్ కర్తవ్యార్థ బోధకాల పదాలు అని నిశ్చయంపబడుతున్నాయి. అందుచేత, ఇటువంటి ఉత్పత్తికి తగినట్లు అన్ని పదాలు కార్యార్థపరాలే. ఈ విధంగా లౌకిక పదాలు కార్యార్థపరాలు అని స్పష్టమైతే, "య ఏవ లౌకికాః త ఏవ వైదికాః" అనే న్యాయం వల్ల వైదిక పదాలు కూడా కార్యార్థపరాలే అవుతున్నాయి. (కార్యపరాలైన వాక్యాలకే ప్రామాణ్యం ఉన్నది అని అర్థం )ఈ విధంగా కార్యరూపం కాని పరబ్రహ్మ విషయంలో వేదాంతవాక్యాలకు తాత్పర్యం ఉండే అవకాశం లేనందున, వేదాంత విచార రూపమైన బ్రహ్మవిచార శాస్త్రం ఆరంభించదగినది కాదు –అని పూర్వపక్షం ప్రస్తుతమైనది.

దీనికి తరువాత, సిద్ధాంతం ఏమంటే– చిన్నపిల్లలకు మొదట వ్యుత్పత్తి వృత్తవ్యవహారంవల్లనే కలుగుతుందనేది ఒక భ్రమ. ఇది అందరి అనుభవానికి విరుద్ధమైనది. లోకంలో వారివారికి మొదట ఉత్పత్తి కలిగే విధంగా వేరే విధంగానే అనుభవ సిద్ధంగా ఉన్నది. ఏ విధంగా అంటే, తల్లి, తండ్రి మొదలైన వారు తమ తమ బిడ్డలకు ఉత్పత్తిని కలిగించాలి అని తలచి, కంటికి ఎదురుగా కనిపించే పలు పలు వస్తువులను వేళ్ళతో నిర్దేశించి చూపి, " ఇదిగో చంద్రుడు, ఇదిగో గుర్రం, ఇడుగో మామ" అని ఈ విధంగా ప్రయోగించి చూపుతున్నారు. శిశువులు కూడా పూర్వజన్మ వాసనచేత కాలక్రమేణ ఆయా పదాలకు, ఆయా అర్థాలకు మధ్య ఉండే సంబంధాన్ని దృఢంగా తెలుసుకొని, వ్యుత్పత్తిని పొందుతున్నారు. అందుచేత ఒక కార్యంలో అన్వయించిన వస్తువులోనే మొదట శక్తి గ్రహణం కలుగుతున్నదనే దానికి వ్యతిరేకంగా ఏ కార్యంలోనూ అన్వయించని వస్తువులోకూడా మొట్టమొదటగా పదాలకు శక్తిగ్రహణం కలుగుతున్నదని దృఢపడుతున్నది.

కార్యపరమైన వాక్యాల వల్లనే శక్తి గ్రహణం కలుగుతున్నది అనేది కూడా చాలా పొరపాటు. " దేవ దత్తా! నీకు కుమారుడు కలిగాడు" అనే ఒక వాక్యాన్ని ఉదాహరణగా గ్రహిద్దాం. ఇది సిద్ధార్థ పరమైన వాక్యమే తప్ప, "గామ్ ఆనయ, గామ్ నయ" ఇత్యాది వాక్యాల వలె కార్యపరమైన వాక్యం కాదు. ఈ వాక్యం వల్ల కూడా చిన్న కుర్రవానికి వ్యుత్పత్తి కలగడం మనం చూస్తున్నాం. దేవదత్తునకు కుమారుడు కలగగానే వేరొక చోట ఉన్న అతనికి దీనిని తెలుపడం కోసం నియోగింపబడిన ఒకడు "దేవదత్త! పుత్రః తే జాతః" అని అంటున్నాడు. దేవదత్తుని గృహంలో అతనికి కుమారుడు కలగడం, దానిని తెలుపడం కోసం ఒకడు నియోగింపబడడం, అతడు పలికిన దానిని విని దేవదత్తునకు ముఖ వికాసం కలగడం —అనే వీటిని అన్నిటిని చూసి "పుత్రః తే జాతః" అనే వాక్యానికి "ఇది అర్థం" అని గ్రహిస్తున్నాడు. అందుచేత కార్యపరమైన వాక్యాల వల్లనే శక్తి గ్రహణం కలుగుతుంది అనే నియమం లేదని తెలుస్తున్నది. కొన్ని చోట్ల సిద్ధపరమైన వాక్యం వల్ల కూడా కార్యాన్వ త వస్తువులలో శక్తి గ్రహణం కలుగుతుంది కొన్నిచోట్ల కార్యపర వాక్యాల వల్ల కలుగుతుంది— అని లోకానుభవంచేత సిద్ధిస్తున్నందున, ప్రాభాకరులు సకల పదాలకు కార్యార్థపరత్వం అని పలకడం యుక్తిసహం కాదు అని తేలుతున్నది. అందుచేత వాక్యాలకు సిద్ధరూపమైన బ్రహ్మంలో తాత్పర్యం సంభవించవచ్చు గనుక, దానిని విచారించే శాస్త్రం ఆరంభించదగినది అని సిద్ధాంతంగా ముగుస్తున్నది.

ఇక్కడ ఇటువంటి పూర్వపక్షం ఏర్పడి, దీనికి పరిహారం చేయడం అనే విషయం ఈ సూత్రంలో ఏవిధంగా లభిస్తున్నదనే ప్రశ్న కలుగుతుంది. కార్యంలో అన్వయించని బ్రహ్మమనే సిద్ధ వస్తువు ఇక్కడ జిజ్ఞాస్యంగా పలికినందున, దీనివల్ల ఈ పూర్వపక్ష సిద్ధాంతాలను నిర్ణయించడంలో ఏమీ లోటు లేదు. వేదాంతవాక్యాలు అన్ని కార్యపరాలుగా గ్రహించినపుడు ప్రామాణ్యాన్ని, పొందుతాయి తప్ప, సిద్ధపరాలు అయినప్పుడు ప్రామాణ్యం పొందవు— అనే వాదం సమంజసంగా ఉంటే కదా వేదాంతవాక్యాలతో సిద్ధరూపమైన బ్రహ్మాన్ని విచారించడం కూడదని చెప్పడం వీలవుతుంది.

మొదట మేము ప్రస్తావించి చూపించిన పూర్వ మీమాంసా సూత్రాలు రెండిటి వల్ల స్పష్టబడిన అర్థం ఇప్పుడు విరోధిస్తున్నట్లుగా ఇక భావించవచ్చు. కానీ, కార్యపరాలు కాని సిద్ధపరవాక్యాలకు స్వాతంత్ర్యేణ ప్రామాణ్యం అసంభావితం అని కదా అక్కడ సిద్ధాంతం చేయబడింది— అని శంకించవచ్చు. ఈ సందేహం అక్కరలేదు. అన్ని వేద వాక్యాలు కార్యపరాలుగా గ్రహించే ప్రామాణ్యం పొందాలి— అనే పూర్వపక్షి పలికిన వాదాన్ని ఆ విధంగానే అంగీకరించి అభ్యుపగమ్య వాదం క్రమంలో పరిహారాన్ని చూపించారు, జైమిని మహర్షి. అందుచేతనే ఇక్కడ వారి అభిప్రాయం అని అనేది లేదు. అదే వారి అభిప్రాయం అనేది లేదు. కార్యపరాలు కాని అర్థవాద వాక్యాలు కూడా విధిశేషాలై ప్రామాణ్యం పొందుతున్నాయి అని చెప్పినంతలో సిద్ధపర వాక్యాలకు ప్రామాణ్యమే లేదు— అని చెప్పినట్లు కాదు. అందుచేత ఈ సూత్రంలో చేయబడే సిద్ధాంతం అనేది పూర్వ మీమాంసలోని అర్థవాదాధికరణ సిద్ధాంతానికి విరుద్ధమని ఏర్పడుతున్నది.

**ఇక ప్రకృతి సూత్రార్థ విచారం**

ఈ మొదటి సూత్రంలో "అథ, అతః "అనే రెండు పదాలలో కర్మ విచారానికి తరువాత, కర్మ విచారం ముగిసింది అనే కారణం చేతనే బ్రహ్మ విచారణ చేయదగినది అనే అర్థం లభిస్తున్నందున, బ్రహ్మ విచారాన్ని గూర్చి కర్మ విచారం నియమంగా పూర్వవృత్తమని తెలుతున్నది. దీనిని గూర్చి కూడా కొంచెం వివరింపబడుతున్నది. వేదం అధ్యయనం చేసిన ఒక పురుషుడు వేదవ్యాలలో కర్మ ఫలాన్ని గూర్చి, బ్రహ్మజ్ఞాన ఫలాన్ని గూర్చి స్థిరమని కొన్నిచోట్ల, అస్థిరమని కొన్నిచోట్ల పై పైన తెలుసుకొని, వీటిలో ఏది నిజం? అనే నిర్ణయం పొందాలని కోరుతున్నాడు. ఆ కోరిక వల్ల దానిని నిర్ణయించి చెప్పగలిగిన శాస్త్రంలో ప్రవర్తిస్తున్నాడు. కర్మఫలాన్ని గూర్చిన వాస్తవాన్ని నిశ్చయించి చెప్పగల శాస్త్రంలో మునుముందుగా ప్రవర్తిస్తున్నాడు. అనాది వాసనచేత కర్మలను చేయడం అంత సులభం కాదు అని సామాన్యంగా తోస్తుంది. బ్రహ్మజ్ఞానంలో అభ్యాసం లేని కారణంచేత అది దుష్కరమని తోస్తుంది. అందుచేత సులభంగా ఉండే ఉపాయంతో

అభిమతాన్ని పొందవలసిన ఉండగా, అరుదైన ఉపాయంలో ప్రవృత్తి సంభవించదు గనుక, బ్రహ్మజ్ఞానం యొక్క ఫలాన్ని గూర్చి నిర్ణయించాలి అనే కోరిక అడ్డగింపబడినదై, కర్మలను గూర్చి నిర్ణయించుకోవాలి అనే కోరికే తల ఎత్తుతుంది. ఈ విధంగా ముందు కర్మ విచారం చేయగానే, క్రమంగా కర్మ ఫలాలు అస్థిరాలు అనే నిశ్చయం ఏర్పడుతుంది. ఈ విధంగా నిశ్చయం కలుగగానే, కర్మ విచారేచ్ఛ తొలగిపోతుంది. ఈ కర్మ విచారేచ్ఛయే పూర్వం బ్రహ్మ విచారానికి అడ్డుగా ఉన్నందున, ఈ ప్రతిబంధకం తొలగిపోగానే, బ్రహ్మ విచారణలో కోరిక, అందులో ప్రవృత్తి తరువాత కలుగుతుంది. ఈ విధంగా బ్రహ్మవిచారాన్ని గూర్చి కర్మ విచారం నియమంగా అపేక్షితమని తేలుతున్నది. ఇదే పూర్వవృత్తంగా ఉండదగినది కనుక, పద వివరణలో చెప్పిన అర్థమే తగినది అని తేలుతున్నది.

## 2) జిజ్ఞాసాధికరణం

లోకంలో ఒక విషయాన్ని తెలుసుకోవాలి అంటే, దాని లక్షణాన్ని పురస్కరించుకునే దానిని తెలుసుకోవలసి ఉన్నది. ఆ విధంగానే, పరబ్రహ్మను గూర్చి తెలుసుకోవాలి అంటే, ఒక లక్షణాన్ని పురస్కరించుకొని దానిని గ్రహించాలి. మనం కంటితో దర్శించగలిగిన వస్తువుకే లక్షణం చెప్పగలం తప్ప, కంటికి కనిపించని వస్తువుకు లక్షణం చెప్పడం వీలు కాదు. పరబ్రహ్మ అయితే కంటికి కనిపించని వస్తువు. అందుచేత దానికి ఒక లక్షణం చెప్పడానికి వీలు లేనప్పుడు అది తెలుసుకోవడం సాధ్యం కాదు— అని ఏర్పడుతున్నందున, ఆ బ్రహ్మను గూర్చిన విచారం ఏ విధంగా చేయడం వీలవుతుంది? అనే ఇక్కడ అక్షేపం ఏర్పడగా, ఆ ఆక్షేపానికి పరిహారం చెప్పడంకోసం ఈ అధికరణం ఏర్పడింది.

**"జన్మాద్యస్య యతః" (1–1–2)**

"జన్మాది అస్య యతః" అని మూడు పదాలుగా ఉన్నది, ఈ సూత్రం. అస్య –కంటితో కనబడే ఈ చేతన మిశ్రమమైన ప్రపంచానికి, జన్మాది– ఉత్పత్తి స్థితి ప్రళయాలు, యతః –ఏ వస్తువు నుండి సంభవిస్తున్నవో, అదే బ్రహ్మం– అనేది ఈ సూత్రంలోని అర్థం.

తైత్తిరియోపనిషత్తులో భృగువల్లి అనే ప్రకరణంలో ఉండే " యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ ప్రయంత్యభిసంవిశంతి, తత్ విజిజ్ఞాసస్వ తత్ బ్రహ్మేతి" అనే వాక్యం పరబ్రహ్మకు జగజ్జన్మాది కారణత్వరూపమైన లక్షణాన్ని చెప్పింది. లోకంలో మనం మేక, గోవు మొదలైనవాటికి ఒక్కొక్క లక్షణంతో వాటికి, మిగిలిన వాటికి మధ్య ఉండే భేదాన్ని ఏ విధంగా నిశ్చయించుకుంటున్నామో, ఆ విధంగానే, బ్రహ్మం కంటికి కనిపించనప్పటికీ కూడా, జగజ్జన్మాది కారణత్వరూపమైన లక్షణంతో చేతనాచేతనాల కంటే అది విలక్షణమని నిశ్చయించుకోవచ్చు, కనుక, అటువంటి బ్రహ్మాన్ని గూర్చిన విచారం తగినదే అని చెప్పినట్లయినది.

**ఇక్కడ పూర్వపక్షం ఈ విధంగా ఏర్పడింది.**

బ్రహ్మానికి జగత్కారణత్వం మొదలైనవి లక్షణంగా సంభవించవు అనే పూర్వపక్షం ఇక్కడ ప్రస్తుతం అయినది. "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదిగా ఉదాహరింపబడిన ఉపనిషత్ వాక్యంలో అన్వయ క్రమం ఏ విధంగా గమనించాలి? అని అంటే, " "యతః ఇమాని భూతాని జాయంతే తత్ బ్రహ్మ, యేన జాతాని జీవంతి తత్ బ్రహ్మ, యత్ ప్రయంతి, అభిసంవిశంతి తత్ బ్రహ్మ "అని మూడు వాక్యాలుగా విడగొట్టి అన్వయాన్ని గ్రహించి జన్మ కారణత్వం ఒక లక్షణం అని, స్థితికారణత్వం ఇంకొక లక్షణం అని, లయ కారణత్వం ఇంకొక లక్షణం అని –ఈ విధంగా వ్యావర్తక లక్షణాలు మూడు అంగీకరించవలసినదిగా ఉన్నది. ఇటువంటి సందర్భంలో, ఒకే బ్రహ్మ అని అనకుండా, పలు బ్రహ్మలు ఉన్నాయని తోస్తుంది, ఎందుకంటే, వ్యావర్తకాలుకా అనేకం కనుక, వాటిచే వ్యావర్తింపబడే బ్రహ్మలు కూడా అనేకంగా ఉండాలి కనుక.

"ఈ విధంగా కూడా ఒక నిర్బంధంగా ఉంటుందా? "దేవదత్తుడు నల్లగాను, లావుగాను, యువకుడుగాను, ఎర్రని కన్నులను కలవాడుగాను ఉన్నాడు "అని ఒకడు అని పలికినట్లయితే, నలుపు మొదలైన వ్యావర్తకాలు అనేకంగా ఉన్నాయనే కారణంతో వ్యావర్తింపబడే దేవదత్తుడు కూడా పలు వ్యక్తులుగా తోస్తాడా? ప్రత్యక్షంగా ఒక దేవదత్తునే కదా మనం చూస్తున్నాము. ఆ వ్యక్తిలో నలుపు, లావుగా ఉండడం మొదలైన అనేక విశేషణాలు కూడి ఉండడాన్ని చూస్తున్నాము. ఇదేవిధంగా, ఒక బ్రహ్మ లోనే జగజ్జన్మకారణత్వం మొదలైనవి అనేకం కూడి ఉండడంలో ఏ కొరత లేదు కదా. వీటివల్ల బ్రహ్మవ్యక్తిబహుత్వం ఏ విధంగా ఆపత్తి చేయడం సాధ్యం?" అని మధ్యలో ఒక సందేహం కలుగుతుంది.

దీనికి సమాధానం ఏమంటే—నలుపు, బృహత్వం మొదలైన విశేషణాలతో బహుత్వం ఏర్పడింది అనేది వాస్తవమే. దేవదత్తుడు కంటికి కనిపించేవాడు కనుక ఆ విషయం వేఱు. బ్రహ్మం ఆ విధంగా ప్రత్యక్షం కాదు కదా. బ్రహ్మ అయితే అప్రత్యక్షమై ఉన్నది. జన్మకారణత్వం, లయ కారణత్వం ఒకే వస్తువులు కూడుతాయి అని గ్రహించగలిగిన ప్రమాణాలు ఏమి కనిపించడం లేదు. లక్షణాలు అన్నీ ఇతర భేదాన్ని సాధించేవి అనేది ఉత్సర్గతః ఏర్పడుతున్నది. జన్మ కారణత్వం, స్థితి కారణత్వం, లయ కారణత్వం అని ఈ లక్షణాలు ఇతర భేదాన్ని, అంటే, వ్యావృత్తిని సాధించేటప్పుడు వీనికి అపవాదం ఏదీ లేనందు వల్ల, జన్మ కారణత్వం అనే లక్షణం అనేది ఏమి చేస్తుంది? అంటే, తనతో లక్షణీయమైన బ్రహ్మకు స్థితి కారణభూతమైన బ్రహ్మ కంటే, లయ కారణమైన బ్రహ్మ కంటే భేదాన్ని చూపే తీరుతుంది. ఆ విధంగానే, స్థితి కారణత్వరూపమైన లక్షణం కూడా స్వ లక్ష్యమైన బ్రహ్మకు జన్మ కారణ భూతమైన బ్రహ్మ కంటే, లయ కారణభూతమైన బ్రహ్మ కంటే భేదాన్ని చూపి తీరుతుంది. ఆ విధంగానే, లయ కారణత్వ రూపమైన లక్షణం కూడా స్వ లక్ష్యమైన బ్రహ్మకు జన్మ కారణభూతమైన బ్రహ్మ కంటే, స్థితి కారణభూతమైన బ్రహ్మ కంటే భేదాన్ని చూపి

తీరుతుంది. అందుచేత, ఈ విధంగా లక్షణ భేదాలతో బ్రహ్మ బహుత్వం సిద్ధించి తీరుతుంది. ఇందుకోసం పలు లక్షణాలను గ్రహించకుండా, " జన్మ కారణత్వే సతి, స్థితి కారణత్వే సతి, లయ కారణత్వం బ్రహ్మ లక్షణమ్" అని బ్రహ్మలక్షణాన్ని గ్రహిస్తాము— అని అంటే, వీటిలో ఒక్కొక్కటి లక్షణంగా సరిపోతాయి కనుక, మిగిలిన విశేషణాలు వ్యర్థం కావలసి వస్తాయి. ఇంతేకాక, జన్మ కారణత్వం, లయకారణత్వం అనేవి ఒకదానికి ఇంకొకటి విరుద్ధాలు కనుక, ఒకే చోట ఇవి రెండు కూడి ఉండే అవకాశం లేదు.

ఇప్పుడు ఇంకొక విషయాన్ని చెప్పవచ్చు. " అదిగో! పక్షి కూర్చుని ఉన్నదే! అక్కడే దేవదత్తుని పొలం "అని ఒకడు అంటే, దేవదత్తుని క్షేత్రానికి, పక్షిసంబంధాన్ని లక్షణంగా చెప్పినట్లు అవుతుంది. ఇటువంటి లక్షణంతో పక్షి నివసించే చోటు అయిన క్షేత్రంలో దేవదత్త స్వామిత్వం తెలుపబడుతున్నది. ఆ విధంగానే, ఇక్కడ కూడా, జన్మ కారణత్వం, స్థితి కారణత్వం, లయకారణత్వం అనే మూడిటిని జ్ఞాపక లక్షణాలుగా గ్రహించి, వీటితో ఒకే వస్తువు బ్రహ్మ పదార్థంగా చెప్పబడుతున్నది అని అనవచ్చు.

ఈ విధంగా చెప్పడం కూడా పొసగదు. దృష్టాంతంలో క్షేత్రం అనే ఒక వస్తువు ఇంతకుముందే తెలియబడి ఉన్నది. ఆ విధంగా తెలియబడి ఉండే వస్తువు విషయంలో పక్షి విశేషం యొక్క సంబంధాన్ని పురస్కరించుకొని దేవదత్త స్వామిత్వం తెలుపబడింది. ఆ విధంగానే ఇక్కడ కూడా తెలుపబడవలసిన బ్రహ్మకు ఇంతకుముందే తెలిసిన ఒక స్వభావాన్ని చెప్పి తీరాలి. ఇక్కడ ఆ విధంగా అయితే, ఏమి చెప్పడానికి సాధ్యం కాకుండా ఉన్నది. అందుచేత జన్మ కారణత్వం మొదలైనవానికి (పక్షివిశేష సంబంధాదులవలె) జ్ఞాపకత్వం సంభవించదు అని చెప్పవలసి వస్తుంది.

అలా చెప్పడం ఎందుకు? బ్రహ్మకు ఇంతకుముందే తెలిసిన ఒక స్వభావాన్ని చెప్పడానికి వీలు లేదా ఏమి? చక్కగా చెప్పవచ్చు కదా! "సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ" అనే వాక్యంలో చెప్పబడిన సత్యత్వం మొదలైనవానిని ఇంతకుముందు తెలిసిన స్వభావాలు అని అనకూడదా! అని అంటే, అక్కడ కూడా ఈ దోషమే సమానం.

సత్యత్వాదులు జ్ఞాపకాలు అయ్యేటప్పుడు, ఇంతకుముందే తెలిసిన స్వభావం వేరొకటి చెప్పవలసి ఉంటుంది. జన్మ కారణత్వాదులను చెబుతాము— అని అంటే, అవి తెలియకుండా బ్రహ్మ పదార్థం తెలుపడం సాధ్యం కాదు కనుక అన్యోన్యాశ్రయ దోషం అపరిహార్యం అవుతుంది. అందుచేత జన్మ కారణత్వాదులు లక్షణంగా చెప్పడం పొసగదు— అని మళ్లీ ఒక పూర్వపక్షం ప్రాప్తమైనది.

బ్రహ్మత్వం ప్రత్యక్షణానికి విషయం కానందుచేత, దానికి ఒక లక్షణం చెప్పడం సాధ్యం కాకపోయినా, లక్షణంతోనే ఏ వస్తువును అయినా తెలియవలసి ఉన్నది, కనుక, లక్షణంలోని అసంభవం చేత, తెలియడానికి సాధ్యం కానిది అయిన ఈ బ్రహ్మను గూర్చిన విచారం చేయడం ఏ విధంగా? అనే అక్షేపాన్ని తీరుస్తూ, " జన్మాద్యస్య యతః" అనే రెండవ సూత్రం ఆవిర్భవించింది— అని పలికి, పూర్వపక్షాన్ని ఇంతవరకు వివరించాము. ఇక, సిద్ధాంతం ఈ విధంగా ఉన్నది.

ఒక వస్తువునకు ఒక లక్షణం చెప్పినట్లయితే, ఆ లక్షణం అనేది "మిగిలిన వస్తువుల కంటే ఈ వస్తువు భిన్నమైనది" అనేదానిని చక్కగా అది తెలియజేస్తుంది అని చెప్పానుకదా! ఆ విధంగా వైలక్షణ్యాన్ని తెలియజేసేది అని అంటే ఏమి? అనేదాన్ని కొంచెం స్పష్టంగా తెలుసుకోవాలి. విశేషణాలతో మనం భేదాన్ని గ్రహించాలి విశేష్యంలో ఏదో ఒక ధర్మం ఉన్నదని విశేషణం తెలుపుతుంది. ఆ ధర్మం కంటే వేరైనా ఏ ధర్మం అందులో ఉండదు అని దానివల్ల తెలుసుకుంటున్నామా? లేక, ఆ ధర్మానికి విరుద్ధమైన వేరు ఏ ధర్మం అందులో ఉండలేదు అని తెలుసుకుంటున్నామా? అని పరిశీలించాలి. విశేషణాల వల్ల ఏర్పడిన ధర్మం తప్ప, వేరు ఏ ధర్మం అందులో, అంటే, విశేష్యం లో ఉండదు అని తెలుసుకుంటున్నాము అని తెలిసినట్లయితే, ముందు చెప్పిన పూర్వపక్షం బలపడుతుంది. వాస్తవం అయితే, ఆ విధంగా కాదు. ఒక విశేషణంతో విశేష్యంలో ఒక ధర్మం చూపబడినదే అయితే, దానికి విరుద్ధమైన ఏ ధర్మం అందులో ఉండదు —అని మనం తెలుసుకోగలం తప్ప, విరుద్ధం కాని వేరు ఏ ధర్మమూ అందులో ఉండదు— అని మనం తెలుసుకోవడం సాధ్యం కాదు. ఉదాహరణకు— "నీలో వృషభః"(

"నల్లని ఎద్దు" అనే ఒక వాక్యాన్ని తీసుకుందాం. ఇందులో నలుపు అనేది విశేషణం. ఎద్దు విశేష్యం. "నీలః "అనే విశేషణం ఇతర వ్యావృత్తిని చూపడం కోసమే ప్రయోగింపబడింది. నల్లని రంగుకు విరుద్ధమైన తెలుపు, ఎరుపు మొదలైన వర్ణాలు ఆ ఎద్దు లో లేవు –అని దీనివల్ల మనం తెలుసుకోవచ్చు తప్ప, దీనికి అభివృద్ధిలైన ద్రవ్యత్వం మొదలైన ధర్మాలు కూడా అందులో లేవు– అని మనం తెలుసుకోవడానికి వీలుకాదు. లోకానుభవం ఆ విధంగా లేదు. ఒక విశేష్యంలో పలు పలు ధర్మాలు ఉండవచ్చు. విశేషణం చేత, లేక, విశేషణాల చేత ఏ ఏ ధర్మాల సద్భావం ఏర్పడుతున్నదో, ఆ ధర్మాలు తప్ప పేరు ఏ ధర్మం విశేష్యం లో లేవు అనే ప్రతిపత్తి ఏ నాడు ఎవరికీ కలుగదు. ఆ ధర్మాలతో విరుద్ధంగా ఉండే ధర్మం ఉండదు– అనే ప్రతిపత్తియే కలుగుతుంది. " యువా నీలో వామనః ఫంగశ్చ దేవదత్తః" అని అంటే, యువకుడుగాను, నల్లనివాడుగాను, కురుచనివాడుగాను, కుంటివాడుగాను దేవదత్తుడుఉన్నాడు– అనే అర్థం వస్తుంది. ఇందులో యువా అనే విశేషణం యవ్వనం కలవాడు అని తెలిపి, యవ్వనమనే ఆ ధర్మానికి విరుద్ధమైన బాల్యం, వార్ధక్యం అనే ఈ అవస్థలను లేనివాడు– అని చూపుతుంది తప్ప, యవ్వనానికి అవిరుద్ధమైన వామనత్వం మొదలైన ధర్మాలు లేనివాడు– అని చూపదు కదా! ఈ విధంగా ఒక్కొక్క విశేషణాన్ని విమర్శించి మనం తెలియవచ్చు.

విరుద్ధమైన ధర్మాలు ఏకకాలంలో ఉండవే తప్ప, కాలభేదంలో అవి కూడా ఒకే వ్యక్తిలో ఉండడంలో అడ్డు లేదు " నీలవస్త్రధారీ దేవదత్తః" అని అంటే, దేవదత్తుడు అనే వ్యక్తి ఒక కాలంలో నల్లని రంగును కల వస్త్రాన్ని ధరించినవాడుగా ఉన్నా, ఇంకొక కాలంలో తెల్లని రంగును కలిగిన వస్త్రాన్ని ధరించినవాడుగాఅతడు ఉండటంలో విరోధం లేదు కనుక, నీలవస్త్రధారి అనే ఈ విశేషణం అనేది కాలాంతరంలో (తరువాత క్షణంలోనే )సంభవించడానికి అవకాశం ఉండడంచేత, శ్వేతవస్త్ర ధారణన విరోధించదుకదా! విశేషణాలనుగూర్చి ఈ విధంగా తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి.

ప్రకృతంలో జన్మ కారణత్వం, స్థితి కారణత్వం, లయకారణత్వం అనేవి కాలభేదంతో ఒక వ్యక్తి లోనే చేరి ఉండవచ్చు కనుక అవి అవిరుద్ధాలే కాగలవు. విలక్షణ శక్తి యుక్తుడైన పరబ్రహ్మ విషయంలో ఏకకాలంలోనే ఇవి కూడుతాయి. అందుచేత జన్మకారణత్వం మొదలైన లక్షణాల వల్ల పరబ్రహ్మకు బహుత్వాపత్తి అనేది కలుగదు. పరబ్రహ్మం క్షేత్రజ్ఞుల కర్మలకు తగినట్లు సృష్టి చేయవలసిన కాలంలో సృష్టించడం, ప్రళయం చేయవలసిన కాలంలో సంహరించడం చేస్తున్నది. లోకంలో వ్యవసాయదారుడు విత్తనం విత్తే కాలంలో దానిని విత్తడం, కోయవలసిన కాలంలో పంటను కోయడం చేసినట్లే ఇది కూడా అని తెలియాలి.

ఇంతే కాక, ఉత్తర నారాయణ మొదలైనవాటిలో లక్ష్మీపతిత్వం మొదలైన అసాధారణ చిహ్నాలతో ప్రతిపత్తికి విషయమైన వస్తువు జగత్కారణత్వం మొదలైన లక్షణాలతో బ్రహ్మ పదార్థంగా జ్ఞాపకం చేయబడుతున్నది అని గ్రహించడంలో కొరత లేదు, కనుక, రెండవ పక్షంలో కూడా దోషం లేదు. (ఇంతకముందే వివరింపబడిన పూర్వపక్షాన్ని ఇక్కడ స్మరించాలి). ఇందువల్ల జగజ్జన్మాధికారణత్వం అనేది విశేషణంగాను, ఉపలక్షణంగాను బ్రహ్మలక్షణం కావడానికి ఏ విధమైన అడ్డు లేదు అని తేలుతున్నది. ఇంకా ఇక్కడ వివరంగా తెలుపబడవలసినవి చాలా ఉన్నాయి. అవి శాస్త్రజ్ఞులకే గ్రహించడానికి ఆనందించడానికి తగినవి కనుక, ఇంత మాత్రంలో ఇక్కడ విరమింపబడుతున్నది.

**జన్మాద్యధికరణ సారార్థం ముగిసింది**

## 3)శాస్త్ర యోనిత్వాధికరణం

జన్మాద్యధికరణం అనే గడచిన అధికరణలో పరబ్రహ్మ కు జగజ్జన్మాదికారణత్వం లక్షణం అని తెలిసింది. ఇటువంటి లక్షణంతో కూడిన పరబ్రహ్మం అనేది ప్రత్యక్ష ప్రమాణంతో తెలుసుకొనబడకుండా పోయినప్పటికీ, అనుమాన ప్రమాణంతో సిద్ధించడంలో ఏ కొరతా లేదు కనుక, ఆ విధంగా అనుమాన ప్రమాణ సిద్ధమవుతున్న ఆ

పరబ్రహ్మను వేదాంత వాక్యాలతో విచారించవలసిన ఆవశ్యకత లేదు— అనే అక్షేపం తోచగా, దానికి పరిహారంగా ఈ అధికరణం అవతరించింది.

**శాస్త్ర యోనిత్వాత్** –(1–1–3)

"శాస్త్రాన్ని యోనిగా కలిగినది కనుక" అనేది ఈ సూత్రంలోని అర్థం. యోని అంటే— కారణం. తెలియడానికి కారణం —అనే వివక్ష చేత ఇక్కడ యోనిశబ్దం ప్రయోగింపబడింది. అంటే— ప్రమాణం అని అర్థం. శాస్త్రాన్ని ప్రమాణంగా కలిగిన దానివల్ల { అర్థం ఏర్పడుతున్నది. "అబ్భక్షో వాయుభక్షః" అనే ప్రయోగాలలో "నీటిని తాగేవాడు, వాయువును భక్షించేవాడు" అనేది శబ్దార్థం అయినప్పటికీ, " అసతి బాధకే సర్వం వాక్యం సావధారణమ్" అనే న్యాయం చేత, "తీర్థాన్ని మాత్రమే తాగేవాడు, వాయువును మాత్రమే భక్షించేవాడు" అనే అర్థం ఏర్పడేటట్లు, ఇక్కడ కూడా శాస్త్రాన్ని ఒక్కటిని మాత్రమే ప్రమాణంగా కలిగినది కనుక— అని అర్థం ఏర్పడుతున్నది. అందుచేత, " శాస్త్రమేవ యోనిః ప్రమాణం యస్య తత్, శాస్త్ర యోనిః, తస్యభావః శాస్త్రయోనిత్వం, తస్మాత్ శాస్త్ర యోనిత్వాత్" అని సమాసం చెప్పబడినట్లు అయినది. పరబ్రహ్మం అనేది అనుమానాన్ని ప్రమాణంగా కలిగినది కాకుండా, శాస్త్రాన్ని మాత్రమే ప్రమాణంగా కలిగినది కనుక, అటువంటి వేదాంతశాస్త్రంతో బ్రహ్మ విచారణ చేయవలసినది ఆవశ్యకమే అనేది సూత్రంలోని అర్థంగా ఏర్పడుతున్నది.

**ఇక్కడ పూర్వపక్షం ఏమంటే,**

" అప్రాప్తే హిశాస్త్రం అర్థవత్" అని అంటారు శాస్త్రజ్ఞులు. వేరు ఏ ప్రమాణం చేత ఏర్పడని విషయంలోనే శాస్త్రం ప్రవర్తిస్తుంది అనేది దీని అర్థం. దీని ప్రకారం చూస్తే పరబ్రహ్మ అనేది వేరు ఏ ప్రమాణం చేత సిద్ధించకుండా ఉంటేనే అందులో శాస్త్రం ప్రవర్తిస్తుంది అని, వేరు ఏదైనా ఒక ప్రమాణంతో బ్రహ్మసిద్ధి కలిగితే, అందులో శాస్త్రం ప్రవర్తించదు అని ఏర్పడుతున్నది. పరబ్రహ్మ అయితే, అనుమాన ప్రమాణంతో సిద్ధించదగినదిగా ఉన్నది, ఏ విధంగా అంటే—"భూమ్యంకురాదికం సకర్తృకం,

కార్యత్వాత్ ఘటవత్" అనేది ఒక అనుమాన శరీరం. లోకంలో మనం చూచే అన్ని వస్తువులు ఒక కర్తను కలిగినవి. కర్త అనేవాడు ఒకడు లేకుండా ఏ వస్తువు పుట్టదు. ఇల్లు, బాన, వస్త్రం మొదలైన అన్ని వస్తువులు ఒక కర్తను పురస్కరించుకున్నవే అనే విషయం మనం తెలుసుకుంటున్నాము. ఇందువల్ల కర్త అనేవాడు ఒకడు లేకుండా ఏ వస్తువు పుట్టదు— అనే నిశ్చయజ్ఞానం కలుగుతుంది. వెంటనే, ఇంకొక విషయాన్ని కూడా మనం గమనిస్తున్నాం. ఇంటిని కట్టినవానివాడుగా ఒకడు తెలిసినప్పటికీ, ఆ ఇల్లు ఏ చోట కట్టబడిందో, ఆ ప్రదేశానికి ఎవడు కర్త అనేది మనకు తెలియదు. ఇల్లు కట్టడంలో సాధనంగా ఉండే మన్ను, ఇసుక, కలప మొదలైన వస్తువులకు కూడా కర్త ఇతడు —అని మనం తెలిసికోలేకుండా ఉన్నాంము. బానను చేసేవాడు కుమ్మరివాడు— అని మనం గమనిస్తున్నప్పటికీ, ఆ బానకు ఉపాదాన కారణమైన మట్టి సృష్టించినవాడు ఇతడు అని మనం తెలుసుకోలేకున్నాము. వస్త్రానికి కర్త ఒక సాలెవాడు అని తెలిసికొన్నప్పటికీ, ఆ వస్త్రానికి ఉపాదాన కారణమైన పత్తిని సృష్టించినవాడు ఇతడు— అని తెలుసుకోలేకుండా ఉన్నాము. అయితే, కర్త అనేవాడు ఒకడు లేకుండా ఏ కార్యవస్తువు పుట్టదు కనుక, పూర్వం తెలిపిన మట్టి, ఇసుక, కలప మొదలైన వస్తువులకు కూడా కర్త ఒకడు ఉండి తీరాలి. అతడే ఈశ్వరుడు అనేవాడు— అని ఈ విధంగా ఈశ్వరుని తెలియడం అనేది అనుమాన ప్రమాణంతో సిద్ధించవచ్చు. అందుచేత ఇటువంటి అనుమానం అనే ప్రమాణంలో ఈశ్వరుడు సిద్ధించగానే, ఈ విధంగా ప్రమాణాంత ప్రాప్తమై ఉండే పరబ్రహ్మ విషయంలో శాస్త్రం అనే ప్రమాణం ప్రవర్తించదు. ఎందుకంటే, " అప్రాప్తే హి శాస్త్రం అర్థవత్" అని కదా నియమం ఉన్నది. అందుకే వేదాంతశాస్త్రం అనేది జగజన్మాదికారణ భూతమైన బ్రహ్మ విషయంలో ప్రమాణం కాలేదు కనుక, వేదాంత శాస్త్ర విచార రూపం అయిన బ్రహ్మవిచారం చేయదగినది కాదు— అనే పూర్వపక్షం ఇక్కడ ప్రసక్తమైనది.

**దీనికి తరువాత సిద్ధాంతం ఈ విధంగా ఉన్నది**

అనుమానంతో ఒక విషయాన్ని సాధించేటట్లయితే, అది రుజువుగా సిద్ధించ తగిన విషయం కాదు. అనుమానంతో ఈశ్వరుడే జగత్కర్తగా సిద్ధించాలనే నియమం లేదు. ఏ విధంగా అంటే, విశ్వామిత్ర ముని తపశక్తితో మిక్కిలి గొప్పతనాన్ని కలిగిన నూతన జగత్ సృష్టి చేశాడు— అనే విషయాన్ని మనం శ్రీరామాయణంలో చదివి తెలుసుకుంటున్నాము. "అన్యమింద్రం కరిష్యామి" అని మొదలైన శ్లోకాలు అనేకం మనకు తెలిసినవే. ఆ ముని ఒక జీవవ్యక్తియే తప్ తప్ప ఈశ్వరుడు కాదు. ఇందువల్ల జీవకోటిలోనే అతిశయించిన శక్తిని కల కొందరికి విచిత్ర జగత్ సృష్టిని చేయగలిగిన శక్తి ఉన్నది అనే విషయం తెలుస్తున్నందున, ఇంతకుముందు చూపిన అనుమాన ప్రమాణంతో ఈశ్వరుడు జగత్తుకు కారణభూతుడుగా సిద్ధించాలని నిర్బంధం లేదు. విలక్షణ శక్తి కలిగిన చేతనుడే సృష్టికర్తగా ఏర్పడవచ్చు కనుక, అనుమానం ఈశ్వర సాధనలో శక్తిని కలిగినది కాదు. అందుచేత శాస్త్రమే పరబ్రహ్మ సిద్ధిలో ప్రబల ప్రమాణం కాగలదు. అటువంటి శాస్త్రం వేదాంతశాస్త్రమే. దానితో బ్రహ్మవిచారణ చేయడం చక్కగా పొసగుతుంది— అని చెప్పినట్లు అయినది.

**శాస్త్ర యోనిత్వాధికరణ సారార్థ నిరూపణం ముగిసింది**

## 4) సమన్వయాధికరణం

పరబ్రహ్మ అనేది శాస్త్రం తప్ప వేరొక ప్రమాణంతో సిద్ధించదు— అని భావించినప్పటికీ, ఆ బ్రహ్మం ప్రవృత్తి నివృత్తులకు విషయం కానందువల్ల, అటువంటి బ్రహ్మను ప్రతిపాదనం చేయడంలో ఫలమేమీ లేనందుచేత, ఆ బ్రహ్మ విషయంలో శాస్త్రానికి ప్రామాణ్యం సంభవించదు కనుక, ఆ బ్రహ్మం శాస్త్ర ప్రతిపాద్యం కావడానికి అవకాశం లేదు అని ఒక అక్షేపం రాగా, దాని పరిహారం కోసం ఈ సమన్వయాధికరణం ఆవిర్భవించింది.

**తత్తు సమన్వయాత్ –(1–1–4)**

ఉ సూత్రంలో "బ్రహ్మణః "అనే ఒక పదం, "శాస్త్రేణ" అనే ఇంకొక పదం అధ్యాహారం చేసుకోవాలి, అంటే, చేర్చుకోవాలి.

తత్–పూర్వం సూత్రంలో చెప్పబడిన శాస్త్ర ప్రమాణకత్వం అనేది–అని అర్థం. సమన్వయాత్– చక్కగా పురుషార్థంగా అన్వయిస్తున్నందున– అని అర్థం. అంటే, పరబ్రహ్మ అనేది శాస్త్రంతో పురుషార్థంగా ప్రతిపాదింపబడుతున్నందున పరబ్రహ్మకు శాస్త్ర ప్రమాణకత్వం సంభవించడంలో లోటు లేదు అనేది సూత్రంలో అర్థమని తేలింది.

ఇక్కడ పూర్వపక్షం ఏమంటే– పరబ్రహ్మ నుశాస్త్రం ప్రతిపాదించాలి అంటే, అది ఇంకొక ప్రమాణంతో తెలియబడకుండా ఉండాలి అనేదే కాక, వేరొక స్వభావంకూడా అందులో ఉండాలి. అది ఏమంటే తెలిసికోవాలని ఆశపడదగినదిగా ఉండడం అనే స్వభావమే. తెలిసిపోవాలి అనే ఆశ ఏ వస్తువులో ఉండదో, ఆ వస్తువును గూర్చి శాస్త్రం ప్రతిపాదనం చేయదు కదా. పరబ్రహ్మ ఇతర ప్రమాణంతో తెలుసుకోవడానికి వీలు కాదు అనేదానిని ఒప్పుకుంటాము. తెలుసుకోవాలనే స్వభావం బ్రహ్మ విషయంలో ఉండడానికి అవకాశం అనేది లేదు. ఎందుకంటే, తెలిసిపోవాలి అనే కోరిక అనేది లోకంలో ప్రయోజనం కలిగినదైనవస్తువు విషయంలోనే కలుగుతుంది. ఇష్ట ప్రాప్తి అనిష్ట పరిహారం అనే రెండు, లేక, రెండిటిలో ఒకటి లోకంలో ప్రయోజనం అని చెప్పదగినది. ఇష్టప్రాప్తి అనేది ప్రవృత్తి చేతనే సంభవించవలసిది, యాగం అనే కార్యంలో ప్రవృత్తి కలిగితే స్వర్గమనే ఇష్ట ప్రాప్తి కలుగుతున్నది. ప్రవృత్తి చేత ఇష్టప్రాప్తి అనేది కలిగినట్లుగా, నివృత్తిచే అనిష్టపరిహారం కలుగుతున్నది. మాంసభక్షణమనే కార్యంలో నివృత్తి కలిగితే అనిష్టపరిహారం కలుగుతున్నదికదా. ప్రకృతంలో పరబ్రహ్మ అనేది ప్రవృత్తికి గాని, నివృత్తికి గాని లక్ష్యం కాదు. ఎందుకంటే, పరబ్రహ్మ అనే వస్తువే కంటికి కనబడనిదిగా ఉన్నందున. అందుచేత ప్రయోజనవత్త్వం ఇక్కడ చెప్పడం సాధ్యం కాదు. అందుచేత తెలిసికోవాలని కోరదగినదిగా ఉండడం అనే స్వభావం బ్రహ్మకు సంభవించడానికి

అవకాశం లేదు కనుక, ఆ బ్రహ్మను శాస్త్రం విచాచగలిగినది కాదు. అందుచేత శాస్త్రంతో బ్రహ్మవిచారం చేయాలని ఆరంభించడం అనేది పొసగద అనేదిఇక్కడ పూర్వపక్షం.

**దీనిపై సిద్ధాంతం అనేది ఈ విధంగా ఉన్నది**

పరబ్రహ్మకు ప్రయోజనాంతరవత్త్వం సంభవించకపోయినా, పలు పలు వేదాంతవాక్యాలతో" అదే కదా స్వయంప్రయోజనం, పరమపురుషార్థం" అని తెలుపబడింది" పుత్రః తే జాతః" "(నీకు పుత్రుడు పుట్టాడు) అని, " తవ గృహే నిధిరస్తి" ( నీ ఇంటిలో నిధి ఉన్నది) అని అంటే, ఈ వాక్యాలు పరమానంద హేతువైన పుత్రజన్మను, నిధి ఉండడాన్ని తెలిపేటట్లే, వేదాంతవాక్యాలు పరమానందానికి హేతువుగా, పరమానంద సందోహస్వరూపమైన బ్రహ్మను ప్రతిపాదించడం సమంజసమే అవుతున్నది. అవి అపౌరుషయాలు కనుక, పురుష బుద్ధి మూలంగా వచ్చే భ్రమ ప్రమాద విపర్యాసాలు అక్కడ భావించరానివి. అందుచేత అబద్ధాన్ని పలికి వంచించేవి కావు, వేదాంత శాస్త్రాలు. అందుచేత అటువంటి వాటిని పురస్కరించుకొని బ్రహ్మవిచారంచేయడం తగినదే— అని చెప్పినట్లు అయినది.

ఈ అధికరణాన్ని దృష్టిలో పెట్టుకొని భట్టర్ శ్రీరంగ రాజస్తవం ఉత్తర శతకంలో "అత్రాస్తే నిధిరితివత్ ———రంగేశ త్వయి సకలాః సమన్వయంతే " అనే శ్లోకాన్ని అనుగ్రహించారు. దీని వివరాన్ని శ్లోక వ్యాఖ్యానంలో గమనించవచ్చు.

**సమన్వయాధికరణ సారార్థ నిరూపణం ముగిసింది**

**చతుఃసూత్రి ముగిసింది**

## 5) ఈక్షత్యధికరణమ్

ఇంతకుముందు పూర్తి అయిన చతుఃసూత్రిని శాస్త్రారంభ సమర్థనమని మన వేదాంతులు వ్యవహరిస్తారు. "శారీరక మీమాంస అనే ఈ శాస్త్రాన్ని ఆరంభించడం

ఆవశ్యకం కాదు" అని వచ్చిన సందేహాలు పూర్వం నాలుగు సూత్రాలలో పరిహరింపబడ్డాయి—అని దీని భావం. ముముక్షువు విచారించి తెలియవలసిన బ్రహ్మం అనేది మొదటి సూత్రంలో ప్రస్తావింపబడింది. ఆ బ్రహ్మం చేతనా చేతన విలక్షణం అని ప్రకాశించడం కోసం జగజ్జన్మాది కారణత్వమనే లక్షణం రెండవ సూత్రంలో చెప్పబడింది. ఆ బ్రహ్మం అనేది శాస్త్రం ఒక్కటితోనే తెలియబడదగినది— అనే విషయం మూడవ సూత్రంలోనూ, నాలుగవ సూత్రంలోనూ— ఈ విధంగా రెండు సూత్రాలలో చెప్పబడింది. ఇక. ఈ బ్రహ్మను గూర్చిన విచారం ఆరంభింప బడుతున్నది.

ఇంతకుముందు పరబ్రహ్మ శాస్త్ర ప్రతిపాద్యం అనే సిద్ధాంతం చేసినప్పుడు పరబ్రహ్మం అపురుషార్థమనే పూర్వపక్షం వచ్చింది. ఆ విధంగా కాదు, అది పరమ పురుషార్థమే —అని ఇంతకు ముందు సమన్వయాధికరణలో నిరూపింపబడింది. సద్విద్యలో ప్రధానమనే తత్వమే కదా జగత్కారణం అని చెప్పబడింది. అది అపురుషార్థం కనుక హేయం —అని కపిల మహర్షి చేత సాంఖ్య తంత్రంలో చెప్పబడింది కదా. అందుచేత బ్రహ్మం జగత్కారణమని, అది పురుషార్థమని ఏ విధంగా చెప్పడానికి వీలవుతుంది ?అనే అక్షేపాన్ని పరిహరించడం కోసం అయిదవది అయిన ఈ అధికరణం ప్రస్తుతమైనది.

**ఈక్షతేః నా శబ్దమ్** —(1—1—5)

ఈక్షతేః, న, అశబ్దం —అని ఇక్కడ పదవిభాగం చేసుకోవాలి.

అశబ్దమ్ అనేది ప్రధానం అనబడే ప్రకృతి అని అర్థం. శబ్దం అనేది శాస్త్రం. శాస్త్రాన్ని ప్రమాణంగా కలిగినది కాకుండా, అనుమాన గమ్యమైనది ప్రధానం, న— ఆ ప్రధానం అనేది సద్విద్యలో ఉన్నట్లుగా జగత్కారణాన్ని చెప్పే సత్ అనే శబ్దంతో చెప్పబడదు, ఎందుకంటే, ఈక్షతేః— ఆ సత్ అనే శబ్దం చేత చెప్పబడే వస్తువుకు ఈక్షణం, అంటే, సంకల్పం చెప్పబడినందున —అని సూత్రంలోని అర్థం.

చాందోగ్యోపనిషత్తులో "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసిత్" అనే ఒక వాక్యం ఉన్నది. ఈ విధంగా ఆరంభమయ్యే ఈ వాక్యంలో చెప్పబడే విద్య సద్విద్య అనబడుతుంది. అందులో సచ్ఛబ్దంతో నిర్దేశింపబడిన జగత్కారణ వస్తువు అనేది ఒకటి సంకల్పించినట్లుగా ఆ వాక్యంలో ఉండే "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" ఇత్యాధివాక్యంతో చెప్పబడినందున, సత్ అనే చేత నిర్దేశింపబడే ఆ వస్తువు పరబ్రహ్మగా ఉండదగినది తప్ప, ప్రధానంగా ఉండదగినది కాదు—అనేదే ఈ సూత్రంలోని సారమైన అర్థం.

### పూర్వపక్షం

మనం కంటితో చూసే ప్రపంచానికి రెండు అవస్థలు ఉన్నాయి. కారణావస్థ అని, కార్యావస్థ అని వీటికి పేరు. సూక్ష్మమైన స్థితిని కారణావస్థ అని, స్థూలమైన స్థితిని కార్యావస్థ అని వ్యవహరించడం జరుగుతున్నది. అటువంటి కారణావస్థను ప్రతిపాదించే వాక్యం "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసిత్" అనే. చాందోగ్యోనిషద్వాక్యం. ఇందులో సత్ అనే శబ్దంతో చెప్పబడే వస్తువు ప్రధానమనే త్రిగుణ ద్రవ్యమే కాదగినది. సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలుతో కూడిన సమూహమైన జగత్తుకు ఉపాదాన కారణం ఏదో అదే ఇక్కడ సదేవ అని మొదలైన శ్రుతివాక్యంలో చెప్పబడినందున, ఆ వస్తువు సత్వాది గుణత్రయంగా ఉండవలసిన ఆవశ్యకత ఉన్నది. ఎందుకంటే, కార్యవస్తువులో కనిపించే గుణాలు అన్ని కారణ వస్తువులు కూడా ఉండవలసిన ఉండడం అనేది ఆవశ్యకం కనుక. . అందుచేత, సత్ అనే శబ్దంతో నిర్దేశింపబడిన, జగత్తుకు కారణభూతమైన వస్తువు ప్రధానమే కావాలి. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" అని ఆ వస్తువుకు ఈక్షణం, అంటే సంకల్ప కర్తృత్వం చెప్పబడింది కదా. అది అచేతనమైన ఆ వస్తువుకు సంభవించదు కదా! అని అంటే, అదే ప్రకరణంలో తరువాత "తత్తేజ అసృజత" అని మొదలైన వాక్యాలు కూడా కనిపిస్తున్నాయి. వాటిలో తేజస్సు మొదలైన వాటికి ఈక్షణం చెప్పబడింది కదా. అది ఏవిధంగా సంభవిస్తుంది? అనే ప్రశ్న కలిగితే, చేతన వస్తువుకు అసాధారణంగా ఉండే ముఖ్యమైన ఈక్షణం అనేది అచేతనమైన ప్రధానానికి

సంభవించకపోయినా, కార్యంలో ఉన్ముఖం కావడం అనే ఈక్షణమే గౌణమైన ఈక్షణమని చెప్పబడుతున్నదని అందరూ చెప్పి తీరాలి. అదే ప్రకరణంలో ఉండే "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" అనే వాక్యంతో సచ్ఛమైన వస్తువుకు తెలుపబడిన ఈక్షణం ఆ విధంగానే గౌణంగా నిర్వహించడం ఏలోటు లేనిదే కాగలదు. అందుచేత, ప్రధానమే కారణ వస్తువుగా కాదగినది అనేది ఇక్కడ పూర్వపక్షం.

**సిద్ధాంతం**

చాందోగ్యోపనిషత్తులో "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసిత్" (6–2–1) అనే వాక్యం ఉన్నది ఈ వాక్యంలోనే తరువాత (6–8–6) " సన్మూలాః సౌమ్యేమాః ప్రజాః" అని ఆరంభించి "స ఆత్మా" అనే వరకు ప్రస్తుతమైన సత్తుకు చేతనత్వం చెప్పబడినందున, "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" అనే చోట చెప్పబడిన ఈక్షణం చేత చేతనునకు అసాధారణమైన, ముఖ్యమైన ఈక్షణంగానే వివక్షితమని స్పష్టపడుతున్నది. "తత్తేజో అసృజత" అని మొదలైన వాక్యాలలో కూడా ఈక్షణం గౌణమైన ఈక్షణం వివక్షితం కాదు ముఖ్యంగానే వివక్షితం అని పైన రెండవ పాదంలో ఉపపాదనం చేయబడుతుంది.

ఇంతే కాక, ఈ ప్రకరణంలో 'తస్య తావదేవ చిరం యావత్ యావత్ న విమోక్ష్యే" అని అధ్యయనం చేయబడుతున్నది₹దీని అర్థం ఏమంటే– సత్ అనే శబ్దం చేత చెప్పబడే వస్తువును ఉపాసించేవానికి ఆ సత్తను పొందడంలో దేహంనుండి విడిపడడంవరకే ఆలస్యం, దేహం నుండి విమోచనం కాగానే స్వచ్ఛబ్దంచేత చెప్పబడే కారణవస్తువును పొందుతున్నాడు– అనేది అర్థం. దీనివల్ల సత్తును ఉపాసించేవానికి దేహవిమోచనం కలిగిన తరువాత మోక్ష ప్రాప్తి కలుగుతుందని చెప్పబడినందున, మోక్షోపాయమైన ఉపాసనకు లక్ష్యమైనది – ఆ సచ్ఛబ్దనిష్ఠమైన వస్తువు –అని చక్కగా తెలుస్తున్నది. ఉపాసనకు లక్ష్యమై ఉండే స్వభావం ప్రధానానికి సంభవించదు. అందుచేత కారణ వాక్యంలో ఉండే సత్ అనే శబ్దంచేత ప్రధానం వివక్షితం అని చెప్పే అవకాశం ఏమాత్రం లేదు. అది వివక్షితమై ఉంటే కదా, "అది అపురుషార్థం కనుక

హేయం" —అని పూర్వం ప్రస్తావించిన వాదం చెల్లుతుంది. అందుచేత హేయంగా ఉండడానికి ఇక్కడ ఏమాత్రం ప్రసక్తి లేదు. మోక్షోపాయరూపంగా ఉపాదేయత్వమే ప్రకాశిస్తున్నది.

ఇంతేకాక, సద్విద్య ఆరంభంలో "యేనాశ్రుతం శ్రుతమ్" అని మొదలైన వాక్యాలతో —ఒక విషయాన్ని తెలుసుకుంటే దానికి కార్యాలై ఉండే అన్నిటిని తెలుసుకున్నట్లు అవుతుంది— అనే విషయాన్ని ప్రతిజ్ఞ చేసి, వాటికి కార్యకారణ భావాన్ని ఉపపాదనం చేయడం కోసం "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్" అని ఆరంభించబడింది. అందుచేత, దేనిని తెలుసుకుంటే అన్నిటిని తెలిసికొన్నది అవుతుందో అదే ఇక్కడ సత్ శబ్దం చేత చెప్పబడినదిగా అయి ఉండాలి. అది అచేతనమైన ప్రధానంగా ఉన్నట్లయితే దానిని తెలిసికొంటే చేతన వస్తువును తెలుసుకున్నట్లు అవుతుందా? అని గమనించాలి. ఇది సంభావితం కాదు. ఆ వస్తువు ప్రధానంగ కాకుండా, పరబ్రహ్మగా ఉంటే అది ఒక్కటే స్థూల సూక్ష్మ చేతనా చేతనాలను శరీరంగా కలిగినది అయినందున, కార్యత్వ కారణత్వాలు రెండు దానికి మాత్రమే ఉన్నదనే విషయం తరువాత ప్రకృత్యధికరణంలో చెప్పబడబోతున్నందున, ఇంతకుముందు తెలిపిన ప్రతిజ్ఞ ఉపపన్నం అవుతుంది.

ఇంకా, ఇంతే కాక, అదే ఛాందోగ్యోపనిషత్తులో తరువాత సుషుప్తిని తెలిపే ప్రకరణంలో "సదా సోమ్య తదా సంబంధో భవతి" అని సుషుప్తునకు సత్ శబ్దంతో నిర్దేశింపబడిన కారణ వస్తువులో లయాని చెప్పి, వెంటనే, స్వ మభీతో భవతి" అని అన్నందున, ఆ లయం అనేది జీవాత్మ తనలో తాను లయాన్ని పొందినట్టు —అని చెప్పింది. ఇది ఎప్పుడు పొసగుతుంది? అని గమనించాలి. సత్ అనే శబ్దం చేత నిర్దేశింపబడిన వస్తువు అయిన జీవునకు వాచకమైన స్వశబ్దానికి వాచ్యమై ఉన్నప్పుడే ఇది ఉపపన్నం అవుతుంది. ( సచ్ఛబ్దవాచ్యం, స్వశబ్ద వాచ్యం ఒకటిగా ఉంటే తప్ప ఇది పొసగదు—అని అర్థం) సత్ అనే శబ్దం చేత చెప్పబడేవాడు పరమాత్మయే అయి ఉండాలి అనే విషయం దీనివల్ల తేలుతున్నది. ప్రధానం ఈ విధంగా కావడంలో అవకాశం

లేదు కదా. ఏ వస్తువును అయినా చెప్పే ఏ శబ్దం అయినా పరబ్రహ్మ వరకు చెప్పి తప్ప నిలువదు, పరబ్రహ్మ పర్యంతం అర్థాన్ని బోధిస్తుంది –అని తరువాత వివరింపబడుతుంది.

ఇంతే కాక, మహోపనిషత్ మొదలైనవాటిలో నారాయణుడైన పరబ్రహ్మకు జగత్కారణత్వం చెప్పబడింది. ప్రకృతంలో సత్ అనే శబ్దం కారణ వస్తువును చెప్పే సామాన్య శబ్దం అయినందున, సామాన్య విశేష న్యాయంద్వారా దీనికి విశేషంలో పర్యవసానం చేసి తీరాలి. పరబ్రహ్మ విషయంలోనే ఇది విశేషపర్యవసానం పొందుతుంది. చాందోగ్యోపనిషత్తులోనే "ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకోఽవిజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్య సంకల్పః" అనే చోట అపహతపాప్మత్వం మొదలైన గుణాలను కల నారాయణుడే ముముక్షువులచేత ఉపాసించదగినవాడు అని చెప్పబడినందున, ఆ స్వామికే కారణత్వం సిద్ధిస్తుంది కనుక, ప్రధానమనేది ప్రకృతంలో కారణవాచకమైన సత్ అనే శబ్దానికి వాచ్యం అయే దారి లేదు. అందుచేత, సాంఖ్యులచే చెప్పబడిన ప్రధానానికి ఇక్కడ ప్రసక్తి లేశం కూడా లేదు– అని ఏర్పడుతున్నది. సత్త్వ రజస్తమో గుణమయమైన జగత్తుకు అటువంటి ప్రధానమే కారణమై ఉంటుంది అనే వాదం విలక్షణత్వాధికరణంలో ఖండింపబడుతుంది.

ఈ ఈక్షత్యధికరణంలో " ఈక్షతేః నాశబ్దమ్" అనే మొదటి సూత్రం కాకుండా, " గౌణశ్చేన్నాత్మశబ్దాత్", " అన్నిష్ఠస్య మోక్షోపదేశాత్", " హేయత్వవచనాచ్చ", " ప్రతిజ్ఞా విరోధాత్", " స్వాప్యయాత్", "గతిసామాన్యాత్", " శ్రుతత్వాచ్చ" అనే ఇంకా ఏడు సూత్రాలు కూడా ఉన్నాయి. వాటి అర్థం ఇంతకుముందే వివరింపబడింది.

## 6) ఆనందమయాధికరణం

గడచిన ఈక్షత్యధికరణంలో జగత్కారణ వస్తువుకు సంకల్ప విశేషం చెప్పబడినందున, ఆ సంకల్పం గౌణం కాకుండా, ముఖ్యంగానే నిర్వహింపబడవలసి ఉన్నందున, అటువంటి సంకల్పానికి ఆశ్రయమైన జగతారణ వస్తువు అచేతనమైన

ప్రధానమై ఉండదు అని నిరూపింపబడింది. ఇక, ఆచేతన వస్తువు జగత్కారణం కాకపోవచ్చు, జీవుడే జగత్కారణంగా ఉండవచ్చు కదా! అతనికి సంకల్పం అనే ఈక్షణం ముఖ్యంగానే సంభవిస్తుంది కద! అనే సందేహం రాగా, దాన్ని పరిహరించడం కోసం ఆనందమయాధికరణం అవతరించింది.

**ఆనందమయోఽభ్యాసాత్**–(1–1–13)

ఆనందమయః, అభ్యాసాత్ –అనేది ఇక్కడ పదవిభాగం. దీనికి పైన ఉండే అంతరధికరణంలో రెండవ సూత్రమైన "భేదవ్యపదేశాదన్యః" అనే సూత్రం నుండి అన్యః అనే పదం ఇక్కడకు తెచ్చి చేర్చుకోవాలి. అందుచేత "ఆనందమయః అన్యః, అభ్యాసాత్" అని అన్నట్లయినది.

ఆనందమయః –ఆనందమయ శబ్దంచేత చెప్పబడే పురుషుడు, అన్యః– జీవాత్మకంటే భిన్నుడైన పరమాత్మయే కాదగినవాడు, ఎందుకంటే, అభ్యాసాత్– పరిమితిని దాటినదిగా చెప్పబడిన ఆనందాన్ని కలిగి ఉండడం అనేది దుఃఖ మిశ్రుడైన జీవాత్మకు ఉండే అవకాశం లేకుండా, పరమాత్మకే అది పొసగుతున్నందున– అనేది ఈ సూత్రంలోని అర్థం.

తైతిరీయోపనిషత్తులో ఆనందవల్లి అనే ఒక భాగం ఉన్నది. అందులో ఆనందమయ విద్యా ప్రకరణంలో " తస్మాద్వా ఏతస్మాత్ విజ్ఞానమయాత్ అన్యోంతర ఆత్మా ఆనందమయః" అనే వాక్యంలో ఆనందమయుడైన ఆత్మను ప్రస్తావించి, దానికి తరువాత, " "సైషాఽనందస్య మీమాంసా భవతి" అని ఆరంభించి, " తే యే శతం ప్రజాపతే రానందాః స ఏకో బ్రహ్మణ ఆనందః, శ్రోత్రియస్య చాకామహతస్య" అని పర్యంతం ఆనందమయుడైన ఆత్మకు ఉండే ఆనందానికి అవధిని చెప్పే క్రమంలో, చతుర్ముఖబ్రహ్మకు ఏ ఆనందం ఉన్నదో, ఆ ఆనందం కంటే నూరు రెట్లు అధికమైన ఆనందం పరబ్రహ్మకు ఒక ఆనందం– అని చెప్పి, "శ్రోత్రియస్య చాకామహతస్య" అనే వాక్యంలో ముక్తుడు కూడా అటువంటి ఆనందాన్ని కలిగి ఉండడాన్ని చెప్పింది.

"అకామహతుడు " అంటే విషయ విరక్తుడు— అని అర్థం. శ్రోత్రియుడు అంటే— వేదాంత శ్రవణం చేసినవాడు—అని అర్థం. వేదాంత శ్రవణం చేసి, బ్రహ్మోపాసనం చేత ముక్తిని పొందినవాడు అని ఇక్కడ సారమైన అర్థం. నూరు రెట్లుగా వృద్ధి చేయబడిన చతుర్ముఖుని ఆనందం ముక్తునకు ఒక ఆనందం అని ఇక్కడ చెప్పినట్లయినది. ఈ ముక్తునకు చెప్పబడిన ఆనందమనేది బ్రహ్మోపాసనచేత కలుగుతుంది అని "శ్రోత్రియస్య "అనే పదం ద్వారా చెప్పబడింది. అందుచేత, ముక్తానందమనేది ఉపాసన ప్రీతుడైన భగవంతునికి సంకల్పం చేత ఏర్పడినది అనే విషయం ఇక్కడ స్పష్టమవుతున్నది. ముక్తానందం నిరుపాధికం కాదు, సోపాధికం అని దీనివల్ల తెలుస్తున్నది. "స ఎకో బ్రహ్మణ ఆనందః" అనే చోట అయితే, కారణం ఏమి చెప్పబడునందున, పరబ్రహ్మ యొక్క ఆనందం అనేది వేరెవరి సంకల్పానికి అధీనం కాకుండా, సహజంగా ఉండేది అనే విషయం చక్కగా ఏర్పడుతున్నది. నిరుపాధికమైన ఆనందాన్ని కలిగి ఉండడం పరమాత్మకు తప్ప వేరే ఎవరికీ లేదు— అని తెలుస్తున్నందున, అటువంటి ఆనందాన్ని కలిగినదిగా ఆనందమయ శబ్దంచేత నిర్దేశింపబడిన వస్తువు జీవుని కంటే భిన్నుడైన పరబ్రహ్మయే— అని ఇక్కడ తాత్పర్యం.

తైత్తిరీయోపనిషత్తులో ఉండే ఆనందవల్లిని ఆనంద విద్య అని వేదాంతులు వ్యవహరిస్తారు. ఆ విద్యలో " కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందో న స్యాత్, ఏష హ్యేవానంద యాతి " అని అధ్యయనం చేయబడుతున్నది. దీని అర్థం ఏమంటే, పూర్వం చెప్పబడిన ఆకాశశబ్ద వాచ్యమైన వస్తువు నిరుపాధికంగానూ, అపరిచ్ఛిన్నంగానూ ఉండే ఆనందాన్ని కలిగినది కాకుండా ఉండేదైతే, బ్రహ్మ మొదలుకొని చీమవరకూ ఉండే జంతుసమూహాలలో, కో వా అన్యాత్— ఏ జంతువు ప్రాకృతమైన ఆనందాన్ని పొందగలదు? " కోవా ప్రాణ్యాత్ "—ఏ ప్రాణి మోక్షానందాన్ని పొందగలదు? " ఏష ఏవ హి" ఈ ఆనందమయుడైన ఆత్మయే కదా, " ఆనందయాతి " —ప్రాకృతమైనది, అప్రాకృతమైనది అయిన అన్ని విధాలైన ఆనందాన్ని కలిగిస్తున్నది.

(ఆనందయతి —అనే ప్రయోగంలోని యకారం దీర్ఘంగా ఉండడం చాందసం) ఇక్కడ ఈ విధంగా చెప్పడమే కాకుండా, ఉత్తర నారాయణ అనువాకంలో కూడా "తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతే ఆయనాయ" అని అన్నందు వల్ల కూడా ఈ అర్థమే స్థిరీకరింపబడింది. "ఏవం తం విద్వాన్"— ఈ విధంగా ఆ మహా పురుషుని ఉపాసించేవాడు, " అమృతో భవతి"— మోక్షానందాన్ని పొందినవాడవుతున్నాడు. "ఆయనాయ"— ఆ మోక్షానంద ప్రాప్తి కోసం, "అన్యః పంథా న విద్యతే "— ఆ మహాపురుషుడు తప్ప వేరు ఉపాయం ఏమీ లేదు— అనేది ఈ వేదవాక్యంలోని అర్థం. "ఏష హ్యేవానందయాతి"— అని వేదవాక్యంలో అన్వయ ముఖంతో చెప్పబడ్డ అర్థమే, " నాన్యః పంథా విద్యతే అయనాయ" అనే వేద వాక్యంలో వ్యతిరేక ముఖంగా తెలుపబడింది అని అనేది మాత్రమే తేడా. ఈ విధంగా రెండు శ్రుతివాక్యాలు ఒకే అర్థాన్ని తెలిపేవిగా ఉన్నందున, ఉత్తర నారాయణానువాక వాక్యం లక్ష్మీపతినే విషయంగా కలిగి ఉన్నట్లే, ఆనందమయ విద్యలో కూడా ఆ స్వామియే విషయభూతుడు అనే విషయం కూడా తెలియడం సులభం.

అంతేకాక ఆనందమయ విద్యలో "స యశ్చాయం పురుషే, యశ్చాసా వాదిత్యే, స ఏకః" అనే వాక్యంతో ఆనందమయుడు, ఆదిత్య మండలం మధ్యలో ఉండే పుండరీకాక్షుడు ఒకరే అని చెప్పినందున, ఆ పుండరీకాక్షుడే ఆనందమయుడు అని స్పష్టపడుతున్నది. అందువల్ల ఇటువంటి గుర్తులతో ఆనందమయ విద్యావేద్యుడు, పుండరీకాక్షుడు అయినవాడు పరమపురుషుడే అని స్పష్టమవుతున్నది.

**ఇక్కడ ఒక పూర్వపక్షం**

ఆనందవల్లిలో "బ్రహ్మవిత్ ఆప్నోతి పరమ్" అని బ్రహ్మను ప్రస్తావించి, " సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని ఆ బ్రహ్మ యొక్క లక్షణాన్ని చెప్పి, " తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" ఇత్యాది వాక్యంతో ఆ బ్రహ్మం ఆత్మ అనే విషయాన్ని, ఇందులో నుండి ఆకాశాదిపదార్థాల ఉత్పత్తిని చెప్పి, " తస్మాద్వా

ఏతస్మాత్ విజ్ఞానమయాత్ అన్యోంతర ఆత్మ ఆఆనందమయః" అనే పర్యంతం ఉపక్రాంతమైన ఆత్మోపదేశ పరంపర అనేది ఆనందమయునిలో సమాప్తి చేయబడింది. అందువల్ల ఉపక్రమింపబడిన బ్రహ్మ ఆనందమయుడైన ఆత్మయే అని నిశ్చయింపబడుతున్నది. ఆనందమయుడైన ఆత్మకు "తస్యైష ఏవ శారీర ఆత్మా" అనే ఉత్తర వాక్యంలో శరీర సంబంధిత్వమనే శారీరత్వం చెప్పబడి ఉన్నది. కర్మ పరవశుడైన జీవాత్మకే కర్మ ఫలానుభవం కోసం శరీర సంబంధం సంభవిస్తుంది. అకర్మవశ్యుడైన పరమపురుషునకు అది సంభవించే న్యాయం లేదు. అందుచేత శరీర సంబంధం కలవాడుగా చెప్పబడ్డ ఆ ఆనందమయుడైన ఆత్మ జీవాత్మయే అని నిశ్చయింపబడుతున్నది —అనేది ఇక్కడ పూర్వపక్షం.

**ఇటువంటి పూర్వపక్షాన్ని నిరాకరించే సిద్ధాంతం ఏమంటే**

ఆనందాన్ని కలిగి ఉండడం మొదలైన గుణాలు జీవాత్మకు సంబంధం సంభవించవు కనుక, సకల చరాచరాలను శరీరంగా కలిగినవాడుగా వేదంలో చెప్పబడుతున్న పరమాత్మకు ఇటువంటి సకల శరీరత్వమనే శారీరత్వం చక్కగా సంభవిస్తుంది కనుక, నిరుపాధిక ఆనందశాలిగా అతడు కాగలడు. "ఆనందమయః" అనే ప్రయోగంలో ఉండే మయట్ ప్రత్యయానికి వికారం అర్థం కనుక, ఏ వికారం లేనివాడైన పరమాత్మకు ఆనంద వికారత్వం పొసగదు అనే వాదం కూడా అనుపపన్నం. మయట్ ప్రత్యయానికి వికారమే అర్థం అనే నిర్బంధం ఏమీ లేదు. "అన్నమయోయజ్ఞః "అని అంటే, అన్న వికారమైన యజ్ఞం అని అర్థం రాదు. ఇక్కడ మయట్ ప్రత్యయానికి ప్రాచుర్యం అని కదా అర్థం. ఆశ్చర్యమంటే ఎక్కువగా ఉండడం అన్నంతో నిండిన యజ్ఞం— అని ఇక్కడ ఈ ప్రయోగంలోని అర్థం. ఆ విధంగానే, ఇక్కడ కూడా ఆనందం నిండినవాడైన బహుళంగా ఉండేవాడైన పరమాత్మ —అనే అర్థం చెప్పడంలో లోటు లేదు, కనుక వికారవాదం అపాస్తం.

తరువాత, "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" అనే వాక్కుకు, మనసుకు అందని రీతిలో అప్రమేయమైన ఆనందం కలవాడుగా వేదంలో చెప్పబడిన పరమాత్మ విషయంలోనే కదా బహుళంగా ఆనందాన్ని కలిగి ఉండే స్వభావం చెప్పదగినది.

**ఆనంద ప్రాచుర్యం విషయంలో కలిగే సందేహం, దానికి సమాధానం**

దీనికి తరువాత ఒక వాదం ఇక్కడ ప్రసక్తమవుతున్నది. ఆనంద ప్రాచుర్యం అంటే– ఆనందం యొక్క ఆధిక్యమే. ఆనందం అధికమని అంటే, ఆనంద ప్రతికోటి అయిన దుఃఖం కొంచెం ఉన్నది– అని ఇక్కడ స్ఫురించి తీరుతుంది కదా. ( ఆధిక్యమనేది ప్రతియోగిని అపేక్షిస్తుంది కనుక, దేనికంటే అధికమని ప్రశ్న రాగా, దుఃఖం కంటే అధికమని చెప్పవలసి ఉన్నది కనుక, ఆనందమయుడని చెప్పబడిన పరమపురుషునిలో దుఃఖ సంబంధం అంగీకరించినదిగా అవుతుంది అని అర్థం) ఈ విధంగా అఖిల హేయ ప్రత్యనీక కళ్యాణైకతానుడని చెప్పబడే పరమాత్మ విషయంలో కొంచెం కూడా హేయసంబంధం సంభవించదు కనుక, ప్రచురానందశాలిత్వమని పరిష్కరింపబడిన ఆనందమయత్వం అక్కడ చెప్పడానికి లేదు– అనేది పూర్వపక్షం.

అయితే ఇది భ్రమ. ఆనంద ప్రాచుర్యాన్ని వివరించడానికి ఉద్యమించిన "సైషానందస్య మీమాంసా భవతి" ఇత్యాది ఆనందమీమాంసలో " తే యే శతం ప్రజాపతే రానందాః" అనే పర్యంతం ప్రస్తావింపబడిన చతుర్ముఖ పర్యంత సకల జీవుల ఆనందం కంటే నూరు రెట్లు అధికంగా ఉండడం– అనే ప్రాచుర్యమే ఆనందమయ శబ్దంతో వివక్షితంగా వివరించినందున, ప్రస్తుతమైన ఆనందమయుడైన ఆత్మలో ఆనందమయుడనే శబ్దంనుండి దుఃఖ సంబంధం ప్రసంగించే అవకాశం లేదు.

ఈ సందర్భంగా ప్రాసంగికంగా ఒక విషయం చెప్పవలసి ఉన్నది. పైన అనువదింపబడిన ఒక అక్షేపాన్ని పరిహరించడంలో, పరమ పురుషునకు స్వల్పమైన

దుఃఖసంబంధం కూడా లేదు— అని ఇక్కడ నిర్వహించి, ఆ పరమ పురుషుని దయ అనే గుణాన్ని నిరూపణం చేసేటప్పుడు, భగవంతుడు భక్తుల దుఃఖాన్ని అనుసంధించి, తాను కూడా దుఃఖాన్ని పొందడమే దయాళుత్వమని శ్రీ రామానుజులు అనుగ్రహించినట్లుగా కనబడుతున్నది. ఇది ఏ విధంగా పొసగుతుంది? భగవంతుని విషయంలో దుఃఖం ఉన్నది అని అంగీకరిస్తే ఆనందమయత్వం చెప్పడానికి అవకాశం లేకుండా కదా ఉంటుంది— అనే ఒక సందేహం ఇక్కడ కలుగవచ్చు. దీనికి పరిహారం తెలుసుకోవడం వేదాంతులకు ఇది చాలా ఆవశ్యకం. ఈ విధంగా ఒక సందేహం కలుగుతుంది అని భగవద్రామానులు తామే మనసులో భావించి, ఈ అధికరణ శ్రీభాష్యంలో కొన్ని పంక్తులను అనుగ్రహించారు. వాటిని అనువదించి చూపి, వాటి అర్థాన్ని, వివరించి, స్పష్టం చేస్తాము.

ఈ అధికరణం లో రెండవ సూత్రం "వికార శబ్దాత్ నేతి చేత్ న, ప్రాచుర్యాత్" అనేది. ఈ సూత్రంలోని శ్రీ భాష్యంలో " యదుక్తం ఆనందప్రాచుర్యమ. అల్పదుఃఖసంభావ్యమ్ అవగమయతీతి, తదసత్" అని ప్రారంభమైన శ్రీ సూక్తి లోని తాత్పర్యం ఏమిటంటే, పరబ్రహ్మ విషయంలో ఆనందం అధికంగా ఉన్నది అని చెప్పినందున, దుఃఖం కూడా కొంచెం ఉన్నదని చెప్పినట్లు అవుతుంది అనే వాదం తగదు. బ్రహ్మం యొక్క ఆనందం అపరిమితం అంటే, జీవుని ఆనందం పరిమితం అని ఇంత మాత్రమే ఏర్పడుతుంది తప్ప, బ్రహ్మ విషయంలో స్వల్ప దుఃఖం ఉన్నది అని చెప్పినట్లు ఏర్పడుతుందని చెప్పడానికి అవకాశం లేదు. దుఃఖం ఉన్నదో, లేదో, ఆ విషయం వేరు వేరు ప్రమాణంతో ఏర్పడవలసినదే తప్ప, ఆనంద ప్రాచుర్ర్యాన్ని తెలిపే ఆనందమయశబ్దంతో అది చెప్పబడదు. ఆనందానికి ప్రతికోటి అయిన వస్తువు బ్రహ్మవిషయంలో లేదు— అనే సంగతి "అపహతపాప్మా" అని మొదలైన ఒక వేదవాక్యంతో తెలుపబడుతున్నది. దానిని గూర్చి ఇక్కడ ఎందుకు? ఇక్కడ తెలియవలసిన విషయం ఇంత మాత్రమే. పరబ్రహ్మలో ఆనందం పర అంతు లేనిదైవున్నది —అని అంటే, ఇంకొకరి ఆనందం ఆ విధంగా కాకుండా అల్పంగా ఉన్నది—

అనేది ఇక్కడ స్పష్టమవుతుంది. అది ఆనందవల్లిలో స్పష్టంగానే తెలుపబడింది— అనేది ఆ సూక్తిలోని తాత్పర్యం.

ఇక్కడ శ్రీరామానుజులు "అపహతపాప్మా" అనే శ్రుతి వాక్యాన్ని ఉదాహరించారు. దాని అర్థాన్ని శ్రుతప్రకాశికాచార్య స్వామివారు చక్కగా వివరించారు. దానిని ఉపనిషద్భాష్యకారులైన రంగ రామానుజ స్వామి ఛాందోగ్యోపనిషత్తులో " అపహత పాప్మా విజరో విమృత్యుః విశోకః" అనే చోట తమ బాష్యంలో వివరించారు. అక్కడ వారు "పరమాత్మ ప్రకరణేషు" అని ఆరంభించి అనుగ్రహించిన పంక్తుల తాత్పర్య సారం ఏమంటే— పరమాత్మను అపహత పాప్మా అని చెప్పడంలో అభిప్రాయం ఏమంటే, అపాహత పాప్మా అని పరమాత్మను అనడంలో ఏమి తాత్పర్యం అంటే, పాపం చేయనివాడు అని అర్థం కాదు. పాపం చేసినా కూడా దాని ఫలంగా హేయ సంస్పర్శను పొందనివాడు— అని అర్థం. పాపాన్ని ఇక్కడ చెప్పడం పుణ్యాన్ని కూడా చెప్పినట్లే అవుతుంది. భగవంతుడు పుణ్య పాపాలను చేసినప్పటికీ కూడా వాటి ఫలాల సంబంధం పొందని వాడు అనేదే ఇక్కడ వివక్షితం. పాపాన్ని చేస్తే దాని ఫలం సంబంధించకుండా ఏ విధంగా ఉంటుంది? అని ప్రశ్నించనక్కరలేదు. అదే భగవంతుని విలక్షణమైన ఒక స్వభావం. మన వంటి వారికి పాపం చేస్తే హేయస్పర్శ కలిగి తీరుతుంది. భగవంతుడు అయితే ఆ విధంగా కాదు. మనం చేసే కర్మలవంటి కర్మలను భగవంతుడు చేయడం కనిపిస్తుంది. ఆ విధంగా చేసినప్పటికీ కూడా, వాటి వల్ల అతనికి ఏ స్పర్శ కలుగనే కలుగదు. కారణమైన కర్మ ఉంటే, కార్యమైన హేయ స్పర్శ లేకుండా పోతుందా? అని సందేహపడకూడదు. అదే భగవంతుని విలక్షణమైన స్వభావం— అని శ్రీరంగ రామానుజ స్వామివారు వివరించారు> ఇది అంతా శ్రీరంగ రామానుజ స్వామి వారి వివరణం. ఈ విషయానికి అంతరధికరణ శ్రుతప్రకాశికను సంవాదంగా ప్రస్తావించారు, వారు. "అపహత పాప్మా "అనేది ఏ వాక్యంలో ఉన్నదో, అదే వాక్యంలోనే "విశోకః" అనేది కూడా ఉన్నది. అక్కడ కూడా ఇదే న్యాయంలోనే అర్థం చెప్పాలి. శోకం కలిగినా, దానివల్ల హేయసంబంధం పొందనివాడు— అని అర్థం. హేయగుణమైన శోకం కాకుండా, కళ్యాణ

గుణాలలో గొప్పదైన శోకాన్ని కలవాడు, భగవానుడు– అని చెప్పినట్లు స్పష్టమవుతుంది. ఏ విధంగా అయితే ఏమి? శోకం ఉన్నదని ఒప్పుకున్నట్లయితే, అది ఆనందమయత్వానికి లోటుగా ఉంటుందికదా అనే ఈ వాదాన్ని కొందరు చేయవచ్చుగాక! వారు ఇంతకుముందు ప్రసాదించు చూపించిన ఉపనిషత్ భాష్యపంక్తులలో "ఈశ్వరేణ కృతాని పుణ్య పాపసజాతీయాని కర్మాణి", కృతేపి పాపే" అనే ఉండే శ్రీ సూక్తులపైన నిరంతరంగా శంకలను చేస్తూ ఉండవచ్చు, అంతే. దీనినిగూర్చి వివరం ఇక్కడ ఇంత మాత్రమే చాలు అని నిలిపి వేస్తున్నాము. ఇక ప్రకృతంలో ప్రస్తుతమైన విషయాన్ని చూద్దాం.

"సత్యం జ్ఞానమ్ అనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్, సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి" అని పూర్వం వస్తావించిన వాక్యంలో జీవాత్మ బ్రహ్మను ఉపాసించి, ఆ బ్రహ్మను పొందుతున్నట్లు చెప్పినందున, జీవాత్మ ప్రాప్త అని, పరమాత్మ ప్రాప్యం అని, ఈ విధంగా భేదం సూచింపబడుతున్నది. దీనికి పైన ఒక విషయాన్ని చెప్పవచ్చు. బలద్ధావస్థలో ఉండే జీవుడు ప్రాప్త అవుతున్నాడు, ముక్తావస్తలో ఉండే అతడే ప్రాప్యం అవుతున్నాడు –అని చెప్పడంలో అడ్డు లేదు. కనుక జీవాత్మ అనే ఒక్కనికే అవస్థా బేధంతో ప్రాప్తృత్వం, ప్రాప్యత్వం అనే రెండు అవస్థలు కూడుతాయి కనుక, జీవాత్మ పరమాత్మలకు దీనివల్ల భేదం సిద్ధించే అవకాశం లేదు– అని ఇక్కడ ఒక సందేహాన్ని చెప్పవచ్చు. ఇది కూడా తగినది కాదు. "బ్రహ్మణా విపశ్చితా" అని ప్రాప్యమైన బ్రహ్మకు నిరుపాధికమైన విపశ్చిత్త్వం, అంటే, సర్వజ్ఞత్వం చెప్పబడి ఉన్నది. అది జీవాత్మకు ముక్తావస్థలో సంభవించదు. "విపశ్చితాబ్రహ్మణా" అని చెప్పబడ్డ విపశ్చిత్వం అనేది "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" అని తరువాత చెప్పబడే జగత్ సృష్టికి ఉపయుక్తమైన సర్వజ్ఞత్వం కదా.

ముండకోపనిషత్తులో " యః సర్వజ్ఞః సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః తస్మాదేతత్ బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే" అని పరబ్రహ్మపు జగత్ సృష్టికి

కావలసిన సర్వజ్ఞత్వాన్ని చెప్పి, వెంటనే సృష్టికర్తృత్వాన్ని చెప్పినట్లే, ఇక్కడ కూడా, తరువాత చెప్పబడబోయే జగ సృష్టికి ఉపయుక్తమైన సర్వజ్ఞత్వాన్ని ముందుగానే చెప్పి, వెంటనే సృష్టి కర్తృత్వం చెబుతున్నట్టుగా తెలుస్తున్నది. ఇందువల్ల ఇక్కడ విపశ్చిత్ శబ్దంతో చెప్పబడే సర్వజ్ఞ్వానికి ఉపాధి ఏమీ చెప్పబడనందున, నిరుపాధికమైన సర్వజ్ఞత్వమే చెప్పినట్లుగా స్పష్టపడుతున్నది. ఇటువంటి నిరుపాధికమైన సర్వజ్ఞత్వం ముక్తావసథలో కూడా జీవులకు సంభవించదు కనుక, ప్రాప్యంగా చెప్పబడే బ్రహ్మం బద్ధావస్థలోను, ముక్తావస్థలోనూ ఉండే జీవుని కంటే విలక్షణమైనదని నిశ్చయింపబడుతున్నది. అందుచేత నిరుపాధిక సర్వజ్ఞత్వాన్ని కల బ్రహ్మకే "తస్మాద్వా ఏతస్మాదాత్మనః" అనే వాక్యంలో చెప్పిన స్థూలారుంధతీ న్యాయానుసారంగా ఆ ఆత్మ "అన్యోంతరాత్మా ఆనందమయః" అని ఉపాసింపబడుతున్నట్లుగా వ్యక్తమవుతున్నది. ఇందువల్ల ఈ ఆనందమయాత్మ జీవుడు కాదు– అని చక్కగా తెలుస్తున్నది.

**శ్రీభాష్యసారామృతంలో ఆనందమయాధికరణం ముగిసింది**

## 7) అంతరధికరణం

ఇంతకుముందు ఆనందమయాధికరణంలో ఆనందమయుడు పరమ పురుషుడే అని నిష్కర్షింపబడినా, ఆనందమయుడైన పురుషుడు జీవుడై ఉండవచ్చు –అని ఒక ప్రకారంగా సందేహం కలుగగా, దానిని తీర్చడం కోసం ఈ అధికరణం అవతరించింది.

**అంతః తద్ధర్మోపదేశాత్**–(1–1–21)

ఇక్కడ "భేదవ్యపదేశాచ్చాన్యః" అనే పై సూత్రంలో నుండి "అన్యః" అనే పదాన్ని తెచ్చుకుని అన్వయించుకోవాలి.

అంతః —ఆదిత్య మండలంలో ఉండే పురుషుడు, అన్యః— జీవుని కంటే వేరైన పరమ పురుషుడు, ధర్మోపదేశాత్— ఆ పరమ పురుషునకే అసాధారణాలుగా ఉండదగిన ధర్మాలను ఇక్కడ చెప్పినందున— అని సూత్రంలోని అర్థం.

ఛాందోగ్యోపనిషత్తులో " య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" అని ఆరంభమవుతున్న భాగానికి అంతరాదిత్య విద్య అని పేరు. ఆ విద్యాప్రకారణంలో "హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య కప్యాసం పుండరీకమేవ మక్షిణీ, తస్య ఉదితి నామ, య ఏష సర్వేభ్య పాప్మభ్యః ఉదితః ఉదితి హ వై సర్వేభ్యః ఆత్మభ్యో య ఏవం వేద. అని అధ్యయనం చేయబడుతున్నది ఇక్కడ ఆదిత్య మండలంలో ఉండే పురుషునకు "యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" అని అన్నందున ఎర్ర తామర వంటి కన్నులను కలిగి ఉండడాన్ని చెప్పినందువల్ల, అపహత పాప్మత్వంలో పర్యవసించే సర్వపాప్మోదితత్వం చెప్పినందువల్ల సర్వపాప వినిర్ముక్తత్వం అనే మోక్షపురుషార్థ ప్రాప్తికి ఉపాయమైన ఉపాసనకు విషయమైన వస్తువు అని చెప్పినందువల్ల, అపహత పాప్మత్వం అనే లింగం ద్వారా " ఏష సర్వభూతంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అని సుబాలోపనిషత్తులో అపహత పాప్మగా చెప్పబడే నారాయణుని స్మరింపజేస్తునందున, మోక్షానికి ఉపాయమైన ఉపాసనకు విషయంగా చెప్పిన కారణంచేత "తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి" అని పురుష సూక్తంలో చెప్పబడిన మహాపురుషుని స్మరింపజేస్తున్నందున పుండరీకాక్షత్వం నారాయణుని విషయంలోనే సుప్రసిద్ధం కనుక, ఇందువల్ల ఏతావత్పర్యంతం చెప్పబడిన ఉపపత్తులలతో ఆదిత్య మండలంలో నివసించే పురుషుడు పరమ పురుషుడే అని నిర్ణయింపబడుతున్నది.

## ఈ సందర్భంలో ఒక పూర్వపక్షం ఈ విధంగా చేయబడుతున్నది

ఇంతకుముందు ఆనందమయాధికరణంలో " తస్యైష శారీర ఆత్మా " అని ఆనందమయుడైన ఆత్మకు శరీర సంబంధం చెప్పబడినందువల్ల ఆ ఆనందమయుడు

జీవుడై ఉండాలి— అనే పూర్వపక్షం వచ్చినప్పుడు, నిరుపాధికమైన ఆనందాన్ని కలవాడు అని మొదలైన హేతువుల ద్వారా జీవుని కంటే అతడు వేరుపడిన ఏవాడే అని సాధింపబడింది. అయితే, ఆ విధంగా అనడం పొసగదు, ఎందుకంటే, అక్కడ ఆ ఆనందమయునకు"స య శ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే స ఏకః" అని ఆదిత్యుడనే దేవతా విశేషంతో ఐక్యం చెప్పబడినందున ఆదిత్య దేవతా విశేషానికి అంతరాదిత్యవిద్యలో కేశాలు, మీసాలు, నఖాలు, కన్నులు మొదలైన వానితో కూడిన చాలా అందమైన శరీరం కలిగి ఉండడం చెప్పబడినందున, ఆ శరీరం అనేది చాలా పుణ్య విశేషంతోనే ఏర్పడినది అనే విషయం అక్కడే సర్వపాపరాహిత్యం చెప్పబడినందున సిద్ధిస్తున్నది. కనుక అటువంటి శరీర సంబంధమే ఆనందవల్లిలో శారీర శబ్దంతో గ్రహించడం ఉచితం. కనుక, అటువంటి శరీరం కలిగి ఉండడం అకర్మ వశ్యుడని అభిమానింపబడే పరబ్రహ్మ విషయంలోనే సంభవించదు కనుక, ఆదిత్యుడనే ఒక జీవుడే చాలా గొప్ప పుణ్య విశేషం చేత ఐశ్వర్య విశేషాన్ని కలవాడై, జగత్కారణభూతుడుగా ఆనందవల్లిలో ప్రతిపాదింపబడుతున్నాడు— అనేది పూర్వపక్షం.

**దీనిని నిరాకరించే సిద్ధాంతం ఏమంటే,**

ఇక్కడ ఆదిత్య మండలం లోపల ఉండే పురుషునకు చాలా పుణ్య విశేషం కారణంగా ఏర్పడే శరీర విశేష సంబంధం చెప్పబడడం లేదు. ఎందుకంటే, దహర విద్యాప్రకరణంలో "న సుకృతం న దుష్కృతం సర్వే పాప్మానోతో నివర్తంతే అపహతపాప్మా హ్యేష బ్రహ్మలోకః" అనే చోట చెప్పబడిన అర్థమే ఇక్కడ అంతరాదిత్య విద్యలో "స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః" అని అనడం ద్వారా స్మరింపజేయబడినందున, సుకృతం, దుస్కృతం అనే రెండు విధాలైన కర్మలు పూర్తిగా లేని ఒక వ్యక్తి ఆదిత్య మండలం లోపల ఉన్న వాడుగా స్పష్టంగా తెలుస్తుంది. అందుచేత ఇక్కడ ఉద్దేశింపబడే శరీరం చాలా పుణ్యవశం చేత సిద్ధించినది— అని చెప్పడం ఎంత మాత్రం పొసగదు. మరి ఇక ఏమి? అని అంటే, "ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" అని

మొదలైన వేదవాక్యాలలో ప్రసిద్ధమై, స్వేచ్ఛతో పరిగ్రహింపబడినదై, అప్రాకృతమైనది అయిన శరీరమే.

కర్మవశ్యునకే శరీరం కలిగి ఉండడం ఘటిస్తుందని, అకర్మవశ్యునకు శరీరం కలిగి ఉండడం ఘటించదు అని చెప్పలేము భగవంతుడు అకర్మవశ్యుడై ఉన్నప్పటికీ కూడా, సత్యసంకల్పుడైన తన ఇచ్ఛద్వారా శరీర పరిగ్రహం చేయడంలో ఏ కొరత లేదు.

దీనిపైన, ఇంకా ఈ విధంగా చెప్పవచ్చు. త్రిగుణాత్మక ప్రకృతి పరిణామరూపమైన భూతసంఘాతం కదా, శరీరం అంటే. అపహతపాప్మయై, సత్య సంకల్పుడై ఉండే పరమ పురుషుడు కోరితే కూడా ఆ శరీరం సంబంధం కూడదు కదా, ఎందుకంటే, హేయం కనుక. కర్మవశ్యుడై పురుషునకు అయితే, అతని కర్మకు అనుగుణంగా ఫలాలను అనుభవించవలసి ఉన్నందున, శరీర సంబంధాన్ని వెరచి, వద్దనుకున్నా, దానిని పొందక తప్పదు. అది కలిగి తీరుతుంది. కర్మవశ్యుడు అని అంగీకరింపబడే పరమ పురుషునకు ఏ విధంగానూ శరీర సంబంధం అనేది యోగ్యం కాదు— అని ఇక్కడ ఒక చోద్యాన్ని చేయవచ్చు.

భగవంతునికి గుణత్రయాత్మకమైన, ప్రాకృతమైన దేహం ఉన్నదని ఎవరైనా చెప్పినట్లయితే, ఇంతకు ముందు పలికిన ఆక్షేపం చేయవచ్చు. స్వాభిమతం, స్వానురూపం అయిన శరీరం భగవంతునకు ఉన్నదని అంగీకరింపబడుతున్నది తప్ప, గుణత్రయాత్మకమై, ప్రాకృతమైన దేహం ఉన్నదని అంగీకరింపబడడం లేదు. వేదాంతాలు భగవంతునకు ప్రాకృతదేహ గుణాలను, ప్రాకృత హేయదేహ సంబంధాన్ని, దాని మూలంగా కలిగడానికి అవకాశం ఉండే కర్మవశ్యత్వ సంబంధాన్ని నిషేధించి, కల్యాణ గుణాలు, కళ్యాణ రూపం ఆ స్వామికి ఉన్నవని తెలుపుతున్నాయి. భగవంతుడు ఉపాసకుల విషయంలో ఉండే మిక్కిలి అనుగ్రహం చేత, వారి ప్రతిపత్తికి తగినట్లుగా తన జ్యోతిర్మయమైన శరీరాన్ని స్వేచ్ఛతోనే దేవ మనుష్యాదిసంస్థానంగా రూపొందించుకుంటున్నాడు అని ఉపనిషత్తులు తెలుపుతున్నాయి. "అజాయమానో

బహుధా విజాయతే"అని వేదం, అజోపి సన్ అవ్యయాత్మా భూతానా మీశ్వరోపి సన్, ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా " అనే భగవద్గీతా వచనాన్ని ఇక్కడ అనుసంధించుకోవాలి. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అనే గీతాశ్లోకాన్ని కూడా విశేషించి అనుసంధించుకోవాలి.

ఈ సందర్భంలో ఉభయ వేదాంతరసికులకు ఒక గొప్ప విషయాన్ని స్మరింప జేయవలసినది ఉన్నది. స్వామి భగవద్రామానుజులు శ్రీభాష్యం అనుగ్రహించేటప్పుడు ఆళ్వారుల దివ్య సూక్తులను నిరంతరం మనసులో చింతిస్తూ ఉన్నారు– అని పెద్దలు వచిస్తారు. అది ఉభయ వేదాంతలలో గంభీరమైన జ్ఞానం పొందిన మహానుభావులకే తెలియడానికి సాధ్యం. దానికి సాక్షిగా ఉదాహరించగలిగిన సందర్భాలు చాలా ఉన్నాయి. ప్రస్తుతం ఈ సూత్రంలోని భాష్యంలో ఉండే అరుదైన గొప్ప విషయం ఒకటి ఇక్కడ నిరూపింపబడుతున్నది. ఈ సందర్భంలో పరమ పురుషునకు శరీర సంబంధం లేదు అని పూర్వపక్షంలో ప్రసక్తం కావడాన్ని గమనించిన శ్రీరామానుజులు దానిని ఖండించేటప్పుడు, శ్రీ రామకృష్ణాది విభవావతారాలలో శరీర పరిగ్రహం భగవంతుడు చేసిన రీతిని నిరూపించే క్రమంలో "పరిత్రాణాయ సాధునాం వినాశాయ చ దుష్కృతామ్" అనే గీతా సూక్తిని ఉదాహరించి, " సాధుపరిత్రాణమేవ ఉద్దేశ్యమ్, అనుషంగికస్తు దుష్కృద్వినాశః సంకల్పమాత్రేణాపి తదుపపత్తేః" అని అక్కడ ఉండే శ్రీభాష్య సూక్తి శైలి. భగవంతుడు అవతరించడం సాధువులను రక్షించడం కోసం, దుష్టులను నిరసించడం కోసం అయినప్పటికీ, సాధువులను సంరక్షించడం అనేది ఉద్దేశ్యం, దుష్టులను నిరసించడం అనేది సంకల్ప మాత్రంతోనే సంభవించే అవకాశం ఉన్నందున అది ఆనుసంగికమే తప్ప, ప్రధానం కాదు– అనేది ఇక్కడ ఉదాహరించి చూపిన శీభాష్య సూక్తుల తాత్పర్యం. దుష్టులను నిరసించడం సంకల్ప సాధ్యం అయినట్లే, సాధపరిత్రాణం కూడా సంకల్ప సాధ్యం కాదా? "దుష్టులు నశించిపోవాలి "అని సంకల్పించేటట్లే, " మహాత్ములు సంరక్షింపబడాలి" అని భగవంతుడు సంకల్పించడం సాధ్యమే కదా! మరి,

ఆ విధంగా ఉండగా, దుష్టశిక్షణమే సంకల్పంతో సాధ్యమని, శిష్టపరిత్రాణం సంకల్ప సాధ్యం కాదని శ్రీ భాష్యకారులు దేనిని ఆధారంగా చేసుకుని పలికారు? అని గమనించి చూసినప్పుడు, నమ్మాళ్వారుల సుస్పష్టమైన శ్రీసూక్తిని ఆధారంగా చేసుకొనే ఈ విధంగా పలికారు— అని స్పష్టపడుతున్నది. దీనిని వివరిస్తాను.

తిరువాయ్ మొழி ప్రబంధంలో (3—1—9) " మழுజ్ఞాద వైన్నుదియ శక్కర నల్ వలత్తైయాయ్! తొழுజ్ఞాదల్ కళిఱుళిప్పాన్ పుళ్ళూర్ న్దు తోన్డినైయే, మழுజ్ఞాద ఞానమే పడైయాక మలరులకిల్ తొழுమ్ పాయార్ క్కు అళిత్తాల్ ఉన్ తోల్ పుకழ் మాశూణాదో! " అనే పాశురం పరమ భోగ్యమైనది. భగవంతుడు గజేంద్రుని ఆర్తనాదాన్ని విని, చాలా సంభ్రమంతో తన నడుము బట్ట జారగా, జుట్టుముడి వీడగా, మడుగు తీరానికి వేగంగా వచ్చి చేరిన ఐతిహ్యం సుప్రసిద్ధం. ఎందుకోసం అతడు ఆ విధంగా వేగంగా పరిగెత్తుకొని రావాలి?"కరుదుమిడమ్ పొరుదు పునల్" అని అన్నట్లు తన మనసులోని అభిప్రాయాన్ని తెలుసుకొని దానికి అనుగుణంగా కార్యాన్ని సాధించగలిగిన ఈ సుదర్శనం చేతిలోనే ఉన్నదే! దానిని పరమపదం నుండే ప్రయోగిస్తే, అతడు ఒక క్షణంలో గజేంద్రుని ఆర్తిని తీర్చి రక్షించలేడా? వాస్తవానికి అంత శ్రమ కూడా సుదర్శనానికి ఇవ్వవలసి ఉన్నదా? సకల జగత్ సృష్టి స్థితి సంహారాలకు సాధనమైన సంకల్పంతోనే గజేంద్రుని ఆర్తిని అవలీలగా తీర్చి ఉండవచ్చును కదా! ఈ రెండు రీతులలో కాకుండా, మిక్కిలి తత్తర పాటులో పరిగెత్తుకొని వచ్చినది ఎందుకోసం ? అని ఇక్కడ నమ్మాడు వాళ్లు ప్రశ్నిస్తున్నారు ప్రశ్నించడమే కాదు దానికి తగిన సమాధానాన్ని కూడా ఆమె పలుకుతున్నారు" తొழுజ్ఞాదల్ కళిఱుళిప్పాన్ పుళ్ళూర్ న్దు తోన్డినైయే" అనే సూక్తియే నమ్మాళ్వారులు పలికిన సమాధానం. గజేంద్రుడు తనకు ఎదురుగా వచ్చిన పరమాత్మను చూసి "నాహం కలేవరస్యాస్య త్రాణార్థం మధుసూదన! , కరస్త కమలాన్యేవ పాదయో రర్పితుం తవ" అని అన్నాడు. ( ఈ లోకంలో ఎవడైనా ఏనాడో ఒకనాడు నశించి పోవలసినదే. ఈ శరీరం కోసం నేను బాధపడడం లేదు. స్వామీ! , నిన్ను సేవించి నీ బంగారు నీ చరణాలలో ఈ తామర పువ్వును సమర్పించడం కోసమే బాధపడ్డాను.

ఇంతటి ఆర్తిని పొందాను) ఇటువంటి ఆర్తిని కలిగిన భక్త శిరోమనణుల ఆశను సంకల్పంతో తీర్చడం సాధ్యం కాదనే విషయాన్ని ఈ పాశురంలోని ఉత్తరార్ధంలో నమ్మాళ్వార్లు స్వయంగా వివరించారు. నేరుగా అవతరించి తన దివ్య మంగళ విగ్రహ దర్శనాన్ని అనుగ్రహించి భక్తులను రక్షించాలి—అని ఆళ్వారులు అనుగ్రహించిన అర్ధాన్ని ఇక్కడ శ్రీరామానుజులు ప్రాణంగా భావించి దానిని పలికారు.

ఇంకే కాక ఆదిత్య మండలం మధ్యలో వేంచేసి ఉండే పురుషుని గూర్చి అంతర్యామి బ్రాహ్మణంలో చెప్పేటప్పుడు " య ఆదిత్యే తిష్ఠన్ యస్య ఆదిత్యం శరీరం, య ఆదిత్యాంతరో యమయతి ", " యః సర్వేషు దేవేషు తిష్ఠన్" అని చెప్పబడింది. అదిత్యుడనే దేవతా విశేషాన్ని చతుర్ముఖ బ్రహ్మ మొదలైన సకల దేవతలను నియమించేవాడుగాఆ పురుషుని చెప్పినందున, వారి కంటే వైలక్ష్యణ్యం స్పష్టంగా తెలుస్తున్నది కనుక, ఆదిత్య మండలంలో ఉండే పురుషుడు ప్రసిద్ధుడైన ఆదిత్యునిగానో, చతుర్ముఖునిగానో, ఇంద్రునిగానో, గొప్ప పుణ్యవిశేషం చేత ఐశ్వర్య విశేషాన్ని పొందిన వేరు ఒక జీవునిగానో ఉండే అవకాశం లేదు అనేది స్పష్టమవుతున్నది.

**శ్రీభాష్య సారామృతంలో అంతరధికరణం ముగిసింది**

## 8)ఆకాశాధికరణం

ఇంతకు ముందు అధికరణలో జగత్కారణం అయిన వస్తువు సకల చేతనా చేతన విలక్షణం అని ఆయా లింగ విశేషాలతో నిర్ణయింపబడింది. అది అసంగతమని ఒక ఆక్షేపం తోచగా, దానిని పరిహరించడం కోసం ఈ అధికరణం ప్రస్తుతమైనది.

**ఆకాశః తల్లింగాత్** (1—1—23)

"భేద వ్యపదేశాచ్చాన్యః" అనే సూత్రం నుండి అన్యహా అనే పదం తెచ్చి అన్వయించుకోవాలి. ఛాందోగ్యోపనిషత్తులో "సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశా దేవ సముత్పద్యంతే " అనే చోట ఆకాశ శబ్దం చేత చెప్పబడేవాడు అన్యః—భూతాకాశంకంటే వేరైనవాడు, ఎందుకంటే, తల్లిగాత్— భూతాకాశం కంటే

భిన్నుడైన పరమాత్మకు అసాధారణమైన లింగం అందులో ఉన్నదని చెప్పబడుతున్నందున —అనేది ఈ సూత్రంలోని అర్థం.

చాందోగ్య ఉపనిషత్తులో "సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశా దేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తం యంతి ఆకాశో హ్యేవ జ్యాయాన్, ఆకాశః పరాయణమ్" అనే ఈ వాక్యంతో అక్కడ ఉండే ఆకాశశబ్దంచేత చెప్పబడే వస్తువుకు సర్వభూతోత్పత్తి కారణత్వం, సర్వ భూతలయ కారణత్వం, సర్వస్మాత్ జ్యేష్ఠత్వం, పరాయణత్వం మొదలైన ధర్మాలు చెప్పబడుతున్నాయి. ఇందులో, అన్నిటికంటే జ్యేష్ఠత్వం అనేది— గుణాలలోనూ, స్వరూపంలోనూ ఉత్కృష్టమై ఉండడం. పరాయణత్వం అనేది— చేతనులకు ప్రాప్య ప్రాపకం గా ఉండడం. ఇటువంటి స్వభావాలు పరమాత్మ కే సంభవించడానికి అవకాశం ఉన్నవి. భూతాకాశానికి సంభవించవు. సర్వభూతాల యొక్క ఉత్పత్తికి, లయానికి కారణమై ఉండడం, గుణాలతోనూ స్వరూపంతోను సర్వభూతాల కంటే శ్రేష్ఠమై ఉండడం— అనే ఇవి భూతాకాశానికి సంభవించవు కదా! అచేతమై హేయమై ఉందే అది, చేతనులకు పరమప్రాప్యం కావడానికి ఎంత మాత్రం ప్రసక్తి లేనే లేదు కదా!

పరమాత్మకు అయితే, ఈ స్వభావాలు అన్ని చక్కగా సంభవించడానికి అవకాశం ఉన్నది. నారాయణోపనిషత్తులో నారాయణాత్ బ్రహ్మ జాయతే" అనే మొదలైన వాక్యాలతో నారాయణునకు సర్వభూతాల ఉత్పత్తికి గూర్చి, లయాన్ని గూర్చి కారణత్వం చెప్పబడుతున్నది. " విశ్వత పరమనిత్యం విశ్వం నారాయణం హరిమ్" అని మొదలైన వాక్యాలలో "విశ్వతః పరమం" అని అన్నందున అన్నిటికంటే, అన్ని విధాలుగాను గొప్పతనం చెప్పబడింది. "నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్" అని మొదలైన వాక్యాలతో "పరాయణం" అని అన్నందున చేతన చేతనాలకు పరమ ప్రాప్యంగా ఉండడం ఆ స్వామికే చెప్పబడింది. అందువల్ల " సర్వాణి హవై" అని మొదలైన శ్రుతిలో ఆకాశ శబ్దంచేత చెప్పబడే వస్తువు పరమ పురుషుడే అని స్పష్టపడుతున్నది.

**ఇక్కడ మళ్ళీ ఇంకొక పూర్వపక్షం**

జగత్కారణ వస్తువు అయిన బ్రహ్మం అచేతనం కంటే విలక్షణమైనది అనే విషయం ఈక్షణం మొదలైన లింగాల ద్వారా సిద్ధిస్తున్నదని చెప్పడం తగదు. " యతో వా ఇమాని భూతాని జాయంతే" అని మొదలైన వాక్యాలతో బ్రహ్మ యొక్క లక్షణం చెప్పబడినప్పుడు, " దేనినుండి ఈ భూతాలు ఉత్పత్తి అవుతున్నాయి?" అని జిజ్ఞాస కలుగగా, ఏదైనా ఒక లింగంతో విశేష నిర్ణయం చేయడానికి ముందే, అవిలంబిత ప్రతీతి జనకమై, ప్రబలశ్రుతి అయిన ఆకాశ శ్రుతి చేత భూతాకాశమనే విశేషం జగత్కారణంగా ఉపస్థితం అయినందున, భూతాల ఉత్పత్తికి కారణమైన వస్తువును లింగంతో నిర్ణయించ వలసిన ప్రసక్తియే లేదు. భూతాకాశమే కారణ వస్తువు అని శ్రుతిలో నిశ్చయించగానే, అందులో ఈక్షణం మొదలైనవి సంభవించవు అని తోస్తే, వాటిని అముఖ్యంగా అన్వయించుకోవచ్చు. అందుచేత శ్రుతిని విడచి, లింగంతో సాధించడం తగినది కాదు —అనేది ఇక్కడ పూర్వపక్షం.

**దీనిని నిరసిస్తూ పలికిన సిద్ధాంతం ఈ విధంగా ఉన్నది.**

శ్రుతి కంటే లింగం దుర్బలమని, లింగం కంటే శ్రుతి ప్రబలమని ఉన్నప్పటికీ, కొన్ని చోట్ల శ్రుతి కంటే లింగానికి ప్రాబల్యం ఏర్పడడం అనేది ఉన్నది. ఏ విధంగా?అంటే, " గంగాయాం ఘోషః" ( గంగలో గొల్లపల్లె ) అని అంటే, గంగా అనే పదానికి ముఖ్యమైన అర్థం— గంగాప్రవాహమ్. అందులో గొల్లపల్లి ఉండడం ఇక్కడ చెప్పబడింది. ఇది ప్రత్యక్ష ప్రమాణానికి విరుద్ధం కనుక, అన్వయించదు అనే కారణంచేత, గంగాపదస్య గంగాతీరే లక్షణా" అని లక్ష్యార్థం గ్రహించవలసి ఉన్నందున, అయోగ్యార్థమైన శ్రుతి కంటే, అబాధితమైన ప్రమాణంతో తెలియబడిన లింగానికి ప్రాబల్యం చెప్పవలసి ఉన్నది కదా. ఇక్కడ ఆకాశ పదానికి ముఖ్యార్థమైన పరమ ప్రాప్యత్వం మొదలైనవాటికి అన్వయం పొసగదు కనుక, ఆకాశ శ్రుతిలో చెప్పబడిన ప్రాప్యత్వం ఉపయోగం లేనిదే అవుతుంది. అందుచేత, ఇంతకుముందు వివరింపబడిన యోగ్యార్థశ్రుతి మూలకమైన లింగంలోని

అన్వయోపపత్తికోసం ఆకాశ శబ్దాన్ని "ఆ, సమంతాత్ కాశతే ప్రకాశతే" అనే ఉత్పత్తితో నారాయణుడు అనే పరబ్రహ్మను చెబుతున్నట్లుగానే గ్రహించాలి.

**శ్రీ భాష్య సారామృతంలో ఆకాశాధికరణం ముగిసింది**

## 9)ప్రాణాధికరణం

ఇంతకుముందు అధికరణంలో ఆకాశానికి కారణత్వం నిరాకరింపబడింది. ఈ అధికరణంలో వాయువుకు కారణత్వం ఉన్నదని శంకించి, లేదని పరిహరింపబడుతున్నది.

**అత ఏవ ప్రాణః –(1–1–24)**

ఇంతకుముందు సూత్రంలో వలెనే ఈ సూత్రంలో కూడా "అన్యః" అనే పదాన్ని తెచ్చుకొని అన్వయించుకోవాలి. అత ఏవ– ప్రసిద్ధంవలె నిర్దేశించినందుననే, ప్రాణః –శ్రుతిలో ఉండే ప్రాణ శబ్దంచేత చెప్పబడేవాడు, అన్యః– ప్రాణవాయువు కంటే విలక్షణుడైనవాడే– అనేది సూత్రంలోని అర్థం.

ఛాందోగ్యోపరిషత్తులో "సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశంతి, ప్రాణంమేవ అభ్యుజ్జిహతే, సైసా దేవతా ప్రస్తావ మన్వాయత్తా" అనే ఒక వాక్యం ఉన్నది. ఇమాని సర్వాణి భూతాని –ఈ సకల ప్రాణులు, ప్రాణమేవ అభిసంవిశంతి– ప్రాణంలోనే లయాన్ని పొందుతున్నాయి, ప్రాణంమేవ అభ్యుజ్జిహతే– ప్రాణంలోనే నిలచి బయటకు వస్తున్నాయి– అని అర్థం, ఈ విధంగా చెప్పే చోట "హ వై " అని అన్నందున ఈ అర్థం ప్రసిద్ధమని చూపబడింది. ఆ ప్రసిద్ధి ఎటువంటిదో మనం తెలుసుకోవాలంటే, "నారాయణాత్ బ్రహ్మ జాయతే"అనే శ్రుతి వాక్యంవల్లనే తెలిసికోవాలి. ఆ వేదవాక్యంలో అన్ని భూతాలు నారాయణుని నుండే ఉత్పత్తిని పొందుతున్నాయని, నారాయణునిలోనే లయాన్ని పొందుతున్నాయని చెప్పబడినందున, ఆ విధంగా మనం తెలుసుకోవాలి. అందుచే, ఈ రీతిలో నారాయణుడే ప్రాణశబ్దార్థమని

నిశ్చయింపబడినప్పుడు, ప్రాణపదానికి ప్రాణవాయుపరత్వం శంకించే అవకాశం లేదు. ప్రాణపదం పరబ్రహ్మపరంగా ఏ విధంగా అవుతుంది? అంటే, "ప్రాణయతి జీవయతి" అనే ఉత్పత్తి చేత –అని తెలియాలి.

**ఇక్కడ ఒక పూర్వపక్షం**

ముందు అధికరణంలో నిరూపించిన విధంగా ఆకాశశ్రుతిని అయోగ్యార్థమని గ్రహించినప్పటికీ, ప్రాణశ్రుతిని ఆ విధంగా గ్రహించడం వీలు కాదు, ఎందుకంటే, సర్వభూతాల యొక్క ఉత్పత్తి, స్థితులం ప్రాణాధీనంగానే కనిపిస్తున్నాయి కదా. అందుచేత ప్రాణానికి కారణత్వాన్ని తెలిపే శ్రుతి అనేది అయోగ్యార్థకం కాకుండా, యోగ్యార్థకంగానే అవుతుంది. కనుక ప్రాణవాయువే జగత్కారణం అనేది ఇక్కడ పూర్వపక్షం.

**ఇక, ఇక్కడ సిద్ధాంత వాదం ఏమంటే**

"సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశంతి" అని మొదలయే స్తుతి వాక్యం ముఖ్య ప్రాణవిషయం అయితే, చేతనస్వరూప సిద్ధికూడా ప్రాణాధీనమై వస్తుంది. వస్తుస్థితి ఆ విధంగా లేనందువల్ల, ఆకాశశ్రుతివలె ఈ ప్రాణశ్రుతి కూడా యోగ్యార్థకం కాకుండా, అయోగ్యార్థకమే అవుతుంది అందుచేత పరమాత్మ పరంగానే ఈ శ్రుతి గ్రహించదగినది.

**శ్రీ భాష్యసారామృతంలో ప్రాణాధికరణం ముగిసింది**

## 10)జ్యోతిరధికరణం

ఆకాశాధికరణంలో భూతాకాశం కారణమని చెప్పబడిన పూర్వపక్షం నిరసింపబడింది. తరువాత, "ఆకాశాత్ వాయుః" **అని** తరువాత ఉపస్థితమైన వాయువుకు కారణత్వం లేదు అని నిరసింపబడింది, ఇప్పుడు "వాయోరగ్నిః" అనే

క్రమంలో వాయువుకు తరువాత ఉపస్థితమైన తేజస్సుకు కారణత్వం ఉన్నదని శంక రాగా, అది ఈ అధికరణంలో నిరసింపబడుతున్నది.

**జ్యోతిః చరణాభిధానాత్** –(1–1–25)

ఛాందోగ్యంలోని "అథ యదతః పరో దివో జ్యోతిః దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు అనుత్తమేషు ఉత్తమేషు లోకేషు ఇదం వావ తత్ యదిదం అస్మిన్ అంతః పురుషే జ్యోతిః" అనే వాక్యంలో నిస్సమాభ్యధికమైన కాంతిని కలిగినదిగా చెప్పబడుతున్న జ్యోతిస్సు "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్య అమృతం దివి" అని ముందు వాక్యంలో సర్వభూతాలను పాదంగా కలిగి ఉండడం, ద్యులోక సంబంధం, అక్కడ మూడు పాదాలను కలిగి ఉండడం మొదలైన ఇవి చెప్పబడ్డాయి. అందుచేత "పాదోస్య విశ్వా భూతాని త్రిపాదస్య అమృతం దివి" అనే పురుష సూక్త మంత్రంలోని అర్థం జ్ఞాపకం చేయబడి, వెంటనే, "వేదాహమేతం పురుషం మహాంతమ్, ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" అని ఆదిత్యుని వలే చాలా గొప్ప కాంతిని కలిగినవాడుగా చెప్పబడిన పరమ పురుషుడే ఈ జ్యోతిస్సు అనే శబ్దం చేత చెప్పబడేవాడుగా నిష్కర్షింపబడుతున్నది. గొప్ప జ్యోతి స్స్వరూపమైన దివ్యమంగళ విగ్రహం కలిగినందున పరమపరుశుని జ్యోతిశ్శబ్దం చేత నిర్దేశించడం తగినదే.

**ఇక్కడ పూర్వపక్షం ఈ విధంగా వాదింపబడుతున్నది**

ఛాందోగ్యోపనిషత్తులో "అథ యదతః పరో దివో జ్యోతిః దీప్యతే" అని మొదలైన వాక్యంలో గొప్ప కాంతిని కలిగినదిగా చెప్పబడిన జ్యోతిస్సు ఆదిత్యుడు మొదలైన జ్యోతిస్సులే అయి ఉండాలి. "అథ యదతః పరో దివో జ్యోతిః" అని యచ్ఛబ్దంతో ప్రసిద్ధి చెందినదిగా నిర్దేశించినందున ఆదిత్యాది తేజస్సులకే కదా అటువంటి ప్రసిద్ధి ఉన్నది. "ఇదం వావ తత్ యదిదం అస్మిన్ అంతః పురుషే జ్యోతిః" అని జఠరాగ్నిలో దానికి ఐక్యం చెప్పినప్పటికీ, తేజస్సు అనే ఆకారంచేత ఏకజాతీయం ఆయినందున ఆదిత్యాది తేజస్సుకే ఇది పొసగుతుంది. అటువంటి జ్యోతిస్సుకే చాలా గొప్ప కాంతిని కలిగి

ఉండడం చెప్పబడినందున, అదే జగత్కారణం అనే విషయం సిద్ధిస్తున్నది. ఎందుకంటే, ముండకోపనిషత్తు లో "యద్భూతయోనిః పరిపశ్యంతి ధీరాః" అని భూతయోని అయిన అక్షరాన్ని ప్రస్తావించి, దానికి "న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వం, తస్య భాసా సర్వమిదం విభాతి" అని అంటూ చాలా గొప్పదైన కాంతిని కలిగి ఉండడానికి తెలిపి ఉన్నందున, జగత్కారణత్వం ఉండే చోటలో అటువంటి కాంతిని కలిగి ఉండడం నియతమనేది తెలుపబడింది కదా. అందుచేత ఆదిత్యాది జ్యోతిస్సే జగత్ కారణం కాదగినది— అని సిద్ధాంత పక్షం.

దీనికి పిమ్మట ఒక చిన్న సందేహం ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది. ఛాందోగ్యంలో "గాయత్రీ వా ఇదం సర్వమ్" అని గాయత్రిని ప్రస్తావించి, "తదేతత్ ఋచాభ్యుక్తమ్" అని ఆ గాయత్రిని గూర్చినదిగా చెప్పబడిన "పాదోస్య సర్వా భూతాని" అని మొదలైన మంత్రం పరబ్రహ్మను గూర్చినదిగా ఏ విధంగా అవుతుంది? అని శంకించవచ్చు. దీనికి పరిహారం తెలుపుతున్నాము. " గాయత్రీ వా ఇదం సర్వమ్" అని గాయత్రీ ప్రస్తావం అక్కడ ఉండడం నిజమ అయితే, ఇక్కడ గాయత్రీ శబ్దంతో గాయత్రీ ఛందస్సు చెప్పబడినదిగా భావించనక్కరలేదు. ఎందుకంటే, వెంటనే" ఇదం సర్వమ" అని సర్వాత్మత్వం చెప్పబడి ఉన్నది. అది గాయత్రీ చందస్సుకు పొసగదు కదా, అంతే కాదు, ఆ ప్రకరణంలో భూతం, పృథివి, శరీరం, హృదయం— అనే ఈ నాలుగింటిని నాలుగు భూతాలుగా కలిగి ఉండడం చెప్పబడింది. ఇది కూడా గాయత్రీ మంత్రానికి ఎంత మాత్రం పొసగదు కదా. అందుచేత గాయత్రీ శబ్దంతో గాయత్రికి సమానమైన పరబ్రహ్మమే చెప్పబడినదిగా గ్రహించాలి. పరబ్రహ్మకు గాయత్రితో సామ్యం ఏ విధంగా సమకూరుతుంది? అని అంటే, నాలుగు పాదాలతో కూడి ఉండేది, గాయత్రి. పూర్వం చెప్పబడిన భూతం, పృథివి, శరీరం, హృదయం అనే నాలుగు భూతాలను కలిగినది, పరబ్రహ్మం. అందుచేత ఈ రీతిలో సామ్యం ఉన్నదని తెలియాలి. పరబ్రహ్మం గాయత్రీ సదృశం అని అనుసంధానం చేయడం కోసమే గాయత్రీ శబ్దంతో దానిని చెప్పడం జరిగింది

అని తెలియాలి. దీనికి ఒక దృష్టాంతాన్ని ఉదాహరణగా గమనించవచ్చు. సంవర్గ విద్యలో " తే వా ఏతే పంచాన్యే పంచాన్యే" అని ఒక వాక్యం ఉన్నది. అగ్ని, సూర్య, జల, చంద్ర, వాయు, వాక్, చక్షుస్సు, శ్రోత్ర, మనః, ప్రాణాలనే పది వస్తువులలో పది అనే సంఖ్య యొక్క సామ్యాన్ని పురస్కరించుకొని, 10 అక్షరాలను కల ఛందస్సుకు వాచకమైన విరాట్ శబ్దం ప్రయోగించబడి ఉన్నది గదా. ఆ విధంగానే ఇక్కడ కూడా నాలుగు పాదాలను కలిగి ఉండడం అనే ఈ విషయంలో కనిపించే సామ్యాన్ని పురస్కరించుకొని పరబ్రహ్మ విషయంలో గాయత్రీ శబ్ద ప్రయోగం చేయబడింది– అని తెలియాలి. ఈ విధంగా "పాదోస్య సర్వా భూతాని" అనే ఈ మంత్రం "గాయత్రీ వా ఇదం సర్వమ్" అని ఇంతకు ముందే ప్రస్తుతమైన బ్రహ్మాన్ని విషయంగా కలిగినది– అని నిశ్చయించుకోవడంలో ఏ కొరతా లేదు.

**దీనికి తరువాత కూడా ఇక్కడ ఇంకొక పూర్వపక్షం ప్రస్తావింపబడుతున్నది.**

"పాదోస్య సర్వా భూతాని" అనే మంత్రం పరబ్రహ్మపరంగానే ఉండనివ్వండి అయినప్పటికీ, "అథ యదతః పరో దివో జ్యోతిః" అని చెప్పబడిన జ్యోతి పరబ్రహ్మమే అని నిర్ణయించడం ఏ విధంగా? అని అంటే, ముందు మంత్రంలో పరబ్రహ్మను ద్యులోక సంబంధిగా చెప్పడం జరిగింది. ఇక్కడ "దివః పరో జ్యోతిః" అని అన్నందున ఆ జ్యోతిష్షు అనేది భూలోకానికి ఆవలి వైపున ఉన్నది అని చెప్పబడింది పరబ్రహ్మకు ఇక్కడ ప్రత్యభిజ్ఞ ఉండడంలో ఏ లోటు లేదు. ద్యులోకసంబంధి అయినది, ద్యులోకానికి ఆవలి వైపున ఉన్నది ఒకటిగానే ఉండడం వీలుకాని విషయం కదా –అనేది ఇక్కడ పూర్వపక్షం.

ఇక ఈ సందేహానికి సమాధానం తెలుపుతున్నాము. వృక్షాగ్రే శ్యేనః, వృక్షాగ్రాత్ పరతః శ్యేనః". అని ఈ విధంగా ఈ రెండు రీతులలో వాక్యం ఒకే అర్థంలో పర్యాయంగా ప్రయోగింపబడడం ఉన్నది. వృక్షం చివరిలో పక్షి ఉన్నది, వృక్షం అగ్రభాగానికి ఆవలి వైపున పక్షి ఉన్నది– అని ఈ రెండు రీతులలోని ప్రయోగాలకు తాత్పర్యం భేదం లేదు కదా. ఆ విధంగానే ఇక్కడ కూడా, "దివి, దివః పరః" అని రెండు రీతులలో ప్రయోగం ఒకే

అర్థంలో ఎటువంటి బాధ లేకుండా సంభవిస్తుంది. కనుక "త్రిపాదస్యామృతం దివి" అని ముందు ప్రస్తావింపబడిన పరబ్రహ్మకు"అథ యదతః పరో దివో జ్యోతిః" అని అన్నందున, ప్రత్యభిజ్ఞ ఉండడంలో ఏ లోటు లేదు. జ్యోతిశ్శబ్దం చేత నిర్దేశింపబడిన పరబ్రహ్మకు కౌక్షేయక జ్యోతిస్సుతో ఐక్యం చెప్పడం కూడా పొసగుతుంది. ఒక ఫలవిశేషాన్ని గూర్చి పర బ్రహ్మజ్యోతిస్సు అనుసంధానం చేసేటట్లు చెప్పబడింది అని భావించాలి.

**శ్రీభాష్యసారామృతంలో జ్యోతిరధికరణం ముగిసింది.**

## 11)ఇంద్ర ప్రాణాధికరణం

జ్యోతిస్సులు అని వ్యవహరింపబడే ఆదిత్యాదులకు జగత్కారణత్వం లేదు అని ముందు అధికరణలో రూపింపబడింది ఇప్పుడు అగ్ని, ఆదిత్యుడు మొదలైనవారికి అధిపతిగా ప్రసిద్ధుడైన దేవేంద్రునకు జగత్కారణత్వంశ ఉన్నదని శంకించబడి, పరిహరింపబడుతున్నది, ఈ అధికరణంలో

**ప్రాణః తదనుగమాత్** –(1–1–29)

ఇక్కడ ప్రాణశబ్దం ఇంద్రునకు ఉపలక్షణం. " భేదవ్యపదేశాచ్చాన్యః" అనే సూత్రం నుండి "అన్యః" అనే పదం అనువర్తింపబడుతున్నది. అందుచేత, ప్రాణ ఇంద్ర పదాలతో నిర్దేశింపబడినవాడు ప్రసిద్ధుడైన ఇంద్రుని కంటే వేరైనవాడు, ఎందుకంటే, ఇంద్రుని కంటే విలక్షణుడైనవానికి తగిన స్వభావాలు తరువాత వాక్యాలలో చెప్పబడినందున– అని సూత్రంలోని అర్థం.

కౌషీతకి అనే ఉపనిషత్తులోని ప్రతర్దన విద్యాప్రకరణంలో "మనుష్యులకు మోక్షోపాయంగా ఏది హితమైనదో దానిని నాకు చెప్పాలి" అని ప్రతర్దనుని కోరబడిన ఇంద్రుడు " ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా ఆయురమృతమితి ఉపాస్వ" అని అంటూ తనని ఉపాశించమని ఈ వాక్యంలో చెప్పబడింది తరువాత ఇంద్రుని ఉద్దేశించే "స ఏష ప్రజ్ఞాత్మా

ఆనందోజరోమృతః స న సాధునా కర్మణా భూయాన్నో ఏవాసాధునా కర్మణా కనీయాన్" అని చెప్పబడినది. ఇక్కడ చెప్పబడిన నిరుపాధిక ప్రజ్ఞత్వం, నిరుపాధిక ఆనందశాలిత్వం, అజరత్వం, అమృతత్వం, మొదలైనవి, కర్మఫలం స్పృశించకుండా ఉండడం, సర్వభూతాధారత్వం, ఈ విధంగా ఇంకా చెప్పబడే స్వభావాలు పరమాత్మ విషయంలో సంభవించదగినవే తప్ప, ఇంద్రుడనే జీవునిలో ఎంత మాత్రం సంభవించవు. అందువల్ల, ఉపక్రమంలో "మాం ఉపాస్వ "అని మోక్షోపాయ అయిన ఉపాసనకు లక్ష్యంగా చెప్పబడినవాడు ఇంద్రుడు అయే అవకాశం లేదు. "తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే" అని పరమాత్మోపాసనకే మోక్షోపాయత్వం నిస్సందేహంగా వేదాంతసిద్ధమైనందున, తర్వాత ఉండే "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తమ్" అని అన్నందున, "యమాత్మాన మంతరో యమయతి" అని అంతర్యామి బ్రాహ్మణశ్రుతియొక్క అర్థం స్మరింపజేయబడుతున్నందున, ఆ శ్రుతి అనేది సుబాలోపనిషత్తుతో సమానార్థకమై, పరమాత్మ విషయం అయినందున, ముముక్షువునకు ఉపాస్యంగా ఇంద్రునిచే చెప్పబడినవాడు ప్రాణ ఇంద్ర నిర్దిష్టమైన జీవుడుగా ఉండే అవకాశం లేదు. ఇంద్ర ప్రాణ శరీరకుడైన పరమాత్మగానే ఉండడంలో యుక్తమై ఉన్న ది— అని ఇక్కడ తాత్పర్యం.

ఇక్కడ ఒక పూర్వపక్షం కౌషీతకి ఉపనిషత్తులో ప్రతర్దనో హ వై దైవోదాసిరింద్రస్య ప్రియం ధామ ఉపజగామ" అని ఆరంభించి ఇంద్రులకు ప్రతర్దనునకు ఒక సంభాషణ జరిగినట్లు ఉదాహరించి, " " మనుష్యుడైన నాకు ఏది చాలా హితమైనదో, దానిని నీవే పరిశీలించి ఉపదేశించాలి" అని ఇంద్రునిత ప్రతర్దనుడు చెప్పగా, దానికి ఇంద్రుడు " మా మేవ విజానీహి, ఏతదేవాహం మనుష్యః య హితతమం మన్యే యన్మాం విజానీయాత్ "అని తనను ఉపాసించడమే మనుష్యునకు హితతమమని ఉపదేశించి, తన గొప్పతనాన్ని చెప్పడానికి ఆరంభించి, తాను ఎన్ని అకృత్యాలు చేసినా, అ అకృత్యఫలం తనకు వచ్చి చేరని గొప్పతనాన్ని తాను కలిగి ఉండడాన్ని పలికి, "స యో మాం విజానీయాత్" అని మొదలైన వాక్యాలతో తనను ఉపాసించేవానికి

అకృత్యఫలం అంటదు— అనే విషయాన్ని కూడా తెలియజేసి, " ప్రాణస్మి ప్రజ్ఞాత్మా తం మామ్ ఆయు రమృత మిత్యుపాస్వ" అని తనను ఉపాసించమని చెప్పినట్లుగా కనిపిస్తున్నది ఇక్కడ "త్వాష్ట్ర మహనమ్" అని "త్వాష్టుని నేను సంహరించాను" అని చెప్పినందున ఈ గుర్తులో వక్త ఇంద్రుడే అనేది చక్కగా తెలుస్తున్నది. ఇతనిని ఉపాసించడం హితతమమని కూడా తెలుస్తున్నది. మోక్షానికి ఉపాయమైన ఉపాసనమే హితతమం అవుతున్నది. అందుచేత ముముక్షువునకు ఉపాసించదగినవాడు ఇంద్రుడే—అని ఇక్కడ ఏర్పడుతున్నది. అటువంటి ఉపాస్యత్వం జగత్కారణమైన వస్తువుకే ఉన్నది. ఎందుకంటే, "కారణం తు ధ్యేయః" అని శ్రుతి చెప్పినందున. అందుచేత ఇంద్రుడే జగత్కారణభూతుడని సిద్ధిస్తున్నది— అనేది ఇక్కడ పూర్వపక్ష వాదం.

**దీనిని నిరాకరించే సిద్ధాంత వాదం ఈ విధంగా ఉన్నది**

"తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి" అని మొదలైనవానిలో పరమ పురుషునికి తగినదిగా అధ్యయనం చేయబడుతున్న ముముక్షుపాస్యత్వం, మోక్షాన్ని గురించి ఉపాయమైన ఉపాసనకు లక్ష్యమై ఉండడం, పరమాత్మకు మాత్రమే తప్ప, వేరు ఎవరికీ పొసగదు— అనే విషయం తెలిసి ఉండగా, జీవులలో ఒకడైన ఇంద్రుడు "మామ్ ఉపాస్వ" అని ఆ ముముక్షూపాస్యత్వం తనకు ఉన్నట్లుగా ఏ విధంగా చెబుతున్నాడు? అని గమనించాలి. ఆ విధంగా గమనించి చూసినప్పుడు, " మామ్ ఉపాస్వ" —నన్ను శరీరంగా కలిగిన పరమాత్మను ఉపాసించు —అని ఇంద్రుడు అన్నట్లుగానే ఇక్కడ అర్థం వస్తుంది. " మామ్" అనేదానికి ప్రసిద్ధమైన ఇంద్రుడు అని అర్థం కాదు, పరమాత్మయే అర్థం— అని దృఢంగా తెలియాలి. శరీరాన్ని చెప్పే శబ్దాలు శరీరి పర్యంతం బోధిస్తాయి అనే శాస్త్రతత్వాన్ని తెలిసే "మామ్ ఉపాస్వ " అని ఇంద్రుడు అన్నాడు. బృహదారణ్యకోపనిషత్తులో వామదేవుడు "అహం మనురభవమ్, సూర్యశ్చ" అని మొదలైనవాటితో తనను నిర్దేశించే "అహం" అనే శబ్దంతో పరమపరుషుని నిర్దేశించాడు. ఆ విధంగానే, ఇంద్రుడు కూడా ఇక్కడ తనను నిర్దేశించే " మామ్" అనే పదంతో,

ప్రాణవాచక శబ్దంతో పరమ పురుషుని నిర్దేశించాడు అనేది నిశ్చయింపబడుతున్నది. ఆ ప్రకరణంలో ఉండే శబ్దాలు అన్నీ ఈ నిర్ణయానికి చాలా ఉపకారాలుగా ఉన్నాయి. ఆ కౌషీతకీ ఉపనిషత్తులోనే " తత్ర యథా రథస్య అరేషు నేమి రర్పితా నాభౌ అరా అర్పితా, ఏవమేవ ఏతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాసు అర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణే అర్పితాః స ఏష ప్రాణ ఏవప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతః " అని అధ్యయనం చేయబడే చోట ప్రాణ, ప్రజ్ఞాత్మ, అమృత శబ్దాలతో " ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తం మామమృతమిత్యుపాస్వ" అని చెప్పేవానిని ప్రత్యభిజ్ఞాపకం చేసి, పరమాత్మకే సాధారణమైన చేతనాచేతన సకలాధారత్వం రథ నేమి అర నాభిదృష్టాంతాలతో చెప్పబడినందున "స ఏష ప్రాణ ఏవప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతః" అని అన్నందున సుబాలోపనిషత్తులో అయిదవ ఖండంలో చెప్పబడిన "తమాత్మాన ముపాసీత అజరమ్ అమృతమ్ అభయమ్" అని మొదలైనవానిని స్మరింపచేస్తుంది. అంతేకాక, "ఏష ఏవ సాధు కర్మ కారయతి" అనిమొదలైన సూక్తులకతో అంతర్యామి బ్రాహ్మణంలో " యర ఆత్మాన మంతరో యమయతి" అనే చోట పరమ పురుషునకే అసాధారణమని తెలుసుకొనబడిన, "మంచి కర్మలను, చెడ్డ కర్మలను చేయించడం "అనే ఒక గొప్పతనం "ఏషః" అనే ఏతచ్ఛబ్దంతో పరామర్శింపబడిన ప్రకృత వక్త విషయంలో చెప్పబడినందున, "మామ్ ఉపాస్వ" అనే చోట ఉపాసింపదగినవాడుగా చెప్పబడినవాడు పరమ పురుషుడు తప్ప, ప్రసిద్ధుడైన ఇంద్రుడు కాదు– అనే విషయం దృఢంగా నిర్ణయింపబడుతున్నది.

"త్వష్ట కుమారుడైన త్వాష్ట్రుని వధించాను" అని ఇంద్రుడు తనయొక్క అసాధారణ చేష్టితాన్ని చెప్పుకున్నాడు. ఇది ఇంద్రుని విషయంలో తప్ప, పరమ పురుషుని విషయంలో పొసగదు అనేది వాస్తవమే. దీనికి సమాధానం వినండి. ఇక్కడ ఇంద్రుడు తనకు అంతర్యామి అయిన పరమాత్మను స్వశరీరకునిగాను, ప్రాణ శరీరకుని గాను ఆనందిత్వాదిగుణవిశిష్టునిగాను – మూడు విధాలుగా ఉపాసించాలి అని ఉపదేశించాలని కోరుతున్నాడు. అందుచేత ఇక్కడ తన గొప్పతనాన్ని చెప్పుకోవడం

తాను అనుష్ఠించే ఒక బ్రహ్మ విద్యయొక్క ఫలాన్ని చెప్పినట్లు అవుతుంది—అని గ్రహించాలి.

**ఇంద్రప్రాణాధికరణం ముగిసింది**

**శ్రీభాష్య సారామృతంలోని మొదటి అధ్యాయంలో రెండవ పాదం ముగిసింది.**

-----***-----

## 13) సర్వత్ర ప్రసిద్ధ్యకరణమ్

ఇంతకు ముందు మొదటి పాదంలో ప ప్రమేయం ఏమి? అంటే, సద్విద్య మొదలైనవానిలో ఐచేతన వస్తువో, చేతనమో, జగత్కారణంగా ప్రతిపాదింపబడుతున్నందున, ఇంకొక ఏ వస్తువు జగత్కారణం కాదు—అని ప్రాప్తమైన వాదం నిరాకరింపబడి, చేతనా చేతన విశిష్టమైన పరబ్రహ్మమే జగత్కారణమని సమర్థింపబడింది. అందువల్ల చిదచిత్ విలక్షణమైన పరబ్రహ్మ విషయంలో జగత్కారణత్వ లక్షణానికి అసంభవశంక పరిహరింపబడినట్లు అయినది.

ఇప్పుడు రెండవ మూడవ నాలుగవ పాదాలు అనే శేషంతో ఈ లక్షణానికి చేతనంలోనూ అచేతనంలోను అతివ్యాప్తి కలుగుతున్నదని శంకించి, దానికి పరిహారం చెప్పబడుతున్నది. ఈ రెండవ పాదంలో చెప్పబడేది ఏమి? అని అంటే, చేతనా చేతనలింగాలలో స్పష్టమైన ప్రతిపాదనం లేని వాక్యవిశేషాలను ప్రస్తావించి, విచారించడం ద్వారా ఆ చేతనాచేతనాల విషయంలో అతివ్యాప్తి పరిహారం చేయబడుతున్నది.

ఇంతకు ముందు, ఇంద్రఅప్రాణాధికరణంలో ప్రాణశరీరకునకు జగత్కారణత్వం, ఉపాస్యత్వం చెప్పబడినవి. ఈ రెండు, శాండిల్య విద్యలో జీవాత్మకు చెప్పబడినవని,

అతడే జగత్కారణం కావాలి అనే శంకను పరిహరించడంకోసం ఈ అధికరణం ప్రస్తుతమవుతున్నది.

**" సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్"**–(1–2–1)

రాబోయే, " ఈక్షతి కర్మవ్యపదేశాత్ సః" ( 1–3– 12) అనే సూత్రంనుండి సాధ్య వాచకమైన "సః" అనే పదాన్ని ఇక్కడకు ఆకర్షించుకోవాలి. దీనివల్ల సూత్రార్థం ఏమని తెలుస్తున్నదంటే, సర్వ వస్తువులలో వాటికి ఆత్మగా ఉపదేశింపబడే వాడు సహా ఆ పరమ పురుషుడే, ప్రసిద్ధోపదేశాత్– ఇంకొక చోట ప్రసిద్ధంగా అనువాదం చేయబడినందువల్ల–అని అర్థం.

చాందోగ్యోపనిషత్తులో " సర్వం ఖల్విధం బ్రహ్మ తజ్జలాత్"ఇత్యాదిగా శాండిల్య విద్య చెప్పబడింది. అక్కడ " తజ్జలాత్ ఇదం సర్వం బ్రహ్మ ఖలు" అని అన్వయం. " తజ్జలాత్ అని అనేది "ఇదం " అనేదానికి హేతుగర్భ విశేషణం. ఇందులో, తచ్ఛబ్దార్థం బ్రహ్మం, తజ్జం, తల్లం తదనం – అని గ్రహించాలి, రతజ్జం– ఆ బ్రహ్మ నుండి పుట్టేది, తల్లం –ఆ బ్రహ్మలో లయించేది, తదనం–ఆ బ్రహ్మకు అధీనమై స్థితిని కలిగినది– అని అర్థం. " తేన అనతీతి తదనం" అనే వ్యుత్పత్తిని ఇక్కడ చెప్పుకోవాలి, " ఇదం సర్వం బ్రహ్మ" అనే సామానాధికరణ్యనిర్దేశం వల్ల జగత్తుకు, బ్రహ్మకు తాదాత్మ్యం చెప్పబడుతున్నది. ఈ విధంగా బ్రహ్మ నుండి పుట్టినందున, బ్రహ్మలో లయం పొందుతున్నందున, బ్రహ్మకు అధీనమైన స్థితిని కలిగినది అయినందున, చేతనా చేతనాత్మకమైన ఈ జగత్తు అంతా పరమాత్మే కదా–అనే అర్థం ఇక్కడ స్పష్టమవుతున్నది. ఇక్కడ సమానాధికరణ్య నిర్దేశం చేత సిద్ధించే అభేదం అనేది ఉపాదాన –ఉపాదేయ భావరూప కార్యకారణ భావం, శరీరాత్మ భావం –అనే అని రెండు విధాలుగా వివక్షితం. ఇందులో తజ్జత్వ తల్లత్వ హేతుకమైన అభేదం కార్య కారణ భావ ప్రయుక్తం, తదధీన స్థితిత్వ హేతుకమైన అభేదం శరీరాత్మ భావ ప్రయుక్తం. మట్టి ముద్దే కుండగా పరిణమిస్తున్నట్లు, బ్రహ్మం తానే స్వరూపేణ జగత్తుగా పరిణామాన్ని పొందడం

అనేది లేదు, ఎందుకంటే బ్రహ్మం నిర్వికారంకనుక. పూర్వం చిన్నవాడుగా ఉండేవాడు ఇప్పుడు యువకుడుగా అయ్యాడు పూర్వం యువకుడుగా ఉండేవాడు ఇప్పుడు ముసలివాడు అయ్యాడు అనే లోకవ్యవహారాలలో వివాత్మకు తెలియవచ్చే పరిణామం ఏ విధంగా శరీర ద్వారానో ఆ విధంగానే పరబ్రహ్మకు కూడా చేతనా చేతన రూప శరీరం ద్వారా పరిణామం అనే విషయాన్ని తెలియాలి. ఇందువల్ల, బ్రహ్మమే సూక్ష్మ చేతనా చేతన శరీరకమై, స్థూల చేతనా చేతన శరీరకమై, కార్యకారణ భావాన్ని పొందుతున్నందున, ప్రపంచం, బ్రహ్మం శరీర శరీరి భావాన్ని పొంది ఉన్నందున, ఈ రెండు విధాలుగా ఉండే అభేదం కొన్ని చోట్ల వేదంలో ఉపదేశింపబడుతున్నది. దానిని కొంచెం వివరించి చూపిస్తాము.

నారాయణోపనిషత్తులో (ఋగ్వేద శిరస్సులో) "నారాయణత్ బ్రహ్మ జాయతే, నారాయణాత్ రుద్రో జాయతే, నారాయణాత్ ఇంద్రో జాయతే" అని బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైనవారు నారాయణుని ఉపదాన కారణంగా కలిగిన వారు అని చెప్పబడుతున్నదానిని బట్టి, యజుర్వేద శిరస్సులో " బ్రహ్మ చ నారాయణః, శివశ్చ నారాయణం, శక్రశ్చ నారాయణః" అని అభేదం చెప్పబడింది. ముందు చూపబడిన ఋగ్వేద శిరస్సు వాక్యంలో ఉండే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు –అనే క్రమమే తరువాత చూపబడిన యజుర్వేద శిరస్సులో కూడా అనుసరింపబడింది– అనే విషయాన్ని సులభంగా తెలియవచ్చు.

"నారాయణాత్ బ్రహ్మ జాయతే" అని మొదలైన వాక్యాలలో నారాయణనకు చతుర్ముఖ బ్రహ్మ మొదలైన వారి శరీరాల ద్వారా పరిణామం వివక్షితం. " స బ్రహ్మ స శివః సేంద్రః సోక్షరః పరమః స్వరాట్ "అనే చోట బ్రహ్మ మొదలైనవారికి, పరమ పురుషులనకు మధ్య శరీరాత్మ భావ ప్రయుక్తమైన అభేదం. ఇది ఏ విధంగా తెలుస్తున్నది? అని అంటే, అంతకు ముందు " అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః "అని పరమాత్మకు సర్వత్ర ఆత్మగా వ్యాప్తిని చెప్పి, వెంటనే, " స బ్రహ్మ స శివః" అని అభేదం చెప్పబడినందున, శరీరాత్మ భావ నిబంధనమైన అభేదమే

ఇది– అని సులభంగా నిశ్చయించుకోవడానికి వీలవుతుంది. ఈ విధంగా అక్కడక్కడ ప్రత్యేకంగా వేదంలో అధ్యయనం చేయబడుతున్న, రెండు రీతులలో ఉండే అభేదం అనేది "సర్వం ఖలు"అనే వాక్యం ద్వారా చేర్చి చెప్పబడినది. ఈ రెండు విధాలయిన అభేదాలు సాక్షాత్తుగాను, పరంపరగాను శరీరాత్మ భావాన్ని మూలంగా కలిగినవి కనుక, "సర్వం ఇదం బ్రహ్మ" అనేదానికి – పరబ్రహ్మం కనిపించే శరీరాత్మ భూత కార్య భూత దేవమనుష్యాది చేతనా చేతనాత్మకమైన జగత్తును శరీరంగా కలిగినది – అనే అర్థం స్పష్టమవుతున్నది.

**ఇక్కడ ఒక పూర్వపక్షం ఈ విధంగా ప్రస్తుతమవుతున్నది.**

"సర్వం ఖలు ఇదం బ్రహ్మ" అని ప్రస్తావింపబడిన బ్రహ్మను గూర్చి ఇక్కడ, తరువాత "ఏష మ ఆత్మా అంతర్హృదయే" అని చెప్పబడుతున్నది శరీరం లోపల ఉండే హృదయంలో ఉన్నట్లుగా చెప్పబడుతుంది తుంది దీనివల్ల ఆ బ్రహ్మకు శ శరీరం భోగాయతనమని, శరీర సంబంధ నిబంధనమైన సుఖదుఃఖాలకు అది భోక్త అని, ఒక అల్పమైన ఒక స్థానాన్ని కలిగినది అని తెలుపబడినట్లు అయినది. ఇక్కడే "అణీయాన్ వ్రీహేర్వా యవాద్వా" అని మొదలైన వాక్యంలో ఆ బ్రహ్మం అల్ప స్థానాన్ని కలిగి ఉండడం, అణుపరిమాణం కలిగి ఉండడం, సుఖదుఃఖాలకు భోక్తయై ఉండడం అనే స్థితులను కలిగినదని చెప్పబడింది. ఈ విధంగా అల్ప స్థానాన్ని కలిగి ఉండడం, అణుపరిమాణాన్ని కలిగి ఉండడం, సుఖదుఃఖ భోక్త అయి ఉండడం –అనే ఇవి పరబ్రహ్మకు సంభవించనివి, జీవాత్మకే సంభవించడానికి అవకాశం ఉన్నవి. అందుచేత, జీవాత్మయే " సర్వం ఖల్విదం బ్రహ్మ" అని ఉపక్రమంలో ఉండే బ్రహ్మ శబ్దంచేత చెప్పబడాలి. ఆ జీవాత్మ విచిత్రకర్మ విశేషం కారణంగా దేవ మనుష్యాది భావాన్ని పొంది జన్మించినందున, "సర్వమిదం బ్రహ్మ" అని చెప్పిన అభేదం ఉపపన్నం కావడంలో ఏ లోటు లేదు– అనేది ఈ పూర్వపక్షంలోని సారం.

**దీనిని నిరసించే సిద్ధాంతవాదం ఈ విధంగా ఉన్నది.**

"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలాన్" అని ఉండడా న్ని ఆరంభంలోనే ఉపపాదించాము కదా! తజ్జత్వతల్లత్వాదులను అనువదించి, వానిని హేతువుగా గ్రహించిన ఆభేదం ఇక్కడ ప్రతిపాదింపబడడం వల్ల, కర్మమూలంగా దేవ మనుష్యాదిభావాన్ని పొందే దేవ మనుష్యాది భావానికి తజ్జత్వతల్లత్వాదులు హేతువుగా ఉండడంలో ఔచిత్యమే లేదు. ఒక చేతనుని ఉద్దేశించి ఇంకొక చేతనుడు ఆత్మగా ఉండడం అనేది సంభవించదు కనుక, "సర్వం ఖల్విదమ్" అని చెప్పబడిన సర్వ చేతనతాదాత్మ్యం అనేది ఒక జీవుని విషయంలోను సంభవించదు. అందుచేత ఇక్కడ బ్రహ్మశబ్దంతో నిర్దేశింపబడేవాడు జీవుడు అయ్యే అవకాశం లేదు తరువాత ఉపాస్యాలుగా చెప్పబడుతున్న మనోమయత్వాది గుణాలు జీవాత్మ విషయంలో సంభవించవు కనుక ఇక్కడ జీవాత్మ అప్రసక్తుడు కదా.

దీనిని కొంచెం వివరిస్తాము. ఇక్కడ ఉపాశాలుగా చెప్పబడినవి మనోమయత్వాది గుణంగా గుణాలు అని చెప్పాము కదా మనోమయత్వం, ప్రాణశరీరత్వం, భారూపత్వం, ఆకాశాత్మకత్వం మొదల మొదలైనవే ఆ గుణాలు. వీటిలో మనోమయత్వం అనేది " న చక్షుషా గృహ్యతే నాపి వాచా మనసా తు విశుద్ధేన" హనీ మొదలైన శ్రుతులలో ప్రసిద్ధమైన యోగ పరిశుద్ధ పరిశుద్ధమనో గ్రాహ్యత్వమే. దీనివల్ల హేయ సంబంధానికి అర్హమైనది కాదు అని తెలుస్తున్నద. హేయబంధానికి అర్హమైనది పరిశుద్ధ మనోగ్రాహ్యంగా ఉండదు కదా. ఇది జీవునకు అసంభావితం, ఎందుకంటే, ఇతడు హేయ సంబంధానికి అర్హుడు కనుక. ఇక ప్రాణ శరీరత్వమనేది "యస్య ప్రాణః శరీరమ్" అని అంతర్యామి బ్రాహ్మణసిద్ధమై, ప్రాణానికి నియామకత్వరూపమైనది. భారూపత్వం అంటే– " ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" ఇత్యాది శ్రుతి ప్రసిద్ధమైన, ఉన్నతమైన కాంతితో కూడిన విగ్రహం కలిగి ఉండడం. సత్య సంకల్పత్వమంటే– ఫలించి తీరే విధిలో ఉండే సంకల్పాన్ని కలిగి ఉండడం ఆకాశాత్మకం అంటే–"యస్య ఆకాశః శరీరమ్" అని అంతర్యామి బ్రాహ్మణ ప్రసిద్ధమై, ఆకాశానికి నియామకత్వరూపమైనది. ప్రకృత ప్రకరణంలో చెప్పబడిన ఇవి

మొదలైన గుణాలు జీవాత్మకు సంభవించ సంభవించనివి. అనంతరశ్రుతివాక్యంలో "ఏవమితః ప్రేత్య అభి సంభవితాస్మి అని బ్రహ్మకు ప్రాప్యత్వం, జీవునకు ప్రాప్తృత్వం చెప్పబడింది ప్రాప్త, ప్రాప్యఇ వేరు వేరు వ్యక్తులుగా ఉండవలసి ఉన్నది కనుక, ఈ ప్రకరణంలో బ్రహ్మశబ్ద నిర్దిష్టమైనది జీవుడుగా ఉండే అవకాశం లేదు. అంతేకాక, " ఏష మ ఆత్మా అంతర్హృదయే" అని ఉపాసకుడైన జీవుని "మే" అని షష్ఠ్యంత పదంతోను, ఉపాస్యమైన బ్రహ్మను "ఏషః"అని ప్రథమా విభక్త్యంతపదంతోను నిర్దేశింపబడింది. అందువల్ల కూడా బ్రహ్మశబ్దం జీవాత్మవాచకంగా ఉండే అవకాశం లేదు. ఇంతే కాక "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అనే భగవద్గీత వచనంలో జీవాత్మ యొక్క హృదయంలో ఉండేవాడు, ఈశ్వరుడని వ్యక్తమవుతున్నందున, ఆ వచనంతో విరోధిస్తుంది. అందుచేత "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని ప్రక్రాంతమైన బ్రహ్మమనేది జీవుడు అయే అవకాశం లేదు. పరమాత్మయే అయి ఉండాలి.

ఈ విధంగా అయితే, పరమాత్మను అపరిచిన్నంగా చెప్పడానికి విరుద్ధంగా ఈ ప్రకరణంలో "ఏష మ ఆత్మా అంతర్హృదయే అణీయాన్ వ్రీహేర్వా" అని మొదలైన వాక్యాలలో చెప్పబడినందున హృదయ రూపమైన అల్పదేశంలో ఉండడం, దానికి తగినట్లుగా అల్పమైన పరిమాణాన్ని కలిగి ఉండడం అనేవి ఎంత మాత్రం పొసగవు కదా. శరీర సంబంధ ప్రయుక్తమైన సుఖదుఃఖాల అనుభవం ప్రసక్తం అవుతుంది కదా— అని అంటే, ఈ రెండు సందేహాలకు పరిహారం వినండి. పరమ పురుషుడు సహజంగా అపరిచ్ఛిన్న పరిమాణుడై ఉన్నప్పటికీ, ఉపాసకుల అనుగ్రహం కోసం వారి హృదయంలో సన్నిహితుడై ఉంటూ, అల్పపరిమాణం కలిగినవాడై ఉండడం ఔపాధికం అవుతుంది. అనుసంధానార్థంగా ఈ విధంగా వేదంలో చెప్పబడుతున్నది, అంతే. శరీరంలో ప్రవేశించినంతమాత్రంతో కర్మ ఫలభోగం ప్రసక్తం కాదు. జీవుడు పుణ్య పాపాల రూపమైన కర్మలను చేసి, వాటి ఫలాన్ని అనుభవించడంకోసం శరీరంలో ప్రవేశిస్తున్నాడు కనుక, అతనికి ఆ శరీర సంబంధం సుఖదుఃఖా భోగం కోసం అవుతున్నది. పరమ

పురుషుడు అయితే శరీరం లోపల ప్రవేశించి ఉండడం నియమనం కోసం, స్వేచ్ఛ చేత కనుక, పైన ప్రసంగించిన రెండు సందేహాలకు ఎంత మాత్రం అవకాశం లేదు— అని తెలియాలి.

**శ్రీ భాష్య సారామృతంలో సర్వత్ర ప్రసిద్ధ్యధికరణం ముగిసింది.**

**ప్రథమ అధ్యాయం ద్వితీయ పాదంలో రెండవ అధికరణం**

## 13)అత్త్రధికరణం

ఇంతకు ముందు అధికరణం అయిన సర్వత్ర ప్రసిద్ధ్యధికరణంలో పరమ పురుషుడు ఉపాసకుల శరీరం లోపల ఉన్నప్పటికీ, కర్మ ఫలాలను అనుభవింపవలసిన ఆవశ్యకత అతనికి లేదు— అని చెప్పబడింది. ఆ విధంగా అయితే, కర్మ ఫల భోక్త గా చెప్పబడిన వ్యక్తి పరబ్రహ్మగా కావటానికి అవకాశం లేదు, జీవుడుగానే కావలసి వస్తుంది—అనే సందేహం లోచగా, ఇక్కడ ఆ సందేహాన్ని తీర్చడం కోసం ఈ అత్త్రధికరణం ప్రసక్తమైనది.

**అత్తా చరాచర గ్రహణాత్**—(1—2—9)

అత్తా— భోక్తగా చెప్పబడినవాడు, సః—ఆ పరమ పురుషుడే కావాలి, ఎందుకంటే, చరాచర గ్రహణాత్— చేతనా చేతనాలైన సకల పదార్థాలు ఆ పరమ పురుషుడు భోజ్య వస్తువుగా వేదంలో గ్రహింపబడుతున్నందున— అనేది సూత్రంలోని అర్థం.

కట్టవల్లి లోని రెండవ వల్లిలో "యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః, మృత్యుః యస్య ఉపసేచనమ్ క ఇత్థా వేద యత్ర సః" అనే ఒక మంత్రం అధ్యయనం చేయబడుతున్నది అందులో నిర్దేశింపబడిన ఒక పురుషునకు బ్రాహ్మణ వర్ణం, క్షత్రియ వర్ణం అన్నంగా అవుతున్నదని చెప్పి, మృత్యువు అనేవాడు ఆ అన్నానికి ఊరగాయగా అవుతున్నాడని చెప్పబడింది. ఏది మిగిలినవానిని భుజించటానికి

సాధనమై ఉండి, తాను కూడా భుజింపబడుతున్నదో, దానిని ఊరగాయగా చెప్పడం లోక రీతి. మాగాయ అనే ఒక ఊరగాయను ఉదాహరణగా తీసుకుందాము ఇది పెరుగన్నాన్ని భుజించడానికి సాధనమై చివరిలో తాను కూడా భుజింపబడేదిగా ఉన్నది కదా. అదే ఊరగాయ లక్షణం. ప్రస్తుతం లో బ్రాహ్మణ క్షత్రియులను భుజించడంలో మృత్యువు ఉపసేచనం ఊరగాయ అని చెప్పినందున మృత్యు అనేవాడు ఇతర వస్తువులను భుజించడానికి సాధనమై ఉండి, తాను కూడా చివరిలో భుజింపబడుతున్నాడని తెలుస్తున్నది. మృత్యువు అనేవాడు భుజింపబడుతున్నాడు అని అంటే, ఇది సంభవించదు, సంహరింపబడేవాడు అనేదే దాని అర్థం— అని తెలియాలి. ఇతర వస్తువులను భుజించటానికి సాధనమై ఉండడం అనేది కూడా సంహారసాధనత్వం అని అనడం కోసమే చెప్పబడిందని తెలిసికోవాలి. మృత్యువునకు సకల చరాచర ప్రాణి సముదాయంయొక్క సంహారంలో సాధనం కావడం తప్ప, బ్రాహ్మణ క్షత్రియ మాత్ర సంహారంలో సాధన కావడం అనేది కాదు. అందుచేత, ఏ పురుషునిచే సంహార సాధనంగా మృత్యువున గ్రహించి, సకల చరాచరాలు సంహరింపబడుతున్నదో, ఆ మృత్యువు కూడా సంహరింపబడుతున్నాడో, ఆ పురుషుడు ఏ ప్రకారంగా ఉన్నాడ, ఆ ప్రకారాన్ని, అంటే, ఆ గొప్పతనాన్ని తెలిసినవారెవరు ఎవరు లేరు— అనే అర్థం ఇక్కడ పైన ప్రస్తావించిన శ్రుతి వాక్యానికి అర్థమని స్పష్టపడుతున్నది.

ఈ యచ్ఛబ్దంచేత నిర్దేశింపబడిన పురుషుని "ఋతం పిబంతౌ" అనే తరువాత మంత్రంలో ప్రస్తావించి, అతడు సులభంగా ఉపాసించదగినవాడు అనేది తెలియడం కోసం ఉపాసకుడైన జీవునితో కూడా ఒకే హృదయగుహలోసన్నిహితుడై ఉంటున్నట్లు చెప్పి, ఉపాసనకు ఫలమై, ప్రాప్యవస్తు ప్రాప్తికి కరణంగా ఉపాసనను, ఉపాసకుని రథిగా, అతని శరీరం మొదలైనవాటిని రథం మొదలైనవానిగా పరికల్పనను చేసి, అటువంటి ఉపకరణాలతో పొందదగిన వస్తువును ఉపదేశించే ప్రకరణంలో "సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" అని ముందు చెప్పిన రథం మొదలైన ఉపకరణాలను కలవాడు

విష్ణువు యొక్క గొప్పదైన పదాన్ని పొందుతున్నాడు— అని విష్ణువును ప్రాప్యంగా చెప్పినందున "యస్య బ్రహ్మ చ క్షత్రం చ" అనే మంత్రంలో నిర్దేశింపబడిన సంహర్త పరమ పురుషుడే— అని నిశ్చయింపబడుతున్నది.

**ఇక్కడ ఒక పూర్వపక్షం**

"యస్య బ్రహ్మ చా క్షత్రం చ " అనే మంత్రంలో బ్రాహ్మణ క్షత్రియాది జాతీయులైన స్త్రీపురుషులు పరస్పరం భోగ్య భూతులని ఏర్పడుతున్నది. అందువల్ల యచ్ఛబ్దంతో నిర్దేశింపబడుతున్న భోక్త జీవాత్మగానే ఉండి ఉండాలి అని తెలుస్తుంది. ఎందుకంటే, కర్మ యొక్క ఫలమైన స్త్రీభోగం మొదలైనవి జీవులకే సంభవిస్తాయి కనుక. "మృత్యుః యస్య ఉపసేచనమ్" అని పలకడం మృత్యువు అనేవాడు జీవాత్మ స్వరూపాన్ని గూర్చి బాధకుడు అని ఇంత మాత్రం తెలుపడలోనే ఉద్దేశ్యం కలిగినది. అందుచేత, జీవుడే ఆ మంత్రంలో ప్రతిపాదింపబడుతున్నాడు అనేది ఇక్కడ పూర్వపక్షం.

**దీనికి సమాధానంగా చెప్పబడే సిద్ధాంతం ఏమంటే,**

"మృత్యుః యస్య ఉపసేచనమ్" అనే వాక్యంలో చెప్పబడిన ఉపసేచనత్వం అబాధకత్వరూపమే అని గ్రహించడంలో చాలా అస్వారస్యం ఉన్నందున, లోక ప్రసిద్ధికి అనుగుణంగా ఉండదు అని, మిగిలినవానిని భుజించడానికి సాధనంగా ఉంటూ, తాను కూడా భుజింపబడి ముగుస్తున్నదో, అదే ఉపసేచనం—అని స్వరసమైన అర్థాన్ని గ్రహించాలి కనుక, ఇంతకు ముందు వివరించిన రీతిలో మృత్యు సంహార సాధనంగానూ సంహరింపబడేవాడుగా ఉండడమే ఉపసేచనం న అనేదానికి పొసగేది అయిన అర్థం, భోగ్యత్వం అనేది ఇక్కడ అర్థం కావడంలో అవకాశం లేదు. అందుచేత కర్మ ఫలాలను అనుభవించేవాడైన జీవునకు ఇక్కడ ప్రసక్తి లేనే లేదు.

**అత్త్రధికరణం ముగిసింది.**

## 14)అంతరధికరణమ్

ఇంతకు ముందు అధికరణంలో" క ఇత్థా వేద యత్ర సః"అని అన్నందున పరమాత్మ తెలిసికోవడానికి వీలుకానివాడు అని చెప్పబడింది. ఆ విధంగా అయితే, తెలుసుకోవడానికి వీలైనవాడు అని చెప్పబడేవాడు పరమాత్మగా ఉండే అవకాశం లేదే! — అనే సందేహం రాగా, దానిని తీర్చడం కోసం ఈ అధికరణం అవతరించింది.

**అంతర ఉపపత్తేః**–(1–2–13)

అంతరః –కంటి లోపల ఉండేవాడు, సః– ఆ పరమ పురుషుడే, ఉపపత్తేః– అక్కడ చెప్పబడిన అభయత్వం, అమృతత్వం మొదలైనవి ఆ పరమ పురుషుని విషయంలోనే చక్కగా కూడేవి అయినందువల్ల– అనేది ఈ సూత్రంలోని అర్థం.

ఛాందోగ్యోపనిషత్తులో ఉపకోసల విద్యా ప్రకరణంలో "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే, ఏస ఆత్మేతి హోవాచ, ఏతదమృతమ్, ఏతభయమ్ ఏతద్బ్రహ్మ" అని అధ్యయనం చేయబడుతున్నది. ఇక్కడ "అక్షిణి పురుషో దృశ్యతే" అని చెప్పినందున కంటి లోపల ఉండేవాడుగా ఒక పురుషుడు చెప్పబడుతున్నాడు. అంతర్యామి బ్రాహ్మణంలో "యశ్చక్షుషి తిష్ఠన్, చక్షుషోంతరః" అనే వాక్యంతో కంటి లోపల ఉండేవాడు గాను నియామకుడిగాను వేదం లో చెప్పబడే పరమ పురుషుడు"య ఏషః" అని మొదలైన వాక్యాలతో స్మరింపజేయబడుతున్నాడు. అందుచేత అక్షిపురుషుడు పరమపురుషుడుగానే కాదగినవాడు అని చెప్పినట్లు అయినది.

**అంతరధికరణం ముగిసింది**

## 15)వైశ్వానరాధికరణమ్

ఛాందోగ్యంలో వైశ్వానర విద్యా ప్రకరణంలో (5– 11–1) " కోన ఆత్మ తిం బ్రహ్మ అని ఆరంభించి, " ఆత్మానమేవ ఏతం వైశ్వానరం సంప్రతి అధ్యేషి, తమేవ నో బ్రూహి"అని ప్రశ్న, (5–18–1) " యస్త్వేన మేవం ప్రాదేశమాత్రమ్ అభివిమానమాత్మమ్

వైశ్వానర ముపాస్తే" అనే సమాధానం కనబడుతున్నది. ఈ సందర్భంగా పరమాత్మ వైశ్వానర శబ్దానికి అర్థంగా నిర్ణయించడం సాధ్యమవుతుందా ?సాధ్యం కాదా? అనేది సందేహం.

**ఇక్కడ పూర్వపక్షం ఏమంటే,**

వైశ్వానర శబ్దానికి నాలుగు అర్థాలు కనబడుతున్నాయి, అగ్ని, మహాభూతాలలో మూడవది అయిన భూతం, దేవతా విశేషం, పరమాత్మ అని. ఈ నాలుగు అర్థాలలో వైశ్వానర శబ్ద ప్రయోగం అక్కడక్కడ కనబడుతున్నది. ఈ ప్రకరణంలో పరమాత్మ పరంగానే నిర్ణయించడానికి ఆవశ్యకత లేనందువల్ల ఆ విధంగా నిర్ణయించడం సాధ్యం కాదు— అనేది ఇక్కడ పూర్వపక్షం.

**ఇక్కడ సిద్ధాంతం ఈ విధంగా ఉన్నది.**

**వైశ్వానరః సాధారణశబ్దవిశేషాత్**–(1–2–25)

సాధారణ శబ్దవిశేషాత్ వైశ్వానరః పరమాత్మా— సాధారణమైన వైశ్వానర శబ్దాన్ని పరమాత్మకు తగిన అసాధారణ ధర్మాలతో విశేషించినందున ఇక్కడ వైశ్వానర శబ్దంచేత చెప్పబడేవాడు పరమాత్మయే కాదగినవాడు – అనేది ఈ సూత్రంలోని అర్థం.

ప్రారంభంలోనే "కో ను ఆత్మా" అని సకల జీవాత్మలకు ఆత్మగా ఉండేవాడు ఎవడు? అనే జిజ్ఞాసను వ్యక్తం చేసి, " యస్తు ఏతదేవం ప్రాదేశమ్ అభివిమానమాత్ర మాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేషు ఆత్మసు అన్న మత్తి" అని వైశ్యానరోపాసనకు పరమ భోగ్యమైన పరబ్రహ్మ యొక్క అనుభవం ఫలంగా వేదంలో చెప్పబడినట్లు కనిపిస్తున్నది. సకల లోకాలలోను, సకల భూతాలలోనూ సకల ఆత్మలలోనూ ఉండేదైన, "యత్ అన్నమ్"— పరమ భోగ్యమైన ఏ పరబ్రహ్మం ఉన్నదో, తత్ అత్తి— దానిని అనుభవిస్తున్నాడు—అని ఆ శ్రుతిలోని అర్థం., "అత్యేతి ఇతి అన్నమ్" – అనుభవింపబడుతున్నది భోగ్యంగా

గ్రహింపబడుతున్నది అని అర్థం రసో వై సః, రసం లబ్ధ్వాయం ఆనందీ భవతి" అని టైప్రియ ఉపనిషత్తులో చెప్పబడిన పరబ్రహ్మ యొక్క అనుభవమే ఇక్కడ ఈ వాక్యంలో చెప్పబడుతున్నది. ముముక్షువులకు హేయమైన, ప్రాకృతమైన అన్నం కాదు, ఇక్కడ "అన్న మత్తి" అనే దానివల్ల వివక్షితం.

ఇంతేకాక, "తద్యథా ఇషీకతూలం అగ్నౌ ప్రోతం ప్రదూయేత, ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" అని వైశ్వానరాత్మోపాసకునకు సకల పాపాలు తొలగిపోవడం అనేది ఫలంగా చెప్పబడింది. వైశ్వానరాత్మకు ద్యులోకం మొదలైన త్రైలోక్యం శరీరంగా ఉండడం వేదఃలో చెప్పబడుతున్నది. అందుచేత, ఇటువంటి అసాధారణ ధర్మాలతో కూడిన వైశ్వానరాత్మ పరమాత్మే అని నిర్ణయించడంలో ఏ కొరత లేదు. ఈ వైశ్వానర శబ్దం జఠరాగ్ని పరమని శంకించడానికే స్వల్పహేతువు ఉన్నా, " య ఏషోగ్నిః వైశ్వానరో యత్పురుషః " అని నిరుపాదిక పురుష శబ్దవాచ్యత్వం ఇక్కడ స్పష్టంగా చెప్పబడుతున్నందున, ఇది ఒక జఠరాగ్నికి అసంభావితం. టైలోక్య శరీరత్వం కూడా అసంభావితం అనేది పునరుక్తం. జఠరాగ్ని విషయంగా లోస్తున్న అగ్నిశబ్దం తచ్ఛరీరక పరమాత్మగానే చెప్పబడాలి, ఎందుకంటే, దాని దగ్గర అసంభావితమైన ధర్మాలు చెప్పబడినందువల్ల. " భగవానితి శబ్దోయం తథా పురుష ఇత్యపి నిరుపాధీ చ వర్తేతే వాసుదేవే సనాతనే" అనే ప్రమాణం నిరుపాదికమైన పురుష శబ్దం పరమాత్మకు అసాధారణమని దృఢపరుస్తున్నందున, "సకల ఏషోగ్నిః వైశ్వానరో యత్పురుషః" అనే శ్రుతి వాక్యం జఠరాగ్నిని వ్యావర్తించి తీరుతుంది. అందుచేత, అగ్నిశబ్దసమానాధికరణ్యం అనేది వైశ్వానరునకు పరమాత్మత్వాన్ని నిర్ణయించడంలో విరోధి కానే కాదు. తచ్ఛరీరకుడు కనుక పరమాత్మోపాసనం ఇక్కడ విధివిషయమని గ్రహించాలి.

ఇక్కడ ఒక విశేషం ఈ అధికరణంలో "సాక్షాదప్యవిరోధం జైమినిః" అనే 29వ సోత్రం వేదాంతలచే విశేషించి గమనించదగినది అగ్ని వైస్వనరుడు మొదలైన శబ్దాలు అన్నీ తత్తచ్ఛరీరకత్వేన (ఆయా శబ్దాల చేత నిర్దేశింపబడే దేవతలను శరీరంగా

కలవాడైనందున) పరమాత్మను తెలుపుతున్నట్లుగా గ్రహించే ఒక ప్రకారం ఉన్నది. "సాక్షాదప్యవిరోధం జైమిని రాచార్యో మన్యతే" —అగ్నిశబ్దానికి "అగ్రం నయతి" అనే వ్యుత్పత్తిని గ్రహిస్తే, సాక్షాత్తుగానే పరమాత్మను ఆ శబ్దం చెబుతుంది —అని అనడంలో అడ్డు లేదు. అపర్యసాన వృత్తి ద్వారా పరమాత్మ పర్యంతత్వం చెప్పడం కంటే, సాక్షాత్తుగానే పరమాత్మ పరంగా చెప్పదగిన చోట్ల ఆ విధంగా గ్రహించవచ్చు అనేదానిని సూత్రకారులు చూపించినట్లయినది. శచీపతిః ఇత్యాది విశేషణ యోగంలేని ఇంద్రశబ్దం కనిపించే చోట "ఇది—పరమైశ్వర్యే" అనే వివరణను గ్రహించి, పరమేశ్వరుడైన పరమాత్మను అర్థంగా చెప్పడంలో అసంభావితత్వం ఏమీ లేదు అని కదా భావించాలి. ఈ విధంగా పలు విషయాలు పలు శబ్దాల ప్రయోగాలలో తెలియవచ్చు.

**వైశ్వానరాధికరణం ముగిసింది**

## 16)భూమాధికరణం

**భూమా సంప్రసాదాత్ అత్యుదేశాత్**—(1—3—7)

చాందోగ్యంలో "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శ్రుణోతి నాన్యద్విజానాతి స భూమా, అథ యత్ర అన్యత్ పశ్యతి అన్యత్ శ్రుణోతి అన్యద్విజానాతి తత్ ఆల్పమ్" అనే వాక్యం ఒకటి అధ్యయనం చేయబడుతున్నది దీని అర్థం ఏమంటే —ఏ వస్తువును అనుభవించేటప్పుడు ఏ ఇతర వస్తువును కంటితో కూడా చూడడో, చెవితో వినడో, తెలియడో, అది భూమ. ఏ వస్తువును అనుభవించేటప్పుడు, ఇంకొక ఇతర వస్తువును కంటితో చూస్తున్నాడో, చెవితో వింటున్నాడో, తెలిసికుంటున్నాడో, అది ఆల్పం— అని. ఇక్కడ భూమా అనేవి ఇమనిచ్ ప్రత్యాయాన్ని చివరి కలిగిన శబ్దం కనుక, "బహోః భావః భూమా" అనే వ్యుత్పత్తి చేత బహుత్వమనే అర్థాన్ని ఇచ్చేది అవుతున్నది. అందుచేత ధర్మపరమైన శబ్దం ఇది అని తెలుస్తుంది అయినా తరువాత యత్ర అన్యత్ పశ్యతి తత్ అల్పమ్" అని ఉన్నందువల్ల, అల్ప శబ్దం ధర్మిపరమే తప్ప ధర్మపరంగా కాదు కనుక దానికి ప్రతియోగి అయిన భూమా అనే శబ్దం కూడా ధర్మిపరంగానే

గ్రహించదగినది. కనుక, గొప్పతనం— అనే అర్థాన్ని ఇవ్వకుండా, పెద్దది— అనే అర్థాన్ని ఇస్తున్నది. ఈ ప్రకరణంలో "తరతి శోకమ్ ఆత్మవిత్" అని ఆరంభించి, భూమవిజ్ఞానాన్ని ఉపదేశించి, "ఆత్మైవ ఇదం సర్వమ్" అని ఆత్మను పురస్కరించుకునే ప్రకరణాన్ని ఉపసంహరించినందు వల్ల, భూమా అని పెద్దదిగా చెప్పబడుతున్న వస్తువు ఆత్మయే అని తెలుస్తున్నది. ఈ విధంగా భూమగుణ విశిష్టంగా చెప్పబడుతున్న ఆత్మ ప్రత్యగాత్మయా?, లేక, పరమాత్మయా? అనే సంశయం కలిగినప్పుడు, ప్రత్యగాత్మయే అనే పూర్వపక్షం ఏర్పడుతున్నది. ఏ విధంగా అంటే, శ్రుతం కహ్యేవ మే భగవన్! దృశేభ్య స్తరతి శోకమాత్మవిత్" అని ఆత్మజిజ్ఞాస చేత వచ్చి ఆశ్రయించిన నారదమహర్షిని ఉద్దేశించి నామం మొదలుకొని ప్రాణం వరకు ఉపస్యాలైన, సనత్కుమారునిచే ఉపదేశింపబడిన చోట, ", ఆస్తి భాగవన్ నామ్నో భూయః అస్తి భగవన్ వాచో భూయః"( నామం అంటే వాక్కు గొప్పది, వాక్కు కంటే మనస్సు గొప్పది) అని మొదలైన చోట్ల చెప్పడం కూడా గమనిస్తున్నాము. ఈ విధంగా కనిపించడం ప్రాణం వరకే. ప్రాణాన్ని చెప్పిన తర్వాత అయితే, ప్రశ్న లేదు, సమాధానమూ లేదు. అందుచేత ఇక్కడ ప్రాణశబ్దవిశిష్టుడు ప్రాణ సహచారి అయిన ప్రత్యగాత్మయే తప్ప, వాయు విశేషమాత్రం కాదు అంతేకాక, "ప్రాణో హ పితా ప్రాణో హ మాతా" అని మొదలైన వాక్యాలు కూడా ప్రాణాన్ని చేతన వస్తువుగా తెలుపుతున్నాయి. భూమా అని పెద్దదిగా చెప్పబడిన వస్తువు ఈళ ప్రాణమే అవుతుంది. అందుచేత, ప్రత్యగాత్మయే ఇక్కడ భూమశబ్ద నిర్దిష్టమైన వస్తువుగా గ్రహించదగినవాడు —అనేది ఇక్కడ పూర్వపక్షం.

**ఇక్కడ సిద్ధాంతం ఏమంటే—**

**(సంప్రసాదాత్ అత్యుపదేశాత్)** భూమా అని అనల్పంగా చెప్పబడినవాడు పరమాత్మయే అవుతాడు, ఎందుకంటే, సంప్రసాదా త్ — జీవాత్మ కంటే, అతి— అధికంగా, ఉపదేశాత్— తెలుపబడినందున— అని సూత్రంలోని అర్థాన్ని గమనించాలి. ఛాందోగ్యంలో(8—12—5) " ఏష సంప్రసాదోఽస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతి

రుపసంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే" అనే చోట జీవాత్మవాచకంగా సంప్రసాద శబ్దం ఉన్నందున ఉపనిషత్ ప్రసిద్ధిని పురస్కరించుకుని ఈ విధంగా అర్థం చెప్పబడింది. అది ఉండనివ్వండి. ఛాందోగ్యంలో(7—15—1) "ప్రాణో వా ఆశాయా భూయాన్" అని ప్రత్యగాత్మను ఆశ కంటే అధికునిగా పలికి, తరువాత "ప్రాణో హ్యేవైతాని సర్వాణి భవతి స వా ఏష ఏవం పశ్యన్ ఏవం మన్వాన ఏవం విజానన్ అతివాదీ భవతి తం చేత్——— నాపహ్నువీత" అది 15వ ఖండం పూర్తి చేయబడింది. ఇక్కడ "అతివాదీ భవతి" అనేదానికి ఏమి? అర్థం అంటే, తాను ఉపాసించే వస్తువును ఉత్కృష్టంగా చెబుతున్నాడు అనేది అర్థం. ఇది ఉపాస్య దేవత యొక్క అతిశయంలో పర్యవసిస్తుంది, అంటే, తనచే ఉపాసించబడే వస్తువు సర్వోత్కృష్టమైనది అనడం, ఆ ఉపాస్య వస్తువు నిజానికి ఉత్కృష్టమైనది— అని తెలిపినట్లుగా అవుతుంది. ఇక్కడ(7—6—11) " ఏష తు వా అతివదతి యః సత్యేన అతివదతి" అనే వాక్యం నిశితంగా గమనించదగినది. ఇందులో "తు" అనే పదం ఉన్నందున ఇతర వ్యావర్తకమైన ఆ తుకారం వేరొక అతివాది ఉన్నట్లుగా తెలియజేసి, " యః సత్యేన అతివదతి" కానీ సత్యశబ్దవాచ్యమైన పరబ్రహ్మను ఉపాసించేవారికి ఇంకా అతిశయితమైన అతివాదిత్వాన్ని పలికి, అతని అతివాదిత్వానికి మూలమైనది, సత్య వాక్యమైనది, ప్రత్యగాత్మకంటే కూడా విలక్షణమైనది అయిన పరబ్రహ్మను "సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యం" ( శబ్దవాచ్యమైన బ్రహ్మమే ఉపాసించదగినది)— అని సనత్కుమారులు ఉపదేశించి పూర్తి చేశారు. ఇక్కడ ముందు పర్యాయాలలో చెప్పబడరు అతివాదిత్వం ఇక్కడ చెప్పబడినందున ఉపక్రాంతమైన ఆత్మోపదేశం ప్రత్యగాత్మలో పూర్తి చేయబడింది కనుక, " ప్రాణం కంటే గొప్పది ఉన్నదా? "అని నారదుడు అడగకపోయినప్పటికీ, సనత్కుమారుడు తానుగానే అంతకంటే మించిన పరమాత్మను గూర్చి " ఏష తు వా అతివదతి యః సత్యేన అతివదతి" అని ఉపదేశించారు. " సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" ఇత్యాదులలో సత్యశబ్దవాచ్యత్వం పరబ్రహ్మకు ప్రసిద్ధం. " సదైయక రూపత్వేన నిర్వికారత్వాత్

సత్యత్వం" అని వేదాంతుల గోష్ఠిలో ప్రసిద్ధమైనదే. ఈ విధంగా భూమశబ్దవాచ్యుడు ప్రత్యగాత్మ కాడు, పరమాత్మయే –అని సిద్ధాంతీకరింపబడినది.

**భూమాధికరణం ముగిసింది**

**శ్రీభాష్య సారామృతంలోని మొదటి అధ్యాయంలో రెండవ పాదం ముగిసింది.**

**-----***-----**

## 17)దహరాధికరణం

**ఇది ప్రథమాధ్యాయం మూడవ పాదంలో ఉన్నది.**

ఛాందోగ్యోపనిషత్తులో " పేఅథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోస్మిన్ అంతర ఆకాశః తస్మిన్ యదంతః తదన్వేష్టవ్యమ్" అని మొదలైన వాక్యంతో అధ్యయనం చేయబడేది దహరవిద్య అనబడుతున్నది. ఈ దహర విద్యా ప్రకరణంలో తరువాత " ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకోఽవిజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః" అని గుణాష్టకం చెప్పబడింది. ఇది పరబ్రహ్మకే తగినది కనుక, దహర శబ్దవాచ్యమైన వస్తువు పరబ్రహ్మయే తప్ప వేరు కాదు– అని ఈ అధికరణంతలో నిష్కర్షింపబడుతున్నది.

" దహరోస్మిన్నంతర ఆకాశః" అని చెప్పబడే దహరాకాశం పరమాత్మ అయే అవకాశం లేదు. ఎందుకంటే, ఇక్కడ "తస్మిన్ యదంతః తదన్వేష్టవ్యమ్" అని ఉన్నది. " అన్వేష్టవ్యమ్" అనే పదానికి "వెదుకదగినది" అని అర్థం. ధ్యానించదగినది –అని పరమార్థం. "ఆ పరమ పురుషుడు ధ్యానించదగినవాడు" అని ఉంటే తగి ఉంటుంది. ఆ విధంగా ఉండకుండా, " దాని లోపల ఉండేది ధ్యానించదగినది"అని ఉన్నందున పరమపురుషపరత్వం ఇక్కడ చెప్పడానికి వీలు లేదు. ఆకాశ శబ్దానికి భూతాకాశంలో

ప్రసిద్ధి అధికంగా ఉన్నందున, ఇక్కడ దహరాకాశంగా చెప్పబడ్డ వస్తువు భూతాకాశమే అయి ఉండాలి –అనేది ఇక్కడ పూర్వపక్షం.

**ఇక, ఇక్కడ సిద్ధాంతం ఏమంటే,**

**దహర ఉత్తరేభ్యః(1–3–13)**

ప్రకృత స్థలంలో పైన ఉండే వాక్యంలో చెప్పబడిన ధర్మాలలో ఆ ధర్మాలు పొసగేటట్లు చేయాలి అనేదాని కోసం, దహరాకాశ శబ్దంతో పరమపురుషుడే చెప్పబడుతున్నాడు అని నిష్కర్షించడం కోసం సూత్రంలోని అర్థం సులభంగా తెలియదగినది. "దహరోస్మిన్ అంతర ఆకాశః "అని దహరాకాశాన్ని ప్రస్తావించి, "తస్మిన్ యత్ అంతః "అని దాని లోపల ఉన్నదిగా ఒక వస్తువును ప్రస్తావించి, "తత్ అన్వేష్టవ్యమ్" అని తచ్ఛబ్దంతో ప్రస్తుతమైన దహరాకాశం కానీ, దాని లోపల ఉండే వస్తువు కానీ, ఈ రెండిటిని ప్రస్తావించి, ఈ రెండు ఉపాసించ దగినవి అని తెలియజేసి, వాని లోపల ఉన్నది ఏది? అని ప్రశ్నించుకొని, "అస్మిన్ కామాః సమాహితాః ఏష ఆత్మా అపహతపాప్మా ––సత్యకామః సత్య సంకల్పః "అని అధ్యయనం చేయబడిన విషయం ప్రసిద్ధం. దీనివల్ల మనం స్పష్టంగా తెలుసుకొనదగినది ఏమి?అంటే, ముందు ప్రస్తావించబడిన దహరాకాశం పరమాత్మయే అని, దాని లోపల ఉండే వస్తువు అపహతపాప్మత్వం మొదలైన ఎనిమిది గుణాలు అని, ఆ దహరాకాశమే "ఏష ఆత్మా అపహత పాప్మా" అని ఎనిమిది గుణాలతో కూడినదిగా చెప్పబడుతున్నది అని తెలిసికోవాలి. ఆకాశ శబ్దం ఉన్నందున భూతాకాశ ప్రతీతి కదా కలుగుతుందే! అనే వాదం ఎంత మాత్రం తగినది కాదు. " ఆకాశో హ వై నామరూపయోః నిర్వహితా" ఇత్యాధులలతో ఆకాశ శబ్దం పరమ పురుషుని విషయంలో కూడా ప్రసిద్ధమై ఉండడాన్ని గమనించవచ్చు. ఈ విధంగా దహరాకాశ శబ్దంలో ఉండే పురుషుడు పరమ పురుషుడు అని చెప్పినట్లయినది. భగవద్రామానుజుల శిష్యులలో అగ్రేసరులైన కురేశులు "వందేయ సుందర భుజం భుజగేంద్ర భోగసక్తం మహా వనగిరి ప్రణయ ప్రవీణమ్, యం తం విరదుః

తమహోష్ట గుణోజష్టం ఆకాశమౌపనిషదీషు సరస్వతీషు" అనే శ్లోకంలో ఈ అధికరణార్ధ సారాన్ని పొందుపరచడం గమనించదగినది.

**దహరాధికరణం ముగిసింది.**

## 18) ప్రమితాధికరణమ్

**ఇవి కూడా మొదటి అధ్యాయంలో మూడవ పాదంలో ఉన్నది.**

అంగుష్టమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే" అని కఠవల్లిలో అధ్యయనం చేయబడుతున్నది. బొటనవేలు పరిమితిలో ఉండే పురుషుడు ఆత్మ మధ్యలో ఉన్నాడు అని, అతడు భూతభవ్యాలకు ఈశానుడని ఇందులో చెప్పబడింది. ఈ పురుషుడు ఎవడు? ఇతడు జీవపురుషుడుగా ఉండే అవకాశం లేదు. పరమ పురుషుడుగాను ఉండే అవకాశం లేదు. ఎందుకంటే, శ్వేతాశ్వతరోపనిషత్తులో " వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ, భాగో జీవస్య విజ్ఞేయః"అని అధ్యయనం చేయబడుతున్నది అత్యంతం అనణపరిమాణుడుగా చెప్పబడ్డ జీవాత్మకు అంగుష్ఠపరిమాణత్వం సంభవించదు, విభువైన పరమ పురుషునకు కూడా అంగుష్ఠమాత్రత్వం సంభవించే అవకాశం లేదు. అయితే, శ్వేతాశ్వతరోపనిషత్తులో "ప్రాణాధిపః సంచరతి స్వకర్మభిః అంగుష్టమాత్రో రవితుల్య రూపః" అని కర్మ పరవశుడైన జీవునకు అంగుష్ఠమాత్రత్వం చెప్పబడి ఉన్నది కదా– అనే ఒక వాదం ఇక్కడ రావచ్చు. పూర్వం ఉదాహరించిన "వాలాగ్ర శతభాగ్య" అని మొదలైన శ్వేతాసశ్వతరోపనిషత్ వాక్యంలోనే ఉండే ప్రమాణానికి విరుద్ధమైన ఇది ఏ విధంగా అనుగుణమవుతుంది? అని ప్రశ్నించే అవకాశం ఉన్నది. హృదయంలో ఉన్నట్లుగా చెప్పబడినందున హృదయోపాధికంగా నిర్వహించవచ్చును– అని అంటే, ఈ నిర్వాహం పరమ పురుషుని విషయంలో అయితే పొసగుతుంది, అతడు ఉపాసకులను అనుగ్రహించడం కోసం ఆ ఉపాసకుల హృదయంలో ఉన్నందున హృదయం అంగుష్ఠపరిమాణకమని భావించి తదుపాధికంగా చెప్పవచ్చును– అని ఇక్కడ

తాత్పర్యం. ఈ విధంగా అంగుష్ఠమాత్రత్వం జీవాత్మ పరమాత్మలకు ఇద్దరికీ సరిపోతుంది– అని తేలుతున్నది. అయితే, పరమాత్మ ఇక్కడ వివక్షితం– అని నిర్ణయించడం దేనిని ఆధారంగా చేసికొని? అని అంటే, " ఈశానో భూత భవ్యస్య" అని చెప్పబడిన సర్వేశ్వరత్వం అసంకుచితంగా పరమ పురుషుని విషయంలోనే సంభవిస్తుంది "యః పృథివ్యాం తిష్ఠన్" అని మొదలైన అంతర్యామి బ్రాహ్మణ వాక్యాలలో "యః పృథివీమ్ అంతరో యమయతి" అని మొదలుగా చెప్పబడ్డ సర్వనియామకత్వం జీవునకు ఎంత మాత్రం పొసగదు కదా. అందువల్ల అంగుష్ఠమాత్ర ప్రమితుడైన పురుషుడు పరమ పురుషుడే అని సిద్ధాంతీకరింపబడినట్లు అయినది. అది సూత్రంచేత వివరింపబడుతున్నది, చూడండి.

**శబ్దాదేవ ప్రమితః–(1–3–23)**

ప్రమితః –అంగుష్ఠ పరిమాణకుడుగా చెప్పబడినవాడు పరమాత్మయే కావాలి, ఎందుకంటే, శబ్దాత్ ఏవ– ° ఈశాను భూతభవ్యస్య" అని ఉండే శబ్దంచేతనే, అంటే, వేదవాక్యంచేతనే అనేది ఇక్కడ సూత్రంలోని అర్థం. పరమ పురుషునకు అంగుష్ఠమాత్రత్వం ఏవిధంగా సంభవిస్తుంది? అనే సందేహాన్ని దీని తరవాత సూత్రం పరిహరిస్తున్నది.

**హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్–(1–3–24)**

దీని అర్థం పూర్వమే వివరింపబడినది. ఇందులో "మనుష్యాధికారత్వాత్" అని ఎందుకోసం చెప్పబడింది? అని అంటే, అంగుష్ఠశూన్యకాలైన అశ్వం, సర్పం, మొదలైన జంతువుల విషయంలో అంగుష్ఠ ప్రమితత్వం చెప్పడానికి వీలు కాదు కదా! అనే సందేహం కలుగగా " మనుష్యాధికారత్వాత్" – ఉపాసకుల కోసం ఆ ఉపాసకుల హృదయంలో ఉన్నందువల్ల కదా అంగుష్ఠ ప్రమితత్వం ఉపపాదింపబడింది. ఆ ఉపాసనకు యోగ్యత కలిగినవారు మనుష్యులు. వారికి అంగష్టశాలిత్వం నిర్వివాదం– అని తెలియజేయడం సూత్రకారుల అభిప్రాయం.

ఇక్కడ, పైన ప్రస్తావింపబడిన విషయ వాక్యంలో "అంగుష్ఠః" అని ఉన్నది. " శంభురీశః పశుపతిః శివః శూలీ మహేశ్వరః, ఈశ్వరః సర్వ ఈశానః" అని మొదలుగా కోశవాక్యాలలో ఈశాన శబ్దం పశుపతి అనే దేవతా విశేషంలో రూఢం అని మనం తెలిసికొంటున్నాము. ఈ విధంగా " అంగుష్ఠమాత్రః పురుషః " అని చెప్పబడ్డ పురుషుడు నారాయణుడు కాడు, పశుపతి అవుతున్నాడు—అనే ఒక వాదం వస్తుంది. ఇక్కడ తత్త్వాన్ని తెలుపుతున్నాము, వినండి. "ఈశానః" అని మాత్రమే ఇక్కడ లేదు. "భూత భవ్యస్య ఈశానః" అని ఉన్నది. దానివల్ల సర్వేశ్వరత్వం తెలుపబడింది. ఇంతకుముందు ప్రస్తావించిన కోశవచనంలో ఈశాన పదంవలె ఈశ్వర పదం కూడా శంభువిషయంలో రూఢమని తెలియ వస్తున్నది. దానిని పురస్కరించుకొని, "సర్వేశ్వరః" అని ప్రయోగింపబడిన చోట్ల అంతట పశుపతిని అర్థంగా గ్రహించే అవకాశం లేదు కదా. అంతేకాక, విష్ణు సహస్రనామ స్తోత్రంలో "ఈశానః" అనే ఈ శబ్దం విష్ణునామాలలో ఒకటిగా పఠింపబడుతున్నది. ప్రస్తుత విషయవాక్యంలో "భూత భవ్యస్య ఈశానః "అని స్పష్టంగా ఉన్నందున, సర్వేశ్వరుడైన నారాయణుడే శ్రుతివాక్యం చేత వివక్షితుడనేది నిస్సందేహం.

**ప్రమితాధికరణం ముగిసింది.**

## 19) దేవతాధికరణమ్

**ఈ అధికరణం కూడా మొదటి అధ్యాయం మూడవ పాదంలో ఉన్నది.**

ఇంతకుముందు "హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్" అనే సూత్రంలో పరమపురుషుని ఉపాసించడంలో మానవులకు మాత్రమే అధికారం ఉన్నట్లు తెలుపబడింది. దీనికి తరువాత, అది, దేవతలకు కూడా ఉన్నదని చెప్పడం కోసం ఈ అధికరణం ప్రస్తావింపబడుతున్నది.

**తదుపర్యపి బాదరాయణః సంభవాత్**–(1–3–25)

తత్– ఆ పరమాత్మోపాసనం అనేది, తదుపర్యపి– మానవుల కంటే గొప్పవారైన దేవతల విషయంలో కూడా సంభవించడంలో లోటు లేదు, ఎందుకంటే, సంభవాత్– ఎవడు అర్థియో, ఎవడు సమర్థుడో, అతడు అధికారి– అనేది నియతం కనుక, దేవతలకు ఉపాసనలో ఆర్తిత్వం, సామర్థ్యం సంభవిస్తుంది కనుక. (ఇతి బాదరాయణో మనుతే– ఈ విధంగా బాథదరాయణ మహర్షి అభిప్రాయపడుతున్నాడు) అనేది సూత్రంలో అని అర్థం– అని తెలియాలి.

ఒక పనిలో ఒకడు యోగ్యతను కలవాడు కావాలి అంటే, రెండు విషయాలు ఉండాలి. "ఇది నాకు కావాలి "అనే అపేక్ష మొదటిది. ఆ పనిని చేయడానికి తగిన శక్తినికలిగి ఉండడం రెండవది. ఈ రెండే అర్థిత్వ, సామర్థ్యాలు అనబడతాయి ఇంద్రుడు మొదలైన దేవతలు కూడా సంసారి కాలైన తాపత్రయాలకు బాధపడడం, వాటిని తొలగించుకోవడం కోసం వారు ఉపాయాలను అన్వేషించడం అనేవి వేదాలలో, ఇతిహాస పురాణాదులలో కనబడుతున్నాయి. అందుచేత, వారికి ఉపాసనంలో అధికారం ఉన్నది– అని చెప్పడంలో, అంగీకరించడంలో ఈ కొరత లేదు– అనేది ఈ అధికరణంలోని విషయం.

ఇక్కడ తోచే పూర్వపక్షవాదం ఎటువంటిది అంటే, దేవతలకు అర్థిత్వం సామర్థ్యం ఉన్నదని అంగీకరించాలి అంటే, వారికి దేహం ఉన్నదని ముఖ్యంగా చెప్పి తీరాలి. వివేకం, విమోకం మొదలైన సాధన సప్తకంతో అనుగృహితమైన పరబ్రహ్మోపాసనంశ అనుష్ఠింపబడాలి అంటే, శరీరం లేకపోతే అది సాధ్యం కాదు వారికి శరీరం ఉన్నదని సాధించడానికి ఏ ప్రమాణము కనిపించదు. అందుచేత, వారికి అర్థిత్వం, సామర్థ్యం అనేవి సంభవించే అవకాశం లేదు– అనే ఇది పూర్వపక్ష వాదం.

ఇక, దీనిని కాదనే సిద్ధాంత వాదం " తదుపర్యపి" అనే సూత్రంలో ప్రస్తావింపబడుతున్నది. " పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ" అని మొదలయ్యే

శ్రుతి వాక్యంలో అపరిమితజ్ఞాన శక్తియుక్తుడుగా చెప్పబడే పరమ పురుషుని విషయంలో వారికి అర్థిత్వం సంభవించడంలో ఏ లోటు లేదు. దేవతలకు సామర్థ్యంలో కూడా లోటు లేదు. పట్టుతరమైన దేహేంద్రియాలు దేవతలకు ఉన్నాయి అనే విషయాన్ని పలు శాస్త్రాలలో మనం తెలుసుకుంటున్నాము కూడా. ఉపనిషత్తులలో సృష్టి ప్రకరణాలలోనూ ఉపాసన ప్రకరణాలలోనూ ఇది స్పష్టంగానే కనబడుతున్నది. సృష్టి వాక్యాలన్నిటిలోనూ దేవతిర్యక్ మనుష్య స్థావర రూపాలుగా నాలుగు విధాలుగా ఉండే సృష్టి చేయబడుతున్నట్లు వేదంలో చెప్పబడుతున్నది. ఈ దేవాదిరూపంగా ఉండే భేదం ఆ యా జీవులు చేసుకున్న కర్మలకు అనుగుణంగా బ్రహ్మలోకం మొదలైన 14 లోకాలలో సంభవించే ఫలాలను అనుభవించడం కోసం యోగ్యమైన దేహేంద్రియది సంబంధాన్ని కలిగినదిగా ఉన్నది. ఆత్మలు సహజంగానే దేవాది రూపాలలో ఉన్నవారు కారు. శరీరభేదం చేతనే ఈ దేవమనుష్యాదివ్యపదేశం సంభవిస్తున్నది. వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ, ఇతిహాస పురాణాదులలోను పలువురు దేవతలను గూర్చి పలు విధాలైన కథలను వింటున్నాము. "వజ్రహస్తః పురందరః" అని, " తేనేంద్రో వజ్ర ఉదయచ్ఛత్" అని, " తౌ హ ద్వాత్రింశతం వర్షాణి బ్రహ్మచర్య మూషతుః, తౌ హ ప్రజాపతిరువాచ" అని మొదలైన వందలాది వేలాది వాక్యాలతో దేవతలకు శరీరం ఉన్నదనే విషయం, ఇంద్రియాది పాటవం ఉన్నదనే విషయం మనకు స్పష్టంగా తెలుస్తున్నది.

ఇంతే కాక, ఇంద్రుడు, వాయువు, అర్యముడు, ప్రజాపతి మొదలైన పలువురు దేవతలను ఉద్దేశించి కర్మేష్టులు, విధులు, ఆ ఇష్టుల వల్ల ఫలప్రాప్తి కర్మకాండలలో నిండుగా చెప్పబడుతున్నందున, వారికి శరీరం లేకుండా ఇది అంతా అసత్యమైన వాదంగా కావలసి వస్తుంది కనుక, దేవతలకు శరీరం లేదు అని సాధించడమే వీలుకాదు. బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలకు, అసురులకు, ఇంకా మిగిలినవారికి దేహేంద్రియాలు, స్వభావ భేదాలు, స్థాన విశేషాలు, భోగ విశేషాలు, కృత్య విశేషాలు —అనే ఇవి స్పష్టంగానే చెప్పబడుతున్నందున, వారికి శరీర సంబంధం నిర్వివాదంగా

ఉన్నది అని అంగీకరించడంలో ఏ లోటు లేదు. కనుక, అర్థిత్వం, సామర్థ్యం మానవులకు వలే దేవతలకు కూడా ఉన్నదని అనడంలో అడ్డు లేనే లేదు. అందుచేత, ఉపాసనలో అధికారం మానవులకు మాత్రమే కాదు, దేవతలకు కూడా ఉన్నది —అని స్పష్టమవుతున్నది.

**దేవతాధికరణం ముగిసింది**

## 20)అపశుద్రాధికరణమ్

**ఇది కూడా మొదటి అధ్యాయం మూడవ పాదంలోనే ఉన్నది.**

ఈ అధికరణానికి ముందు అధికరణంలో దేవతాధికరణ ప్రమేయం నిరూపింపబడింది. పరమ పురుషుని ఉపాసించడంలో మానవులకు వలే, దేవతలకు కూడా అధికారం ఉన్నది —అనే విచారంలో ఆ యోగ్యత దేవతలకు న్నదని దేవతాధికరణంలో నిరూపింపబడింది. ఒక కార్యంలో ఒకడు యోగ్యతను కలవాడు కావాలి అంటే, ఇది మనకు కావాలి అనే అపేక్ష, దానిని సాధించడానికి తగిన శక్తి —అనే ఈ రెండు ఉండాలి. వీటినే అర్థిత్వ సామర్థ్యాలు అని అంటారు. ఇవి మనుషులకు వలే దేవతలకు ఉన్నవి కనుక, వారికి కూడా పరబ్రహ్మను ఉపాసించడంలో యోగ్యత ఏ అడ్డు లేకుండా ఉన్నది— అని ఆ అధికరణలో నిరూపింపబడింది. ఆ అర్థిత్వ సామర్థ్యాలు శూద్రులకు కూడా సంభవించడంలో లోటు లేదు కనుక, బ్రహ్మవిద్యలో అతనికి కూడా అధికారం ఉన్నది కదా! —అనే సందేహం రాగా, ఆ విధంగా లేదు —అని స్థాపించడం కోసం ఈ అధికరణం ప్రస్తావింపబడింది. ఏడు సూత్రాలను కలిగినది, ఈ అధికరణం. అందులో మొదటి సూత్రం ఏమంటే—

**శుగస్య తదనాదరత్వశ్రవణాత్ తదాద్రవణాత్ సూచ్యతే హి—(1—3—33)**

శూద్రునకు వేదంలో అధికారం లేదు— అనే విషయం సిద్ధం. ఇంతేకాక, యజుర్వేదంలో ఏడవకాండం మొదటి ప్రశ్న మూడవ వాక్యంలో "తస్మాత్ శుద్రో యజ్ఞే

అనావక్లుప్తః" అని శూద్రునకు యజ్ఞాధికారం లేదు– అని స్పష్టంగానే నిరాకరింపబడింది. ఈ విధంగా ఉండగా, శూద్రునకు బ్రహ్మవిద్యలో అధికారం ఉన్నదా? లేదా? అని విచారానికి ప్రసక్తియే లేదే– అనే ఇక్కడ భావించవచ్చు. వినండి. అగ్నివిద్య సాధ్యమైన కర్మలలో శూద్రులకు అధికారం లేకపోయినప్పటికీ, పరబ్రహ్మోపాసనమనేది మనోవృత్తి మాత్రమే కనుక, అందులో అధికారం లేకపోవడం అనేది లేదు. ఉపాసనకు శాస్త్రోక్తాలైన కర్మలు అపేక్షితాలు అనేది ఒప్పుకుంటాము. ఆయా వర్ణాశ్రమాలకు తగిన కర్మలు అపేక్షితాలు కనుక, శూద్రునకు తన వర్ణానికి తగినట్లుగా, తన ముందు వర్ణాలకు చెందిన వారికి చేసే సేవయే విధ్యుక్త కర్మ కనుక, ఆ కర్మానుష్ఠానంలో లోటు లేదు కదా. ఇతనికి వేదాధ్యయనం, వేదాంత శ్రవణం అనేవి లేకపోయినప్పటికీ, ఇతిహాస పురాణ శ్రవణం అనేది ఏ లోటు లేనిది కదా. " శ్రావయేత్ చతురో వర్ణాన్ కృత్వా బ్రాహ్మణ మగ్రతః" అనే ప్రమాణం ఉన్నది. శూద్రులైన విదురాదులు బ్రహ్మ నిష్ఠులు అనే విషయాన్ని ఇతిహాస పురాణాలలో చూస్తున్నాము. వీటికి అన్నిటికి మించి, ఛాందోగ్యంలోని సంవర్గ విద్యలో శూద్రుడైన జానశ్రుతికి బ్రహ్మవిద్యలో అధికారం కనబడుతున్నది. ఏ విధంగా అంటే, శుశ్రూషువుగా వచ్చిన జానశ్రుతిని ఆచార్యుడైన రైక్వుడు "శూద్ర" అని సంబోధించి, అతనికి బ్రహ్మ విద్యను ఉపదేశించినట్లు ఆ వృత్తాంతం వల్ల తెలుస్తున్నది. "ఆజహారేమాచ్ఛూద్ర! అనేనైవ ముఖేన అలాపయిష్యథాః" అనే రైక్వుని వాక్యంలో జ్ఞానశ్రుతి అనేవాడు శూద్రుడుగా సంబోధింపబడి, అతనికి బ్రహ్మవిద్యోపదేశం చేయబడినట్లు కనిపిస్తున్నది. ఈ విధంగా శూద్రునకు బ్రహ్మవిద్యాధికారం ఉన్నది అనే పూర్వపక్షం ప్రస్తుతమైనది. అయితే, శూద్రునకు అధికారం లేదు –అని నిరాకరింపబడుతున్నది, ఈ అధికరణంలో.

శూద్రునకు బ్రహ్మవిద్యాధికారం సంభవించదు, ఎందుకంటే, యోగ్యతకు తగిన అర్థిత్వసామర్థ్యాలు రెండిటిలో, సామర్థ్యం అనేది అతనికి లేదు కనుక, అర్థిత్వం ఉంటే ఉండవచ్చు. దానివల్ల ఏ ప్రయోజనం లేదు. సామర్థ్యం లేదు– అని అన్నప్పుడే యోగ్యత లేదు అనేది సిద్ధం. ఇతిహాస పురాణ శ్రవణ యోగ్యత ఉన్నది కదా– అని

అంటే, దానివల్ల పాపక్షయం మొదలైన ఫలాలు సిద్ధిస్తాయి తప్ప, ఉపాసనం సిద్ధించదు—అనేది నిశ్చయం. సంవర్గ విద్యలో శుశ్రూషువై వచ్చిన జ్ఞానశ్రుతిని ఆచార్యుడైన రైక్వుడు "శూద్ర! " అనే సంబోధించి, బ్రహ్మవిద్యోపదేశం చేశాడు అనేదానిలోని తత్త్వం వినండి. " శుగస్య తదనాదరత్వశ్రవణాత్ " అని మొదలైన ప్రకృత సూత్రంలో ఆ తత్త్వమే చెప్పబడింది. ఇక్కడ "శూద్ర "అనే సంబోధన అనేది "శోకాన్ని పొందినవాడా! " అనే అరర్థాన్ని కలిగినది తప్ప, "శూద్రజాతీయుడా! " అనే అర్థాన్ని కలిగినది కాదు —అనే విషయం సూత్రంలోని అర్థం ద్వారా ఏర్పడే విషయం. జానశ్రుతి కథను తెలిసి కొంటే ఇది విశదమవుతుంది.

ఆ వృత్తాంతం ఏమి? అంటే, క్షత్రియుడైన జానశ్రుతి అనేవాడు అన్నదానాలను, ద్రవ్య దానాలను విశేషంగా చేస్తూ, పరమ ధార్మికుడై ఉండేవాడు. అయితే, అతనికి బ్రహ్మజ్ఞానం మాత్రం లేకుండా ఉన్నది. అతడు చేసిన పలు ధర్మాల చేత చాలా ఆనందాన్ని పొందిన మహాత్ములు ఇద్దరు ఆ జానశ్రుతికి బ్రహ్మజ్ఞానంలో రుచిని కలిగించడం కోసం రెండు హంసల రూపాన్ని ధరించి, రాత్రివేళ ఆకాశంలో జానశ్రుతికి సమీపంలో ఎగురుతూ, సంచరిస్తూ ఉన్నారు అందులో ఒక హంస ఇంకొక హంసను చూచి ఈ విధంగా ఉన్నది "అయ్యా! భల్లాక్షా! ఇక్కడ జానశ్రుతి అనే మహానుభావుని తేజస్సు ఆకాశమంతా వ్యాపించి ఉన్నది. అందులో నీవు దగ్ధం కాకుండా ఉండేటట్లు నిన్న నీవు రక్షించుకో "అని అన్నది. ఈ విధంగా జానశ్రుతిని ప్రశంసించి పలికిన మాటలను ను విన్న ఇంకొక హంస "అయ్యా ఈ జానశ్రుతిని బ్రహ్మవేత్తలలో గొప్పవాడైన రైక్వునిగా భావిస్తున్నావా? ఏమి! ఇతడు మహా ధార్మికుడై ఉన్నప్పటికీ, బ్రహ్మజ్ఞాని కానందువల్ల మహా జ్ఞాని అయిన రైక్వునితో సమానం అవుతాడా ?"అని హేళనగా పలికింది. ఈ విధంగా తనను తక్కువ చేస్తూ మాట్లాడిన మాటలను జ్ఞానశ్రుతి విని, తనకు బ్రహ్మ జ్ఞానం లేనందు వల్ల ఈ విధంగా తాను గర్హణను పొందడం జరిగిందని మనసులో చాలా బాధపడి, రైక్వుని దగ్గరకుబ్రహ్మజ్ఞానం పొందడం కోసం అతడు ఉండే చోటును తెలిసికొని రమ్మని తన సేవకులలో ఒకరిని పంపాడు. అతడు తెలుసుకొని

వచ్చి తనకు తెలియజేసిన తర్వాత, తానే స్వయంగా రైక్వుని దగ్గరకు వెళ్లి, తన శక్తికి తగిన విధంగా గురుదక్షిణను సమర్పించి, తనకు బ్రహ్మవిద్యోపదేశం చేయమని అడిగాడు. అతనికి రైక్వుడు విద్యోపదేశం చేయవలసిన సమయంలో, తన యోగ మహిమతో ఇంతకు ముందు జరిగిన సంగతిని తెలుసుకొని, ఇతడు హంస పలికి అవహేళన వాక్యాలను విని శోకాన్ని పొంది, తన దగ్గరకు పరిగెత్తుకొని వచ్చాడనే సంగతిని గ్రహించి, బ్రహ్మవిద్యోపదేశం పొందడానికి ముఖ్యమైన నిర్వేదం ఇతనికి ఉన్నది కనుక, ఇతడు ఉపదేశ పాత్రుడే –అని నిశ్చయించుకొని, శూద్ర! అని సంబోధించడం " శోకం పొందినవాడా! " అనే అర్థాన్ని కలిగినది అని ఇక్కడ మనం నిశ్చయించుకోవడంలో ఏ అడ్డు లేదు. " శోచతీతి శూద్రః" అనే వ్యుత్పత్తిని ఇక్కడ గమనించాలి.

దీనికి తరువాత ఒక సందేహం ఇక్కడ కలుగుతుంది. " యోగాత్ రూఢిః బలీయసీ" అనే న్యాయం వల్ల శూద్రపదానికి చతుర్ధ జాతిలో రూఢఢి ఉన్నందున అది ప్రబలం కదా! – అనేది ఆ శంక. " క్షత్రియత్వేకదేచ్చ" అని మొదలైన తరువాత ఉండే సూత్రాలలో జ్ఞానసశ్రుతికి క్షత్రియ జాతిత్వం స్పష్టంగా కనబడుతున్నది–అని విరూపింపబడడాన్ని పురస్కరించుకొని సమాధానం చెప్పుకోవాలి.

సూత్రంలోని అర్థం ఏమంటే, " శుక్ అస్య సూచ్యతే హి" – ఈ జానశ్రుతికి అనే క్షత్రియునకు శోకం ఉండడం సూచింపబడుతున్నది, దేనివల్ల అంటే, తత్ అనాదరశ్రవణాత్– హంసల నిందావాక్యాలను విన్నందున, తదా ఆద్రవణాత్– అప్పుడే రైక్వుని దగ్గరకు వేగంగా వెళ్లినందున –అని అర్థం. అందువల్ల, శూద్రునకు బ్రహ్మవిద్యాధికారం లేదు –అనే అర్థం పర్యవసిస్తున్నది.

**అపశూద్రాధికరణం ముగిసింది**

**శ్రీభాష్య సారామృతంలోని మొదటి అధ్యాయంలో మూడవ పాదం ముగిసింది.**

-----***-----

## 21)వాక్యాన్వయాధికరణమ్

**ఈ అధికరణం మొదటి అధ్యాయం నాలుగవ పాదంలో ఉన్నది.**

బృహదారణ్యకంలో మైత్రేయీబ్రాహ్మణ మనేది ఒక భాగం. అందులో యాజ్ఞవల్క్య ని చూచి మైత్రి అనే ఆమె అమృతతలో ఉపాయాన్ని చెప్పమని అడుగునప్పుడు ఆ మహర్షి "న వా అరే పత్యుః కామాయ ప్రియో భవతి, అత్మనస్తు కామాయ ప్రియో భవతి" అని ఆరంభించి "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" అనే పర్యంతంగా ఉపదేశించాడు. ఇందులో ఆత్మా అనే పదం కర్మ ఫలావాలను అనుభవించే జీవాత్మను చెప్పదు, " తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి (పురుష సూక్తం) అని మొదలైన వాక్యాలలో చెప్పబడే ఆ పరమాత్మనే చెబుతున్నది, లేకపోతే, పైన ఉండే వాక్యం పొసగదు, అది పొసగడం కోసం పరమాత్మ పరంగానే గ్రహించాలి –అని ఈ అధికరణలోని ప్రమేయం నిశ్చయించి పలుకుతున్నది. ఈ ఆత్మకు సత్యకామత్వ సత్య సంకల్పత్వాదులను తరువాత చెప్పినందువల్ల, అది పరమాత్మకే ఉపపన్నంగా కూడినది అవుతుంది కనుక– అని చెప్పినట్లయిది. పరమాత్మ వివక్షితమైతే, జీవాత్మవాచకమైన అత్మ అనే శబ్దాన్ని ఉపయోగించడం ఎందుకు పరమాత్మ అనే ప్రయోగించకూడదు అనే ఈ ప్రశ్నకు సూత్రకారులచే పైన మూడు సూత్రాలతో సమాధానం తెలుపబడుతున్నది. క్రమంగా అశ్మరథ్యమతం, ఔడులోమి మతం, కాశకృత్స్నమతం– అని ముగ్గురి మతాలు చూపబడ్డాయి.

1) జీవాత్మ, పరమాత్మలకు కార్యకారణ భావం శ్రుతిలో చెప్పబడినందున, దానివల్ల వారికి అభేదం ఏర్పడుతున్నది, దానిని తెలుపడానికి ఐక్యోక్తి ఉన్నది– అని ఆశ్మరథ్యమతం.

2) ఇక, ఔడులోమి మతం ఏమంటే –పూర్వం తెలుపబడిన ఆశ్మరథ్యమతంలో జీవాత్మకు పరమాత్మ నుండి ఉత్పత్తి గ్రహించడం చేత " న జాయతే న మ్రియతే వా విపశ్చిత్" అని మొదలైన ప్రమాణాలతో అది విరోధిస్తున్నందున, ఇంకా అనేక దోషాల

ప్రసంగం వల్ల, ఆశ్మరథ్యమతం సాధువు కాదు అని బావించిన ఔడులోమి అనేవారు ముక్తి దశలో జీవాత్మకు పరమాత్మతో అభేదం శ్రుతిసిద్ధం కనుక, ముక్తిదశలో భవిష్యత్తు అయిన జీవాత్మ పరమాత్మల అభేదాన్ని అవలంబించి ఐక్యం చెప్పబడింది— అని వారు అర్థాన్ని నిర్వహించారు.

3) ఇక మూడవది కాశకృత్స్నమతం. పూర్వం వివరించిన ఔడులోమి మతం మోక్షం వరకు జీవాత్మ పరమాత్మలకు భేదం ఉన్నదని, ముక్తిదశలో అభేదం అని నిర్వహింపబడే ఈ క్రమం ప్రమాణ విరుద్ధం. వేరు వేరు వస్తువులు ఒకదానితో ఇంకొకటి చేరుతాయి తప్ప, ఐక్యాన్ని పొందవు కనుక, పరమాత్మ జీవాత్మ లోపల అంతరాత్మగా ఉండడంచేత జీవాత్మకు పరమాత్మ శరీరత్వం ప్రమాణ సిద్ధం కనుక, ప్రకృతంలో జీవాత్మ వాచి అయిన ఆత్మ శబ్దం పరమాత్మ వాచి అవుతున్నది— అనే అర్థాన్ని వారు నిర్వహించారు.

ఈ విధంగా వరుసగా మూడు మతాలను ఉదాహరించిన సూత్రకారులు తరువాత నాలుగవది అయిన మతాన్ని దేనిని ప్రస్తావించనందున కాశకృత్స్న మతమే సూత్రకారులకు అభిమతం అని నిస్సందేహంగా నిర్ణయింపబడుతున్నది. ఇది విశిష్టాద్వైతానికి చాలా అనుగుణమైనది. అద్వైతులు కూడా కాశకృత్స్నమతమే సూత్రధారుల మతమని అంగీకరించి, " అవస్థితేః" అనే పదానికి "పరమాత్మగా ఉన్నందున" అనే అర్థాన్ని చెప్పారు. ప్రకృతంలో ఐక్యాన్ని పొసగేటట్టు చేయాలి. ఈ విధంగా అర్థాన్ని చెప్పినప్పటికీ ఎంత మాత్రం అర్థం పొసగడం లేదు కదా. కాశకృత్స్నులు శరీరాత్మ భావాన్ని అవలంబించే ఐక్యాన్ని పొసగేటట్లు చేశారు— అని ఎందుకు ఒప్పుకోవాలి? అని అంటారు, వారు. ఇక్కడ ముఖ్యంగా మనం చెప్పే విషయాన్ని బాగా గుర్తించాలి. "అవస్థితేః" అని శబ్దం అనేది " భూతలే ఘటః అవతిష్ఠతే, ప్రాసాదే దేవ దత్తః అవతిష్ఠతే" అని మొదలైన వ్యవహారాలలోవలె ఒక వస్తువు ఇంకొక వస్తువులో ఉండడాన్నే చెప్పాలి. "పృథివ్యాం తిష్ఠన్, అప్సు తిష్ఠన్, తేజసి తిష్ఠన్, వాయౌ తిష్ఠన్, ఆకాశే తిష్ఠన్, ఆత్మని తిష్ఠన్" అని మొదలైన ఉపనిషత్ వాక్యాలలో

పలుమార్లు కనిపించే స్థాధాతు ప్రయోగాన్ని దృష్టిలో పెట్టుకొనే "అవస్థితేః" అని సౌత్రప్రయోగం ఉన్నదనే విషయాన్ని ప్రామాణికులు గ్రహిస్తారు. "పరమాత్మయే కదా జీవాత్మగా ఉన్నది"– అనే అర్థాన్ని ఆరోపించినా, అది నిలువదు.

**వాక్యాన్వయాధికరణం పూర్తి అయింది**

## 22) ప్రకృత్యకరణమ్

**ఇది మొదటి అధ్యాయం నాల్గవ పాదంలో ఉన్నది.**

ఇంతక ముందు గడిచిన వాక్యాన్వయాధికరణంలో రెండవది అయిన " ప్రతిజ్ఞాసిద్ధేః లింగం ఆశ్మరథ్యః" అనే సూత్రంలో ఉండే ప్రతిజ్ఞాపదంచేత "ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ" గదా ప్రస్తావింపబడింది. దానివల్ల జగత్తుకు ఉపాదాన కారణం పరమ పురుషుడే అని తెలుస్తున్నది. అయితే, అది పొసగదు– అనే ఒక పూర్వపక్షం ప్రస్తుతం కాగా, దానిని నిరాకరించి, ఉపాదాన కారణం పరమ పురుషుడే అని స్థాపించడం కోసం ఈ అధికరణం అవతరించింది.

**ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టంతానుపరోధాత్ –(1–4–23)**

ప్రకృతి అనే పదం ఉపాదాన కారణవాచకం. "చ" అని అన్నందున నిమిత్త కారణత్వం స్వీకరింపబడుతున్నది. పరబ్రహ్మం జగత్తుకు నిమిత్త కారణం అని అనడంలో ఆక్షేపం లేనివానిని గూర్చి చెప్పేది అయినందున, నిమిత్త కారణమై ఉన్నట్లే, ఉపాదాన కారణంగా కూడా పరబ్రహ్మం అవుతున్నదని చెప్పబడినట్లయినది. దీనికి "ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" అని అంటూ రెండు హేతువులు ఇక్కడ చెప్పబడుతున్నాయి. ప్రతిజ్ఞ అంటే– ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ. దృష్టాంతం అంటే– మృత్పిండ ఘటాది నిదర్శనం. ఈ విధంగా ఈ రెండు పొసగాలి అంటే, పరబ్రహ్మకు ఉపాదాన కారణత్వం ఉండి తీరాలి. ఉపాదాన కారణత్వం అంగీకరింపబడితేనే ప్రతిజ్ఞ దృష్టాంతాలు పొసగుతాయి– అనేది సిద్ధాంతంలోని అర్థం. ఒకే మన్ను మొదట ముద్ద అనే అవస్థను పొంది, తరువాత కుండ అనే అవస్థను పొందడం

మనం చూస్తున్నాము. ఇందులో ముందు అవస్థతో కూడిన ద్రవ్యం ఉపాదాన కారణమని, తరువాత అవస్థతో కూడిన ద్రవ్యం ఉపాదేయమని వ్యవహరింపబడుతున్నది. ఇక్కడ ముందు అవస్థ, తరువాత అవస్థ– అనే రెండు చెప్పబడిన రెండు అవస్థలను కలిగిన ద్రవ్యం ఒకటే కనుక, ఉపాదాన వస్తువును తెలియడం ఉపాదేయ వస్తువును తెలియడంగా అవుతున్నందున, ఉపాదానం తెలిస్తే ఉపాదేయం తెలిసినట్లు అవుతున్నది. ఆ విధంగానే, ప్రకృతంలో "పరబ్రహ్మం తెలియబడితే, జగత్తు అంతా తెలియబడినట్లు అవుతున్నది "అని "యేనాశ్రుతం శ్రతం భవతి" అని మొదలైన శ్రుతుల చేత చెప్పబడుతున్నందున, బ్రహ్మం జగత్తుకు ఉపాదానం అని తెలియబడినట్లు అవుతున్నది.

ఇప్పుడు దీనికి తరువాత ఒక ప్రశ్న వస్తుంది. కృష్ణాంతంలో మృత్తు అనే ఒకే ద్రవ్యానికి పిండత్వం, ఘటత్వం అనే రెండు అవస్థలు కలుగుతున్నందున, పిండజ్ఞానంతో ఘటజ్ఞానం కలగడం అనేది పొసగుతుంది. దార్ ష్టాంతికంలో, జగత్తు, బ్రహ్మ అనేవి ఒకటి కాకుండా, వేరు వేరు అయిన వస్తువులు అయినందున, బ్రహ్మజ్ఞానం ప్రపంచ జ్ఞానం ఒకటిగా కాదు. కనుక, బ్రహ్మజ్ఞానంతో ప్రపంచ జ్ఞానం సంభవించడం అరుదు. ఉపాదాన ఉపాదేయ భావం సంభవించడం అరుదు. ఎందుకంటే, బ్రహ్మం నిర్వికారమనేది నిర్వివాదం. వికారం, అవస్థాపత్తి పర్యాయం కనుక, వికారం సంభవించదు అని అన్నపుడే ఉపాదానత్వం కూడా సంభవించదు –అనేది స్పష్టమవుతుంది కదా! అందుచేత, ఈ ప్రశ్నకు సమాధానం ఏమి? అని అంటే, వినండి.

బ్రహ్మజ్ఞానంతో ప్రపంచ జ్ఞానం కలగడం కలుగుతున్నదని శ్రుతి చెప్పినందున, వాటికి ఉపాదాన– ఉపాదేయ భావం లేకుండా అది సంభవించదు కనుక, అది తప్పక అంగీకరించదగినది. వికార శూన్యమైన బ్రహ్మకు వికార రూపమైన అవస్థ సాక్షాత్తుగా సంభవించేది కాదు. చేతనా చేతనాత్మక ప్రపంచం– అనే శరీరం ద్వారా వికారాశ్రయత్వం సంభవిస్తున్నది– అని శ్రుతి అభిప్రాయం సిద్ధిస్తున్నది. దీనిని మన ఆచార్యులు చక్కగా ఉపపాదించారు.

శ్రీ పిళ్ళై లోకాచార్యులవారు అనుగ్రహించిన తత్త్వత్రయం అనే గ్రంథంలోని ఈశ్వర ప్రకరణంలో " ఇవన్ తానే జగత్తాయ్ పరిణమిక్కైయాలే ఉపాదానము మా ఇరుక్కుమ్. స్వరూపత్తుక్కు వికారమ్ ఇల్లామైయాలే, ఆనాల్ పరిణామమ్ ఉండాంబడిఎన్? ఎన్నిల్, విశిష్ట విశేషణ సద్వారకమాక. ఒరు శిలందిక్కు ఉండాన స్వభావం సర్వశక్తికి క్కూడాదొ*ళ్ళి*యాదిఱే" ( భగవంతుడే స్వయంగా జగత్తుగా పరిణమిస్తున్నందున ఉపాదాన కారణమై ఉన్నాడు. స్వరూపానికి వికారం లేనందు వల్ల, అయితే, పరిణామం ఏ విధంగా ఏర్పడుతున్నది? అని అంటే, విశిష్టుడైన భగవంతునిలో ఉండే విశేషమైన శరీరం ద్వారా ఈ పరిణామం ఏర్పడుతున్నది. ఒక సాలెపురుగుకు ఉండే స్వభావం సర్వశక్తి అయిన భగవంతునకు ఉండకుండా ఉండదు కదా) అని అనుగ్రహించిన చోట మణవాళ మహామునుల వ్యాఖ్యానంలో విశదంగా గమనించవచ్చు.

శ్రీ పరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో " కార్యేఽనంతే స్వతను ముఖతః త్వముపాదాన మాహుః, సా తే శక్తిః సుకర మితరచ్చేతి వేలాం విలంఘ్య, ఇచ్ఛాయావత్ విహరతి సదా రంగరాజానపేక్షా సైవైశానాదతిశయకరీ సోర్ణనాభౌ విభావ్యా"(31) అనే శ్లోకంలో దీనిని అంతటిని సారంగా అనుగ్రహించారు. ఆ స్తోత్రానికి మేము రచించిన వ్యాఖ్యానంలో వివరాన్ని గమనించవచ్చు.

**ప్రకృత్యకరణమ్ ముగిసింది.**

**శ్రీభాష్య సారామృతంలోని మొదటి అధ్యాయంలో నాల్గవ పాదం ముగిసింది.**

**శ్రీభాష్య సారామృతంలో మొదటి అధ్యాయం ముగిసింది.**

**-----***-----**

**మధ్యలో దాసుడు చేసే విజ్ఞాపనం ఒకటి (25—1—75).**

"శ్రీ భాష్య సారామృతమ్" అనే ఈ గ్రంథాన్ని పూర్తి చేయడానికి సాధ్యం కానట్లుగా దాసుని ఆరోగ్యంలో కొరతకు ఏర్పడినందున, రెండు, మూడు, నాలుగు అధ్యాయాలలో ముఖ్యమైన కొన్ని అధికరణాల సారాన్ని మాత్రం రచించి, ఇప్పుడు ఈ గ్రంథాన్ని పూర్తి చేస్తున్నాను. భగవద్భాగవత కృపా కటాక్ష విశేషం చేత ఆరోగ్యం ఏర్పడితే, ఆరంభించిన రీతిలోనే ఈ గ్రంథం పూర్తి అవుతుంది.

ఇప్పుడు ఇకపై వివరింపబడే అధికరణాలు ఏమిటంటే–

రెండవ అధ్యాయం మొదటి పాదంలో–

కృత్స్నప్రసక్త్యధికరణం, ఆ అధ్యాయంలోనే ప్రయోజనవత్త్వాధికరణం.

అధ్యాయం రెండవ పాదంలో–

సర్వథానుపత్త్యధికరణం,

మూడవ అధ్యాయం రెండవ పాదంలో–

ఉభయ లింగాధికరణం, అందులోనే, సర్వాన్నానుమత్యధికరణమ్

నాలుగవ అధ్యాయం మొదటి పాదంలో

ఆవృత్త్యధికరణం, అందులోనే, తదధిగమాధికరణం,

రెండవ అధ్యాయంలో–

నిశాధికరణం, అందులోనే, దక్షిణాయనాధికరణమ్,

చివరిగా, సారంగా చరమ సూత్ర వివరణంతో ఈ గ్రంథం ముగుస్తుంది.

## 1)కృత్స్నప్రసక్త్యధికరణమ్

శారీరక మీమాంసలో (శ్రీభాష్యంలో) రెండవ అధ్యాయం మొదటి పాదంలో ఉండే కృత్స్నప్రసక్త్యధికరణంలో పూర్వపక్ష సూత్రం ప్రత్యేకంగాను, సిద్ధాంత సూత్రం ప్రత్యేకంగాను ఉన్నాయి. స్మృత్యధికరణంలో "స్మృత్యనవకాశ" ఇత్యాదిగా ఉండే ఒక సూత్రంలోనే పూర్వపక్ష సిద్ధాంతాలు ఏర్పడి ఉండడం వలె కాకుండా, పూర్వపక్షం ప్రత్యేక సూత్రంలోను, సిద్ధాంతం ప్రత్యేక సూత్రంలోనూ ఏర్పడి ఉన్నట్లుగా తెలియాలి. పూర్వపక్ష సిద్ధాంతాల వివరణం ఈ విధంగా ఉన్నది.

"శ్రుతేస్తు శబ్దమూలత్వాత్ అనేది సిద్ధాంత సూత్రం. బ్రహ్మమే జగత్కారణమని పలు అధికరణాలలో స్థాపింపబడింది. శ్రీ వేదాంతదేశకులు అచ్యుత శతకంలో" పురుషప్రధానశరీరో భువనానాం భవసి అచ్యుత! ఉపాధానమ్, నిజసంకల్పసనాథో వహసి నిమిత్తత్త్వమప్యద్భుతశక్తిః" అని అనుగ్రహించిన రీతిలో ఉపాదాన కారణం కూడా బ్రహ్మమే కనుక, లోకంలో మృత్తికయే కుండగా పరిణమించేటట్లు, బ్రహ్మమే జగత్తుగా పరిణమిస్తున్నదని చెప్పాలి. బ్రహ్మం నిరవయవం, అది జగత్తుగా పరిణామించవలసి ఉన్నది, ఏకదేశేన పరిణమిస్తున్నదనే పక్షంలో బ్రహ్మం నిరవయవం అని చెప్పే శ్రుతి విరోధిస్తుంది. అందుచేత బ్రహ్మం జగత్కారణం అయ్యే అవకాశం లేదు— అనే పూర్వపక్షమే ముందు సూత్రంలోని అర్థం. దీనిని కొంచెం వివరిస్తాను.

ఇంతకుముందు ఉపసంహారాధికరణంలో "క్షీరవద్ధి" అనే క్షీరదృష్టాంతం ఇవ్వబడింది. క్షీరదృష్టాంతం పొసగదు, ఎందుకంటే క్షీరం సావయవం అయినందున, దానివలె బ్రహ్మం సావయవం అని అనాలి. ఆ విధంగా గ్రహిస్తే నిరవయవత్వ శ్రుతి విరోధిస్తుంది. నిరవ యవం అయితే, బ్రహ్మం కృత్స్నభాగంలోనూ పరిణామాన్ని పొందినది కావాలి. ఆ విధంగా కానివ్వండి అంటే, అంతా ఒక కార్యంగా పరిణమించినట్లయితే ఇంకొక కార్యంగా పరిణమించే ప్రసక్తి లేనే లేదు. అందుచేత బ్రహ్మ కారణత్వవాదం పొసగదు— అని ఈ విధంగా పూర్వపక్షం రాగా, దానిపై సిద్ధాంత ఈ విధంగా చేయబడుతున్నది.

పై పూర్వపక్షాన్ని ఖండిస్తూ సిద్ధాంతాన్ని తెలిపే సూత్రం ఏమంటే, "శ్రుతేస్తు శబ్దమూలత్వాత్" అనేది. "తు" అనే శబ్దం పూర్వపక్షాన్ని వ్యావర్తింపజేస్తున్నది. బ్రహ్మం నిరవయవం, అది కార్య వస్తువుగా పరిణమిస్తున్నది– అనే ఈ రెండు శ్రుతి సిద్ధమైన అర్థాలు. బ్రహ్మం శబ్దప్రమాణం అనే ఒక్కదాని చేతనే తెలియబడేది. అందుచేత పూర్వం పరిణమించాలి అని ప్రియతి చెప్పడం అనేది లౌకిక పదార్థ దృష్టితో అనేకదా ఈ విధంగా ఒక యాప్ కి కల్పించాలి అంటే బ్రహ్మం తప్ప మిగిలిన వస్తువులలో మాత్రమే కల్పించవచ్చు వచ్చిన పూర్వపక్షం యుక్తం కాదు– అనేది సూత్రార్థం. దీనిని కొంచెం వివరిస్తాను. సావయవం అయిన వస్తువే ఏక దేశంలో పరిణమించడానికి సాధ్యమవుతుందని, నిరవయవం అయిన వస్తువు ఆ విధంగా కొంత భాగంలో పరిణమించకుండా పూర్తిగా పరిణమించాలి అనే ఒక నియతి చెప్పడమనేది లౌకిక పదార్థాల దృష్టిలోనే కదా. ఆ విధంగా ఒక వ్యాప్తి కల్పించాలి అంటే, బ్రహ్మం తప్ప మిగిలిన వస్తువులలో మాత్రమే దానిని కల్పించవచ్చు. బ్రహ్మం విషయంలో కూడా ఈ వ్యాప్తిని గ్రహించే ఆవశ్యకత లేదు. ఎందుకంటే, బ్రహ్మాన్ని మనం శాస్త్రం ద్వారానే తెలుసుకుంటున్నాము. ఆ శాస్త్రం అనేది బ్రహ్మానికి నిరవయవత్వాన్ని, బహు భవనత్వాన్ని, అంటే, అనేక వస్తువులుగా పరిణమించడాన్ని తెలియజేస్తున్నది. అది బ్రహ్మం యొక్క అనిర్వచనీయమైన శక్తి విశేషాలను ఆధారంగా చేసుకుని ఏర్పడినది. అద్భుత శక్తిని కలదైన బ్రహ్మం విషయంలో మనం లౌకిక వస్తు దృష్టిలో చోద్యం చేయడం తగదు. ఒక విషయాన్ని గమనించండి. కన్నులు కలిగినవాడే చూడగలడు, చెవులు ఉన్నవాడే వినగలడు. కంటితోనే చూడగలుగుతున్నాడు, చెవితోనే వినగలుగుతున్నాడు –అనే ఒక వ్యాప్తిని చెప్పాలని అనుకుంటే, బ్రహ్మం తప్ప మిగిలిన వస్తువుల విషయంలో మాత్రమే ఈ విధంగా చెప్పడానికి వీలవుతుంది. "పశ్యత్యచక్షుః శ్రుణోతి అకర్ణః", "అపాణిపాదో జవనో గ్రహీతా" అని వేదంలో చెప్పబడే పరమ పురుషుని విషయంలో ఈ వ్యాప్తి ఏమాత్రం వర్తించదు కదా. అందుచేత, లోకంలో కనిపించే న్యాయాన్ని పురస్కరించుకుని బ్రహ్మ విషయంలో చోద్యం చేయడం తగనే తగదు.

ఇంకా ఒక విషయాన్ని వినండి. పరబ్రహ్మకు జగదాత్మనా పరిణామంవలె, ప్రతివస్తుపూర్ణత్వం శ్రుతిసిద్ధంగానే ఉన్నది. నిరవయవం అయిన బ్రహ్మం ప్రతి వస్తువులో నిండుగా ఏ విధంగా పరిసమాప్య వర్తించే అవకాశం ఉన్నది?అనే చోద్యం చేస్తే, ఆ చోద్యాన్ని కూడా "శ్రుతే స్తు శబ్దమూలత్వాత్" అనే ఈ సూత్రంతోనే నిరాకరించాలి– అని న్యాయ సిద్ధాంజనంలో శ్రీవేదాంతదేశికులు స్పష్టంగా అనుగ్రహించారు.

## ప్రయోజనావత్త్వాధికరణంలో సారం

ఇప్పుడు, ఇక, ప్రయోజనావత్త్వాధికరణంలోని ప్రమేయాన్ని గూర్చి ప్రస్తావిస్తాను. పరమ పురుషుడు సర్వశక్తియుక్తుడు కనుక, సత్య సంకల్పుడు కనుక, అతడు సంకల్పమాత్రంతోనే జగత్తును సృష్టిస్తున్నట్లు చెప్పబడే విషయం సంభావితం కాదు. ఎందుకంటే, బ్రహ్మం జగత్తును సృష్టించేటప్పుడు, ఏదైనా ఒక ప్రయోజనం ఉండి తీరాలి. లోకంలో ఒకడు ఒక కార్యాన్ని చేసేటప్పుడు, నిష్ప్రయోజనంగా చేయడు. ప్రయోజనం అనేది తనకు చెందుతుంది, ఇతరులకూ చెందుతుంది. ప్రస్తుతంలో ఆవాప్తసమస్తకాముడైన భగవంతునకు సృష్టిలో ఏ ప్రయోజనం కలిగే అవకాశం లేదు. ఆ విధంగా ఏదైనా ఒక ప్రయోజనం ఉండేటట్లు అయితే, అతనిని అవాప్తసమస్త కాముడు అని అనడానికి వీలు లేదు. సృష్టి ద్వారా భగవంతుని ఏ ప్రయోజనం లేకపోయినా, మన వంటి జీవులకు ప్రయోజనం కలుగుతున్నది అనేదానికి అవకాశం లేదు. ఆధ్యాత్మికాది దుఃఖాలకే హేతువు అవుతున్న సృష్టి అనేది జీవులకు ప్రయోజనం కలిగించే అవకాశం లేదు కదా. భగవంతునకు పక్షపాతిత్వం, నిర్దయత్వం అనే దోషాలను కలిగినవాడని శంకించేటట్లు చేసేటట్లుగా ఉన్నది, జగత్ సృష్టి. అందుచేత భగవంతుడు సృష్టికర్తగా ఉండే అవకాశం లేదు– అనే పూర్వపక్షం ఈ అధికరణంలోని "న ప్రయోజనవత్త్వాత్" అనే మొదటి సూత్రంలో ప్రస్తుతమైనది. ఇక్కడ సృష్టి అనే ఒక పదాన్ని అధ్యాహరించుకోవాలి. సృష్టి అనేది ప్రయోజనంతో కూడినదిగా కావలసి ఉన్నందున, బ్రహ్మం సృష్టికర్తగా ఉండే అవకాశం లేదు– అని ఈ సూత్రానికి అర్థం.

దీనికి తరువాత సిద్ధాంత సూత్రం ఏమంటే— "లోకవత్తు లీలా కైవల్యమ్" అనేది. లోకంలో సార్వభౌముడుగా ఉండేవాడొకడు ప్రయోజనాంతరాన్ని దేనిని ఆశించకుండా, లీలార్థమే బంతిని ఆడడం మొదలైనవానిని చేయడాన్ని చూస్తున్నాము. అందువల్ల అతని అవాప్తసమస్త కామత్వానికి ఏ విధమైన లోటు ఉండదు. ఆ విధంగానే పరమ పురుషుడు కూడా లీలార్థంగానే జగత్ సృష్టిని చేయడంలో ఏ లోటు లేదు— అని భావం. " మన్ పల్ ఉయిర్ కళుమాకి ప్పలపల మాయ మయక్కుక్కళాల్ ఇన్బులు మివ్విళైయాట్టుడైయాన్" అని నమ్మాళ్వారులు, " నాట్టైప్పడై యెన్టు అయన్ ముదలా త్తంద నళిర్ మామలర్ ఉంది వీట్టైప్పణ్ణి విళైయాడుమ్ విమలన్" అని గోదాదేవి అనుగ్రహించిన సూక్తులు ఇక్కడ అనుసంధేయాలు. లోకంలో విషమసృష్టి గోచరిస్తున్నందున భగవానునకు పక్షపాతిత్వం, నిర్దయత్వం— అనే దోషాలు ఉన్నాయని శంకించే అవకాశం ఉన్నది కదా— అని అంటే, ఈ సందేహం " వైషమ్యనైర్ఘృణ్యే న, సాపేక్షత్వాత్, తథాహి దర్శయతి" అనే తర్వాత సూత్రంతో పరిహరింపబడుతున్నది ఆయా జీవులు చేసిన కర్మలకు ధర్మలకు తగినట్లుగా హెచ్చుతగ్గులుగా ఉండే సృష్టి ఏర్పడుతున్నందున పరమపురుషునకు వైషమ్యం కాని, నైర్ఘృణ్యం కాని ప్రసక్తాలు కావు— అని భావం. దీనికి తరువాత కలిగే సందేహానికి తరువాత సూత్రం పరిహారాన్ని తెలియజేయడం గమనించవచ్చు. అది ఉండనివ్వండి.

ఇక్కడ ఇంకొక సందేహాన్ని, దానికి పరిహారం తెలియజేసే విధాన్ని వినండి. కేవలం లీలకోసమే జగత్ సృష్టి జరుగుతున్నదని చెప్పవచ్చునా? అనేక శాస్త్రాలతో ఈ విధంగా పలకడంబు విరోధిస్తున్నది కదా. " విచిత్రా దేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్, పూర్వమేవ కృతా బ్రహ్మన్! హస్తపాదాది సంయుతా" అని మొదలైన సంస్కృత శాస్త్రాలు, "శెన్టు శెన్టాకిలుమ్ కండూ శన్మమ్ కழிప్పాన్ ఎన్నెణ్ణి ఒన్టి ఒన్టి ఉలగమ్ పడైత్తాన్"అని, " ఉయ్య ఉలకు పడైత్త" అని మొదలైన ఆళ్వారుల సూక్తులతోనూ జీవుల ఉజ్జీవనం ప్రయోజనం కలగాలని జగత్ సృష్టి జరుగుతున్నదని తెలుస్తున్నందున, వీటితో విరోధం స్పష్టంగా ఏర్పడుతున్నది కదా— అనే శంక ఇక్కడ

కలుగుతుంది. అయితే, ఆ విధంగా ఏ విరోధం లేదు. ఉభయ ప్రయోజనం ఉన్నప్పటికీ, " లోకవత్తు లీలాకైవల్యమ్" అని సూత్రకారులు పలకడం ప్రాచుర్యాన్ని బట్టి దీనిని కొంచెం వివరిస్తాను. తాను తలచినట్లుగా చేయగల శక్తిని కలవాడైన భగవంతుడు సకలాత్మలను ఏకకాలంలో ముక్తిని పొందించడంలో సమర్థుడై ఉన్నప్పటికీ, స్వాధీన స్వరూప స్థితికులైన ఆత్మలను కర్మవ్యాజంతో చేయి విడచి, శాస్త్రమర్యాదలోనే క్రమ క్రమంగా అంగీకరించాలని సంకల్పించి, లోకాన్ని నిర్వహించే ఈ క్రమం లీలారసేచ్ఛతోనే కనుక, లీలావిభూతి అని ఈ లోకానికి పేరు ఏర్పడి ఉన్నందున, లీలారసప్రాచుర్యం గమనించదగినది.

## ద్వితీయాధ్యాయం– ద్వితీయ పాదం

## సర్వథా అనుపపత్త్యధికరణసారమ్

రెండవ అధ్యాయంలోని రెండవ పాదంలో ఉండే సర్వదా అనుపపత్త్యధికరణంలోని ప్రమేయాన్ని తెలియజేస్తాను. సర్వశూన్యత్వవాదాన్ని చేసే బౌద్ధులలో ఒక పక్షం ఇక్కడ నిరసింపబడుతున్నది. పరబ్రహ్మమే జగత్కారణమని చక్కగా సుస్థాపించడం కోసం ఆవిర్భవించిన ఈ అధ్యాయంలో సర్వశూన్యత్వ వాదాన్ని నిరసించడంలో ఏమి ప్రసక్తి? అని కొందరు భావించవచ్చు. జగత్కారణ వస్తువు ప్రధానమా? లేక, పరమాణువులా? పరమాత్మయా? అనే విచారం ఎప్పుడు ప్రసక్తం అవుతుంది? అని అంటే, నిజానికి జగత్తు యొక్క ఉత్పత్తి అనేది ఒకటి నిరూపించడం సాధ్యమైతేనే, అప్పుడే, ఆ విచారం పొసగుతుంది. పూర్తిగా లేని ఒక కుర్రవానికి తల్లి, తండ్రి ఎవరు? అనే విచారం చేయడమనేది ఉంటుందా? జగత్తుయొక్క ఉత్పత్తి నిరూపించటానికి సాధ్యం కానిదై ఉన్నప్పుడు, ఏది జగత్కారణం? అనే చర్చ ఎందుకు? ఉత్పత్తి అనేది భావం నుండి అంగీకరింపబడుతున్నదా? అభావం నుండి అంగీకరింపబడుతున్నదా? అని ప్రశ్నిస్తున్నాము. భావం నుండి అని అనడం కుదరదు. మట్టి ముద్ద నుండి కుండ మొదలైనవి పుడుతున్నవి– అని అంటే, మట్టి ముద్దను ఉపమర్దించి కదా కుండ

పుడుతున్నది. ఏ కార్య వస్తువు, కారణ వస్తువు ఉపమర్దించకుండా పుట్టడం లేదు– అనే విషయాన్ని మనం గమనిస్తున్నాము. కారణాకారంలోని వినాశమే కదా ఉత్పత్తి అనేది. అది అభావమే కదా. అందుచేత భావంనుండి ఉత్పత్తి లేదు– అని ఏర్పడుతున్నది. ఆ విధంగానే అభావం నుండి కూడా ఉత్పత్తి లేదు అనేది అనాయాసంగా తెలుస్తుంది. అభావం నుండి భావోత్పత్తి సంభవించనే సంభవించదు కదా. అందుచేత ఉత్పత్తి విరూపించడానికి సాధ్యం గానిదిగా ఉన్నందున, ఉత్పత్తికి తరువాత సంభవించేవి అయిన వికారాలు ఏవీ కూడా లేవు అనే విషయం సిద్ధమవుతున్నది. లోక వ్యవహారం అంతా భ్రమ మూలకమే. అందుచేత శూన్యమే తత్వం అని అంటారు సర్వ శూన్యవాదులు. దీనికే మాధ్యమిక వాదం అని పేరు.

"సర్వథా అనుపమత్తేః" అనేది ఇక్కడ సూత్రం. ప్రమేయాలతో ప్రమాణాలు ఏమైనా సంభవించనీ, సంభవించకపోనీ. పూర్వపక్షికి అభిమతమైన శూన్యత్వం సిద్ధించదు కనుక, మాధ్యమికుని దర్శనం అసమంజసమే అని దీని అర్థం. " సర్వం శూన్యం" అని వాదించేవారు తమకు అభిమతమైన ఈ అర్థాన్ని సాధించే రీతిలోని ప్రమాణం ఏదైనా ఒకటి ఉన్నది అని అంగీకరించాలి. ఆ విధంగా అంగీకరించే పక్షంలో వారి సర్వశూన్యవాదం నిర్వీర్యం అవుతోంది. "ప్రమాణం ఏమీ లేదు "అనే పక్షంలో ప్రమాణం లేనందు వల్లనే తమకు అభిమతమైన అర్థం సిద్ధించదు –అని ఏర్పడుతున్నది. ఇదే కాక, "సర్వంశూన్యం" అనే ఈ వాక్యంలో నాస్తిత్వమే కదా వివక్షితం కావాలి. నాస్తిత్వమంటే ఏమి?ఒక రూపాన్ని విడచి ఇంకొక రూపాన్ని పొందడమే నాస్తిపదార్థం కనుక, రూపాంతరంతో అస్తిత్వమే చెప్పబడినదిగా సిద్ధిస్తుంది. మట్టి ముద్ద ఒకటి ఉన్నది. అది నశించగానే "మట్టి ముద్ద లేదు" అని అంటున్నారు. ఈ వ్యవహారంలో కుండ అనే అవస్థే కదా విషయం అవుతున్నది.

లోకంలో అస్తిత్వ నాస్తిత్వాలను వ్యవహరించేవారు "ఇప్పుడు మట్టి ముద్ద ఉన్నది, ఇప్పుడు మట్టి ముద్ద లేదు, ఇక్కడ మట్టి ముద్ద ఉన్నది, ఇక్కడ మట్టి ముద్ద లేదు "అని ఈ విధంగా ప్రదేశాన్ని, కాలాన్ని పురస్కరించుకునే కదా

వ్యవహరిస్తున్నారు. దేశ కాలాలను చేర్చకుండా కేవలం "మట్టి ముద్ద లేదు" అనే ప్రతీతి కాని, వ్యవహారం కాని ఎక్కడా కనబడడం లేదు. "ఇప్పుడు మట్టి ముద్ద ఉన్నది" అని కానీ, "ఇక్కడ మట్టి ముద్ద ఉన్నది "అని కానీ ఒకడు వ్యవహరిస్తే, మట్టి అనే ద్రవ్యానికి పిండత్వావస్థకదా విషయం. "ఇప్పుడు మట్టి ముద్ద లేదు" అని కానీ, "ఇక్కడ మట్టి ముద్ద లేదు" అనే కానీ వ్యవహరిస్తే, పిండావస్థ యొక్క నాశం అనే ఘటత్వాస్త విషయం. అందుచేత నాస్తిత్వవ్యవహారం చేసినప్పటికీ కూడా వేరొక ఆకారంతో అస్తిత్వమే సిద్ధిస్తున్నది –అనే విషయం సర్వానుభవ సాక్షికంగా గమనించవచ్చు>" ఈ వస్తువు ఇక్కడ లేదు" అంటే, ఇంకొక చోట ఉన్నదిగా సిద్ధించి తీరుతుంది. " ఇప్పుడు ఈ వస్తువు లేదు" అని అంటే, ఇంకొక సమయంలో ఉన్నది –అని సిద్ధిస్తుంది. అందుచేత, ఏ విధంగానూ సర్వశూన్యత్వం సిద్ధించదు– అని ఏర్పడుతున్నది. ఏ విధంగా సూత్రానికి పైన అర్థం గ్రహించాలి? అని అంటే, సర్వథా– అన్ని విధాలుగాను, అనుపపత్తేః– తనకు అభిమతమైన సర్వశూన్యవాదం అనుపన్నం కనుక –అని సూత్రంలోని అర్థం. "సర్వప్రకారాలతోను" అనేదానిని శీభాష్యంలో శ్రీ రామానుజులు వివరించేటప్పుడు " సదితి ప్రతిజ్ఞాయాం, అసదితి ప్రతిజ్ఞాయామ్" అని అనుగ్రహించారు. శంకరాభాష్యంలో ఈ విధంగా చెప్పబడలేదు. "అతడు సర్వథా అయోగ్యుడు, ఇతడు సర్వథా మూర్ఖుడు "అని అంటే దీనికి ఏ విధంగా అర్థం గ్రహిస్తామో, ఆ విధంగానే శంకరాచార్యుల వారు అర్థాన్ని గ్రహించారు. శ్రీ రామానుజులు గ్రహించిన అర్థమే వాస్తవంలో సమంజసమైనది. శ్రీరామానుజలకు ఈ అర్థం తోసడానికి ఆధారమైనది ఏది? అని అంటే, నమ్మాళ్వార్ల తిరువాయ్ మొ*ళ్గి* ప్రబంధంలోని " ఉళనెనిల్ ఉళన్ అవనురువ మివ్వురువుకళ్ ఉళనలనెనిల్ అవనరువమివ్వరువుకళ్, ఉళనెన ఇలనెన ఇవై గుణముడైమైయిల్ ఉళనిరుతకైవైయోడు ఒ*ళ్గి*విలన్ పరందే" (1–1–9) అనే పాశురాన్ని దృష్టిలో పెట్టుకొనే ఈ సూత్రంలోని అర్థాన్ని శ్రీరామానుజులు నిశ్చయించారు అనేది నిస్సందేహం. ఆ పాశురానికి ఆఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని గమనిస్తే ఈ విషయం సులభంగా స్పష్టమవుతుంది. ఆ పాశురానికి తమిళ భాషలో వ్రాయబడిన అర్థమే శ్రీభాష్యంలోని

సూక్తిరూపాన్ని పొందింది అనే విషయం సుస్పష్టం.

## ఉభయ లింగాధికరణమ్

ఇప్పుడు మూడవ అధ్యాయంలో కొంచెం విజ్ఞాపన చేస్తాను. ఇంతకు ముందు గడిచిన రెండు అధ్యాయాలలో —మొదటి అధ్యాయంలో జగజ్జనమాధికారణమై, సర్వ శేషి అయిన వస్తువు పరబ్రహ్మమే అని, చతుర్ముఖుడు, శివుడు, ఇంద్రుడు మొదలైనవారు ఆ పరమ పురుషునిచేతనే తన లీలకోసం సృష్టింపబడి, ఉపసంహరింపబడుతున్నారని, ఆ పరమ పురుషుడు ప్రకృతి మండలానికి ఆవలి వైపున నిత్యచూరి సేవితమైన స్థాన విశేషంలో స్వేచ్ఛతో జ్యోతిర్మయమైన దివ్యమంగళ విగ్రహాన్ని స్వీకరించి, అప్రమేయమైన ఆనందాన్ని కలవాడై, తన పాదాలను సేవించేవారికి కూడా అపరిమితమైన ఆనందాన్ని కలిగించే వాడై, సంసారబంధంలోనుండి విడిపడిన ముక్తపురుషుల చేత అనుభవింపబడేవాడై ఉన్నాడు— అని తెలుపడం ద్వారా సంసారులకు భగవదనుభవ కుతూహలాన్ని కలిగించడం కోసం పరమపురుషార్థమైన భగవత్ స్వరూప స్వభావాదులు నిరూపింపబడ్డాయి. ఇక, తరువాత, రెండవ అధ్యాయం ఏమి చేసింది ? అని అంటే, మొదటి అధ్యాయంలో నిరూపింపబడిన అర్ ఎంత మాత్రం కదపడానికి వీలులేనిది అని పరపక్ష ప్రతిక్షేప పూర్వకంగా సాధించడంతోపాటు, ఇది పాంచరాత్ర మనే భగవంతునిచే ప్రణీతమైన శాస్త్ర విశేషంలోకూడా తేలిన అర్థమని నిరూపించి, సకల చేతనా చేతన వస్తువులు పరమపురుష కార్యభూతాలే అనే విషయాన్ని చక్కగా శోధించడం ద్వారా కార్యసామాన్యం పరబ్రహ్మ కార్యమే అనే విషయాన్ని కూడా స్థాపించడం జరిగింది. ఈ విధంగా రెండవ అధ్యాయంతో కూడా పురుషార్థస్వరూపం నిశ్చయింపబడినదని తేలింది. ఈ విధంగా పురుషార్థ స్వరూపం విషయంపబడినప్పటికీ, సంసారులు అనాది వాసనాబలంచేత క్షుద్ర పురుషర్థాలనే కోరడానికి, పరమపురుషార్థ ప్రాప్తిలో ఆసక్తి లేకపోవడానికి కారణం తాము కోరిన పురుషార్థాలు అల్పాస్థిరాలనే విషయాన్న

విచారించి తెలియకపోవడమే –అని భావించిన సూత్ర కారులు ఆ సంసారులకు ఇతర పురుషర్థాలలో వైరాగ్యాన్ని, పరమ పురుషుని విషయములో మిక్కిలి రుచిని కలిగించడం కోసం, కర్మఫలాలు నశించే స్వభావాన్ని కలిగినవి అని పరమపరుషోపాసనా ఫలమైన అపవర్గమనేది నిత్యపురుషార్థం అనేదానిని తెలియజేసి, ఈ మార్గం ద్వారా పరమ పురుషార్థ ప్రాప్తిలో త్వరాతిశయాన్ని కలిగించడం కోసం తర్వాత రెండు అధ్యాయాలను అవతరింప చేశారు. ఇంతకుముందే కర్మ విచారం చేసి, దాని ఫలాలను నశించేవిగా తెలుసుకొని, వైరాగ్యాన్ని పొందినవానికే బ్రహ్మమీమాంసలో అధికారం ఉన్నదని జిజ్ఞాసా సూత్రంలో నిరూపింపబడినందున, మళ్లీ తిరిగి వైరాగ్యాన్ని కలిగించడం కోసం ఈ ప్రయత్నం వ్యర్థం కదా! అని కొందరు సందేహపడవచ్చు. అయినా వినండి. పంచాగ్ని విద్యా నిరూపణంతో విషయాలలో ఇఎటువంటి వైరాగ్యం కలుగుతుందో, అది కర్మ విచారంచేత కలుగదు– అని భావించే, ఈ విధంగా మళ్లీ ప్రయత్నం చేయబడింది. అందుచేత, ఇది నిష్ఫలం కాదు సఫలమే. ఈ మూడవ అధ్యాయంలోని మొదటి పాదంలో పంచాగ్గిని విద్యానిరూపణను చేసి, కర్మ ఫలాలు అన్ని నశించే స్వభావాన్ని కలిగినవి అని, నరుకతుల్యాలని తెలియజేయబడింది. మూడవ అధ్యాయం అనేది పరమ పురుషార్థప్రాప్తికి ఉపాయాన్ని తెలియజేసేది అని, నాల్గవ అధ్యాయం ఉపాయఫలమైన ఉపేయాన్ని తెలియజేసేది అని మనసులో భావించాలి.

**ఉభయలింగాధికరణం మూడవ అధ్యాయంలోని రెండవ పాదంలో ఉన్నది.**

జీవాత్మ జాగ్రత్, స్వప్న, సూషూప్తి, మూర్ఛలనే అవస్థలకు హేతువైన నానా శరీరాలను పరిగ్రహించి, ఆ దశలలో సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు. అటువంటి జీవుని చేత అధిష్ఠింపబడిన శరీరంలో పరమాత్మ కూడా సంబంధాన్ని కలిగి ఉన్నప్పటికీ, ఆ శరీరం వల్ల కలిగే సుఖదుఃఖాది అపురుషార్థంతో లేశం కూడా తనలో

సంబంధం లేకుండా ఉండేవాడు అనే విషయాన్ని, కళ్యాణ గుణ సాగరుడై ఉన్నాడనే విషయాన్ని నిరూపించడం కోసం ఈ అధికరణం ఆవిర్భవించింది.

("న స్థానతోఽపి పరస్య ఉభయలింగం సర్వత్ర హి") అనేది ఈ అధికరణానికి ప్రధానమైన సూత్రం. పరస్య– పరమ పురుషునకు స్థానతః అపి– జీవాదిష్ఠితాలైన నానాశరీరాలలో ఉండడం అనేది ఉన్నప్పటికీ, న– అపురుషార్థమైన సుఖదుఃఖ సంబంధం కలుగదు, దీనికి ఏమి కారణం ఏమి?అంటే, సర్వత్ర హి ఉభయలింగం పరమ పురుషుడు సర్వ శ్రుతి స్మృతులలో హేయప్రత్యనీకత్వం, కళ్యాణగుణాకరత్వం అనే రెండు అసాధారణ ధర్మాలతో కూడినవాడుగా ప్రతిపాదింపబడినందున –అనేది సూత్రంలోని అర్థం.

"అపహతపాప్మా విజరః" అని మొదలైన శ్రుతులలోను, "పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయః సంతి పరావరేశే" ఆని మొదలైన స్మృతులలోను పరమ పురుషుడు సహజంగానే హేయప్రత్యనీకుడుగాను, కల్యాణ గుణాకరుడుగాను ఉన్నాడని చెప్పబడినందున, హేయ ప్రతిభటుడైన ఆ పరమ పురుషునిలో శరీర సంబంధం అనేది అపురుషార్థమైన సుఖదుఃఖానుభవ ప్రాప్తిహేతువు కాదు. అతడు అపహతపాప్మ, అనబడుతున్నాడు. పుణ్య పాప రూపకర్మలలో ఫలం స్పృశించకుండా ఉండడమే అపహతపాప్మత్వం. అంటే, పుణ్య పాప సజాతీయాలైన కర్మలను తాను చేసినప్పటికీ, వాటి ఫలం అవి, ఫలం ఇచ్చే రీతిలోని శక్తిని పొందని విధంగా, ఆ శక్తిని లేకుండా చేయడమే. హేయప్రత్యనికత్వం అనేది ఇదే. ఈ విధంగా విలక్షణ శక్తి యుక్తుడైన పరమ పురుషుని విషయంలో ఏ హేయగుణ సంబంధం ఉన్నా, అది అపురషార్థ సుఖదుఃఖ సముత్పాదకంగా కాబోదు. ఎందుకంటే, హేయదేహ సంబంధమనేది కర్మాధీనం కాకుండా, స్వేచ్ఛాకృతం కనుక.

దీనికి తరువాత ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. పరమ పురుషునకు దేహసంబంధం కర్మ ప్రయుక్తం కాకుండా స్వేచ్ఛాకృతంగానే కానివ్వండి.

హేయసంబంధమనేది వస్తు స్వభావం చేత అపురుషార్థాపాదకం అయి తీరుతుంది కదా. మాంసాసృక్ పూయవిణ్మూత్ర ప్రవాహంలో ఒకడు స్వేచ్ఛగా మునిగినప్పటికీ, హేయ సంబంధం కలిగి తీరుతుంది కదా— అని శంకించవచ్చు. ఇక్కడ తెలియవలసిన తత్త్వం ఏమంటే, హేయత్వమనేది కర్మకృతమే తప్ప, వస్తు స్వభావ ప్రయుక్తం కాదు. సంసార దశలో ఏ వస్తువు అయినా అనుకూలంగా తోచడం, ప్రతికూలంగా తోచడం అనేవి ఆ వస్తు స్వభావాల వల్ల కాదు. ఆ విధంగా అయితే ఏదయినా, ఎవడయినా, నిత్యంగా అనుకూలంగానో, ప్రతికూలంగానో ఉండి ఉండాలి. ఈ విధంగా ఎక్కడా కనిపించడం లేదు. ఈనాడు అనుకూలంగా ఉండేదే మరునాడు ప్రతికూలం అవుతున్నది. అదే ఇంకొకనాడు అనుకూలం అవుతున్న అనుకూలం అవుతున్నది. అందుచేత ఏ వస్తువు అయినా సంసార దశలో అనుకూలంగా ఉండడం, ప్రతికూలంగా ఉండడం అనేవి కర్మకృతమే కనుక, అకర్మవశ్యుడైన పరమ పురుషుడు సర్వ వస్తువులను కలిగినవాడు అయినందున, అనుకూలంగానే ఉంటాయి —అని గ్రహించాలి. అందుచేత, హేయభూతమైన దేహ సంబంధం అనేది పరమ పురుషుని విషయంలో ఆపురుషార్థాపాదకం కాబోదు —అని ఏర్పడుతున్నది.

## సర్వాన్నానుమత్యధికరణ సారం

మూడవ అధ్యాయంలో చివరి పాదంలో ఉండే సర్వాన్నానుమత్యధికరణాన్ని గూర్చి కొంచెం తెలియజేస్తాము. దీనికి ముందు అధికరణలో బ్రహ్మవిద్యానిష్ఠునకు శమం ఆవశ్యకమని చెప్పబడింది. భోజననియమమైన శమం బ్రహ్మవిద్యకు ఉన్నదా? లేదా? అనే దానిని విచారించి నిర్ణయించడంకోసం ఈ అధికరణం ఏర్పడింది.

" సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్" అనేది ఇక్కడ సూత్రం. ఇందులో"చ" శబ్దం అవధారణాన్ని తెలుపుతుంది. ప్రాణవిద్యానిష్ఠుడు ఏ అన్నాన్ని భుజించవచ్చు ?అని అనుమతించడం ప్రాణాపద్దశను గూర్చియే. బ్రహ్మవిత్తు అయిన అధికారివిషయంలో ప్రాణాపద్విషయంగానే కనిపించడం వల్ల— అనేది సూత్రార్థం.

ఇక్కడ పూర్వపక్షం. చాందోగ్యంలో ఐదవ ప్రపాటకంలో ప్రాణ విద్యాప్రకారణంలో "న హ వా ఏవంవిది కించన అన్నం భవతి" అని అధ్యయనం చేయబడుతున్నది ప్రాణవిద్యానిష్ఠునకు అన్నం కానిది ఏదీ లేదు– అని దీనికి అర్థం. ప్రాణ విద్యానిష్ఠునకు నిషిద్ధాన్న భోజనం సర్వథా పొసగుతుంది అని విద్యామహాత్యం చేత ఇందులో ఏ తప్పు లేదు అని చెబుతున్నట్లుగా తెలుస్తున్నది. అల్పశక్తికూడ ప్రాణవిద్యానిష్ఠునకే నిషిద్ధాన్న భోజనం అనుమతింపబడినందున, బ్రహ్మవిద్యానిష్ఠునకు ఆ అనుమతి కైముతిక న్యాయ సిద్ధమే —అనేది ఇక్కడ పూర్వపక్షం.

దీనిని కాదంటూ వచ్చిన సిద్ధాంతం ఏమి? అంటే, బ్రహ్మవిద్యానిష్ఠుడైన ఉషస్తుడు ప్రాణాపద్దశలో ఒక ఏనుగు మావటివాడు భుజించిగా మిగిలిన ఉలవలను భుజించి, దానివల్ల ప్రాణం నిలుపుకున్నాడని, తరువాత ఆ మావటివాడు ఇచ్చిన నీటిని అతడు గ్రహించలేదని ఛాందోగ్యంలో మొదటి ప్రపాఠకంలో (9వ ఖండంలో )ఉషస్త వృత్తాంత ప్రకరణంలో కనిపిస్తున్నది. దీనివల్ల బ్రహ్మవిద్యానిష్ఠునకుకూడా నిషిద్ధాన్న భోజనభక్షణం ఆపద్విషయం అని తెలుస్తున్నందున, ఆహారశుద్ధి ఆవశ్యకమని తెలుస్తున్నందున, బ్రాహ్మణ సామాన్యానికి ఆపత్కాలంలో సర్వాన్నం అనుమతింపబడినట్లుగా కనిపిస్తున్నందున, బ్రహ్మవిత్తు అయిన అధికారి విశేషానికి కూడా సర్వాన్నానుమతి అనేది ఆపత్కాలమాత్ర విషయకమని సిద్ధించేటప్పుడు, అల్పశక్తికుడైన ప్రాణోపాసకునకు కనిపించే సర్వాన్నామతి కూడా ఆపద్విషయకమే అనే విషయాన్ని గూర్చి ప్రత్యేకంగా చెప్పాలా?

## ఆవృత్త్యధికరణసారం

ఇంచుమించుగా ఉపాసన పరంగా గడిచింది, మూడవ అధ్యాయం. ఉపాసనాయొక్క ఫలాన్ని నిరూపించడం కోసం అవతరించింది, నాలుగవ అధ్యాయం. ఇందులో మొదటి అధికరణం ఆవృత్త్యధికరణం. మోక్షానికి ఉపయోగ భూతమైన భగవంతుని ఉపాసనం అసకృత్ ఆవృత్తి రూపం, అంటే, తైలధార వలె అవిచ్ఛిన్న

స్మృతిసంతాన రూపం. ఎందుకంటే, " బ్రహ్మవిదాప్నోతి పరమ్" అని మొదలైన వానిలో విధింపబడ్డ వేదనమనేది అవిచ్ఛిన్న స్మృతి సంతానరూపావస్థను కలిగినది అని శాస్త్రం చెబుతున్నది కనుక —అనే అర్థాన్ని "ఆవృత్తిః అసకృదుపదేశాత్" అనే ఈ సూత్రం చెబుతున్నది.

ఇక్కడ పూర్వపక్షం ఏమంటే— " జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అని మొదలైనవానిలో స్వర్గ సాధనాలుగా విధింపబడిన యాగాదులు ఒకసారి చేసినందువల్లనే ఏ విధంగా స్వర్గం మొదలైన పలు ఫలాలను ఇస్తున్నవో, ఆ విధంగానే ఇక్కడ కూడా "బ్రహ్మవిత్ ఆప్నోతి పరమ్" అని మొదలైనవానిలో మోక్ష సాధనంగా విధింపబడిన భగవచ్చింతన రూపమైన వేదనం కూడా ఒక్కసారి అనుష్ఠించినంతనే మోక్షసాధకంగా అవుతుంది కనుక, అది ఒక్కసారి చేయబడితే చాలు— అనేది పూర్వపక్షం.

**ఈ పూర్వపక్షాన్ని నిరసిస్తూ వచ్చిన సిద్ధాంతం ఏమంటే—**

వేదాంత శాస్త్రాలలో మోక్ష సాధనమైనదానిని తెలియజేసే క్రమాలలో వేదనం, ఉపాసనం, ధ్యానం, ధ్రువాను స్మృతి, సాక్షాత్కారం, భక్తి అనే శబ్దాలు కనబడుతున్నాయి. ఇవన్నీ పర్యాయపదాలనే విషయం నిశ్చయింపబడేటప్పుడు, తైలధారవలె అవిచ్ఛిన్నస్మతి సంతానరూపం అనే నిశ్చయించవలసి ఉన్నది. " భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున! " అని మొదలైన గీతా శ్లోకాలు కూడా దీనినే బలపరుస్తున్నాయి. తరువాత, ఆరవ అధికరణంగా ఆప్రయాణాధికరణం ఉన్నది. "ఆప్రయాణాత్ తత్రాపి హి దృష్టమ్" అనేది అక్కడ సూత్రం. మోక్ష సాధనమైన బ్రహ్మోపాసనం అనేది మరణాంతంగా అనుష్ఠింపబడాలి అని అందులో నిర్ణయింపబడడాన్ని గుర్తించవచ్చు.

## తదధిగమాధికరణసారమ్

"తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేషవినాశౌ, తద్వ్యపదేశాత్" అనేది ఈ అధికరణంలోని సూత్రం. బ్రహ్మవిద్యానిష్ఠునకు సాక్షాత్కారావస్థను పొందిన బ్రహ్మవిద్యా నిష్పత్తి కలిగే సమయంలో బ్రహ్మ విద్యా మహిమచేత పూర్వపాపాలకు వినాశం, ఉత్తర పాపాలకు అశ్లేషం కలుగుతుంది, ఎందుకంటే, శ్రుతిలో ఆ విధంగా చెప్పబడింది కనుక– కానీ సూత్రంలోని అర్థం బ్రహ్మజ్ఞానికి అతడు ముందు చేసిన పాపాలు నశించిపోతాయి, తరువాత అబుద్ధి పూర్వకంగా సంభవించిన పాపాలు తామర ఆకుపై నీరువలె అంటవు అని భావం. ఛాందోగ్య శ్రుతిలో ఉపకోసల విద్యాప్రకారణంలో "యథా పుష్కరపలాశే ఆపో న శ్లిష్యంతే, ఏవం ఏవంవిది పాపం కర్మ న శ్లిష్యతే" అని, ఆ సందర్భంలోనే, వైశ్వానర విద్యాప్రకరణంలో "యథా ఇషీకతూలం అగ్నౌ ప్రోతం ప్రదూయేత, ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" అని బ్రహ్మవిద్య యొక్క ఫలం చెప్పబడింది అందుచేతనే ఉత్తర పాపాలకు అశ్విని పూర్వపాపాలతో వినాశనం చెప్పబడినవి అని తెలియాలి.

### ఇక్కడ పూర్వపక్షం ఏమంటే–

"నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" కర్మఫలాన్ని అనుభవించే కర్మలను తొలగించుకోవాలి –అని బ్రహ్మవైవర్త పురాణంలో చెప్పినందున, కర్మఫలాలను అనుభవించే తీరాలి. బ్రహ్మవిద్య చేతనే కర్మలు తీరిపోతాయి– అని అనడం ప్రశంసాపరమైన వార్త, అంతే– అని ఇక్కడ పూర్వ పక్షం.

### దీనిపైన వచ్చిన సిద్ధాంతం ఏమంటే–

పూర్వ పాపాలకు వినాశం, ఉత్తర పాపాలకు అశ్లేషం బ్రహ్మ విద్యాప్రభావంతో కలుగుతున్నట్లు పలు ఉపనిషత్తులు పలకడం కదనడానికి వీలులేనిది. " నాభుక్తం క్షీయతే కర్మ" అనే వచనం కూడా యుక్తమైనదే. అది బ్రహ్మవిత్తులు కాని సామాన్యుల విషయంగా అన్వయించుకోవడం తగినది. అందుచేత, ఇవి పరస్పరం వైరుధ్యం లేని వచనాలే కాగలవు. " ఎగసి పడి మండే నిప్పు ఇంటిని దహించే తీరుతుంది" అని ఒకడు

పలుకుతున్నాడు. "అంటుకొని మండే అగ్నిని నీరు ఆర్పే తీరుతుంది" అని ఇంకొకడు అంటున్నాడు. వీటిలో పరస్పరవిరోధం ఏ కొంచమైనా ఉన్నదా? "నీరు లేనందువల్ల ఎగసిపడే నిప్పు ఇంటిని కాల్చే తీరుతుంది"– అని, "నీటిని జల్లి ఆర్పితే, ఆ నిప్పు ఉపశమించిపోతుంది"– అని అర్థమవుతున్నది కదా. ఆ విధంగానే, బ్రహ్మ విద్య లేనప్పుడు కర్మలు పలాలను ఇచ్చి తీరుతాయి– అని, బ్రహ్మవిద్యానిష్పత్తి కలిగిన తరువాత కర్మల శక్తి ప్రతిహతమై, లేకుండా పోతుంది –అని సులభంగా తెలియవచ్చు కదా.

## నిశాధికరణ సారం

"నిశి నేతి చేత్–––" అనే ఒక్క సూత్రాన్ని మాత్రమే కలిగినది, ఈ అధికరణం. రాత్రిలో మరణించినవానికి బ్రహ్మ ప్రాప్తి ఉన్నదా? లేదా? అని ఇందులో విచారింపబడుతున్నది. రాత్రి మరణం గూర్చి చాలా తక్కువగా శాస్త్రాలలో చెప్పబడి ఉన్నందున, పరమపురుషార్థమైన మోక్షం అనేది సంభవించదు. పగటి మరణమే శాస్త్రాలలో ప్రశస్తంగా కనిపిస్తున్నది. నిశామరణం దీనికి విపరీతమైనది. " దివా చ శుక్లపక్ష శ్చ ఉత్తరాయణమేవ చ, ముమూర్షతాం ప్రశస్తాని విపరీతం తు గర్హితమ్" అని స్పష్టంగా శాస్త్రం ఉన్నందున, రాత్రిమరణం అధమ గతికే హేతువు అవుతున్నది కనుక, రాత్రిలో మరణించినవానికి బ్రహ్మ ప్రాప్తి సంభవించదు –అని ఇక్కడ పూర్వపక్షం.

### దీనిపై సిద్ధాంతం ఏమంటే–

బ్రహ్మవేత్తలకు కర్మ సంబంధం దేహం ఉన్నంతవరకు మాత్రమే కనుక, నిశామరణం బ్రహ్మవేత్తలకు పాతకం కాబోలు. ఏమేమి ఇంకొంచెం వివరిస్తాము. . పాపకర్మలు ఆరబ్ద కార్యాలని, అనారబ్ధకార్యాలను రెండు విధాలుగా ఉంటాయి. ఇంతే కాక, పూర్వపాపాలని, ఉత్తర పాపాలని రెండు విధాలుగా ఉంటాయి. ఫలాన్ని ఇవ్వడానికి ఆరంభించిన కర్మలు ఆరాబ్ధ కార్యాలు అనబడతాయి వీనినే ప్రారబ్ద కర్మలని కూడా వ్యవహారింపరించడం జరుగుతున్నది. ఫలాన్ని ఇవ్వడం ఆరంభించని దుష్కర్మలు

అనారబ్ధ కార్యాలు అనబడతాయి. సంచిత కర్మలు అనేవి ఇవే. బ్రహ్మవిద్యను సంపాదించడానికి ముందే చేయబడిన పాపాలు పూర్వపాపాలు అనబడతాయి. దానికి తరువాత బుద్ధిపూర్వకంగా పాపాలు సంభవించడానికి ప్రసక్తి లేనందు వల్ల, అబుద్ధి పూర్వకంగా, అగతికంగా సంభవించేవి, ఉత్తర పాపాలు అనబడతాయి. ఈ విషయం ఇంతకుముందే చెప్పబడింది. వీటిలో, అనారబ్ధకార్యాలైన కర్మలు బ్రహ్మ విద్యా సంబంధం కలుగగానే నశించిపోయినందున, ఉత్తర పాపాలు బ్రహ్మవిద్యల విషయంలో అంటవు అని చెప్పబడినందున, ఇక ప్రారబ్ధ కర్మ ఒకటే శేషించి ఉంటుంది. ఆ కర్మ కూడా చరమదేహంతో తీరిపోతుంది కనుక, బంధ హేతువు కాబోదు. అందుచేత బ్రహ్మవేత్తలకు రాత్రి మరణం సంభవించినా, పరమపురుషార్థమైన బ్రహ్మ ప్రాప్తిలో ఏ లోటు లేదు అని చెప్పినట్లు అయినది. "దివా చ శుక్లపక్ష శ్చ"అని పూర్వం ప్రస్తావించిన వాక్యం బ్రహ్మవేత్తలు కానివారి విషయంలోనిది– అని స్పష్టమవుతున్నది.

## దక్షిణాయనాధికరణసారమ్

"అతశ్చ అయనేఽపి దక్షిణే"(4–2–19) రాత్రి మరణం సంభవించినా బ్రహ్మ ప్రాప్తికి ఈ లోటు లేదు –అనేదానికి ముందు అధికరణంలో ఏ హేతువు చెప్పబడిందో, ఆ హేతువుచేతనే దక్షిణాయనంలో మరణం పొందినప్పటికీ బ్రహ్మ ప్రాప్తిలో లోటు లేదు –అనేది సిద్ధమే అయినప్పటికీ,

**ఈ అధికరణంలో అధికంగా సందేహం ఏమి? అంటే,**

తైత్తిరీయోపనిషత్తులో "అథ యో దక్షిణే ప్రమీయతే" అనే మొదలైన వాక్యాలతో దక్షిణాయనంలో మరణం పొందినవారికి చంద్రప్రాప్తి చెప్పబడింది. చంద్రప్రాప్తిని పొందినవారికి పునరావృత్తి కూడా చెప్పబడింది. భీష్ముడు మొదలైన కొంతమంది కూడా తమ మరణం కోసం ఉత్తరాయణాన్ని ఎదురుచూసినట్లు తెలుస్తున్నది. ఈ కారణాల వల్ల దక్షిణాయనంలో మరణించినవారికి బ్రహ్మ ప్రాప్తి సంభవించడంలో ఔచిత్యం లేదు– అనేదే ఆ సందేహం.

**దీనికి పరిహారం ఏమి? అంటే,**

చంద్ర ప్రాప్తివల్ల పునరావృత్తి కలుగుతుంది– అనేది బ్రహ్మవిత్తులు కానివారికి తప్ప, బ్రహ్మ వేత్తల విషయంలో కాదు. బ్రహ్మ వేత్తలు కూడా చంద్రప్రాప్తిని పొందినప్పటికీ, అది మధ్యలో శ్రమను తీర్చుకునే స్థానం, అంతే. బంధహేతువు అయిన కర్మం నశించిపోయింది– అని పూర్వం చెప్పబడిన హేతువుకు ఏ లోటు లేదు కనుక, బ్రహ్మ ప్రాప్తి అవర్జనీయంగానే కలుగుతుంది. భీష్మాచార్యులు ఉత్తరాయణం కోసం ఎదురు చూచినాడు– అనే విషయంలో తెలియవలసిన విషయం ఒకటి ఉన్నది. అతడు మధువిద్యానిష్ఠుడు. మధువిద్యా ప్రభావం చేత స్వచ్ఛంద మరణం కలుగుతుంది. అందువల్ల, యోగప్రభావం చేత, ఉత్తరాయణంలోని గొప్పతనాన్ని తెలియజేయగోరి, అతడు ఉత్తరాయణం కోసం ఎదురు చూసినంత మాత్రంలో దక్షిణాయనంలో మరణం పొందినవారికి బ్రహ్మ ప్రాప్తిలో లోటు కలుగుతుందని చెప్పడానికి వీలు లేదు. అందుచేత, ఈ విధంగా ఇంతవరకు, బ్రహ్మవేత్తలకు రాత్రి మరణం కానీ కృష్ణపక్ష మరణం కానీ దక్షిణాయన మరణం కానీ సంభవించినప్పటికీ, పరమపురుషార్థ ప్రాప్తిలో ఏలోటు లేదు –అని తెలిపినట్లు అయినది.

**చరమసూత్రచర్చ**

మక్తుని ఐశ్వర్యం పరమ పురుషాధీనం కదా. ఆ పరమ పురుషుడు స్వతంత్రుడు కనుక, అతడు తన సంకల్పంతో ఒక సమయంలో ముక్తుని పరమపదంలో నుండిఈ లోకానికి పంపివేసే అవకాశం ఉన్నది కనుక, మోక్షపురుషార్థం కూడా అనిత్యం కావలసి వస్తున్నదే! అని సందేహం తరువాత కలుగుతుంది. ఆ సందేహానికి పరిహారంగా "అనావృత్తిః శబ్దాత్ అనావృత్తిః శబ్దాత్" అనే చివరి సూత్రం అవతరించింది. ఈ సందేహానికి ఏమి సమాధానం? అని అంటే,

అనన్యథా సిదద్ధమైన శ్రుతివాక్యాల ద్వారానే తెలియదగిన విషయాన్ని శాస్త్రం చెప్పినట్లే తెలియాలి. పరమపురుషుడు ఒకడు ఉన్నాడు అనే విషయాన్ని మనం శాస్త్రంతో తెలుసుకుంటున్నాము. ఆ శాస్త్రమే బ్రహ్మవేత్తలకు పునరావృత్తి లేదు అని తెలియజేస్తున్నది. " స ఖలు ఏవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే న చ పునరావర్తతే న చ పునరావర్తతే" అని మొదలైన శాస్త్ర వచనాలను ఇక్కడ స్మరించాలి. అందుచేత ముక్తులకు పునరావృత్తి లేదు అనేదానిని సూత్రకారులు శాస్త్రాన్ని చూపించి స్థాపించారు. పరమపురుషుని చూస్తే, అతడు అడిగేవారు ఎవ్వరూ లేరు లేని స్వతంత్రుడు. శాస్త్రాన్ని కాదని చేయడానికి అతడు ఆశక్తుడు ఏమీ కాడు. స్వాతంత్ర్య మైశ్వర మపర్యనుయోజ్య మాహుః" అని చెప్పబడే స్వాతంత్ర్యంతో ఈశ్వరుడు ఏదైనా ఒక పనిని చేయాలని అనుకుంటే, శాస్త్రం అడ్డుగా నిలవ గలదా? అని సందేహపడితే, దీనికి సూత్రకారులు చెప్పిన సమాధానం తృప్తిని కలిగించదు. శంకరాచార్యులవారు తమ భాష్యంలో శాస్త్రాన్ని ఉదాహరించడం మాత్రంతో నిలిచిపోయారు. స్వామి భగవద్రామానుజలు దివ్య సూరుల సూక్తిసముద్రంలో గాఢంగా అవగాహించి, అరుదైన గొప్ప అర్థాలను గ్రహించినవారు అయినందున, ఆ దివ్యసూరి వచనాల పరిమళం పరిమళించగా, ఇక్కడ అనుగ్రహించిన సూక్తివిశేషం శ్రీ భాష్యానికి శిఖరంగా ప్రకాశిస్తున్నది. ఆ అర్థవిశేషాన్ని వినండి.

భగవంతుడు సర్వతంత్ర స్వతంత్రుడే అయినప్పటికీ, ఉన్మత్తుడు కాడు, మూర్ఖుడు కాడు, అరసికుడు కాడు, సత్యసంకల్పుడనే పేరు పొందినవాడు, తన మనోరథానికి వ్యతిరేకంగా నడుచుకునేవాడు కాడు. ఒక చేతనుని పొందడానికి ఆ పరమ పురుషుడు ఎంత పాటు పడుతున్నాడో! ఎంతగా కృషి చేస్తున్నాడో! తెలుసునా? అతడు సృష్టి చేయడం, అవతారాలు ఎత్తడం అంతా చేతనులను పొందడం కోసమే కదా. ఎంతో తపఃఫలంగా ఒక చేతనుడు తన వద్దకు వచ్చి చేరితే, అతనిని లభించిన తరువాత కూడా, అతనిని విడచి పెడతాడా! అనే అభిప్రాయాన్ని " న చ పరమపురుషః సత్యసంకల్పః అత్యర్థప్రియం జ్ఞానినం లబ్ధ్వా కదాచిదావర్తయిష్యతి" అని అంటూ

అత్యంత మధురమైన దివ్యసూక్తులతో తెలియజేసి, శంకాపరిహారాన్ని చాలా అందంగా ముగించారు. ఇందులో" పరమ పురుషః, జ్ఞానినం, లబ్ధ్వా" అనే శ్రీసూక్తి విన్యాసమనేది శ్రీరామానుజుల మనస్సులో తిరువాయ్ మొ*ఴ్రి* దివ్య ప్రబంధామృత సాగరం విజృంభించిన అలలతో ఎగసిపడే రీతిని మనకు తెలియజేస్తున్నది. "యానొట్టి ఎన్నుళ్ ఇరుత్తువమెన్టిలన్ తానొట్టి వందు ఎన్ తని నెంజై వంజిత్తు, ఊనొట్టినిన్జు ఎన్నుయిరుళ్ కలందు ఇయల్వానొట్టుమో! ఇని ఎన్నై నెకి*ఴ్రి*క్కవే", " వారికొణ్డు ఎన్నై వి*ఴ్రు*జ్గవన్ కాణిలెన్టు అర్ వు*ఱ్ఱ* ఎన్నైయొ*ఴ్రి*య ఎన్నిల్ మున్నమ్ పారిత్తు, తన్ ఎన్నై ము*ఱ్ఱ* ప్పరుకినాన్ కారొక్కుమ్ కాట్కరైయప్పన్ కడియనే" అనే పాశురాల దివ్యార్థ సౌరభంతో శ్రీభాష్య మహాగ్రంథాన్ని పూర్తి చేశారు– అనే విషయాన్ని ఉభయవేదాంతరసికులు మాత్రమే గ్రహించగలరు– అని ఈ మాత్రం విజ్ఞాపించి, ఈ శ్రీ భాష్యసారామృత గ్రంథాన్ని పూర్తి చేస్తున్నాము.

**ఎంబెరుమనార్ తిరువడిగళే శరణమ్.**

**శ్రుతిషు స్మృతిషు ప్రమాణతత్వం కృపయాలోచ్య విశుద్ధయా హి బుద్ధ్యా,**

**అకృత స్వత ఏవ భాష్య రత్నం జయ! రామానుజ! హస్తిధామ్ని నిత్యమ్.**

**శ్రీ కాంచీ ప్రతివాది భయంకరమ్**

**అణ్ణంగరాచార్య స్వామివారు రచించిన**

**శ్రీభాష్య సారామృతం పూర్తి అయినది.**